Sankarabharanam-anuvada kathalu
Translated stories in Telugu
Version 1.0
October 2022

Sharada
Brisbane
Australia
https://neelambari.blog/
Sbmurali2003@yahoo.com.au

# కథానుక్రమం

# ముందుగా ఒక మాట

కథారచనతో పాటు అనువాద ప్రక్రియ కూడా నేనెంతో ఆసక్తితో సాగించే వ్యవహారం.

కొన్ని కథలు చదివినప్పుడు ఇవి ఒక ప్రాంతానికో, ఒక సమయానికో చెందిన కథలు కావు-ఎవరికైనా, ఎక్కడైనా, ఎప్పుడైనా అన్వయించగలిగే కథలు అనిపిస్తుంది. నాకలాటి అభిప్రాయం స్వర్గీయ కుటుంబరావుగారి కథలు చదివినప్పుడు మొదటిసారి కలిగింది. అందుకే సహజంగా నా అనువాద రచనా ప్రస్థానం ఆయన కథలు ఆంగ్లంలోకి అనువదించడంతో ప్రారంభం అయింది. ఇరవైఒకటో శతాబ్దం మొదట్లో నేను చేసిన తెలుగు నించి ఆంగ్ల అనువాదాలను నిడదవోలు మాలతిగారు తమ తూలిక అంతర్జాల పత్రికలో వేసి నన్ను ప్రోత్సహించారు.

ఆ తరవాత మొపాస్సా, చెహోవ్ లాటి లబ్ధ ప్రతిష్ఠులయిన కథకుల కథలు చదివినప్పుడు, పైన చెప్పినటువంటి సార్వజనీకతే కనిపించింది. అప్పుడే ఆంగ్ల సాహిత్యంలోని ఆణిముత్యాలని తెలుగులోకి అనువదించాలన్న ఆలోచన వొచ్చింది. అలా గత పదేళ్ళలో నేను అనువదించిన కొన్ని కథల సంకలనమే ఈ శంకరాభరణం. ఈ కథలు చాలా వరకు ఈమాట పత్రికలోనూ, కొన్ని సారంగ పత్రికలోను వచ్చినవి. ఈ కథలను తమ పత్రికల్లో ప్రచురించి నన్ను ప్రోత్సహించిన సంపాదకులకు కృతజ్ఞతలు. చెహోవ్, మొపాస్సాలతోపాటూ, ఆస్ట్రేలియా, న్యూజీలాండ్ కథా రచయితల కథలు కూడా ఇందులో వున్నాయి.

కథానువాద ప్రక్రియలో అనువాదకులు రెండు ముఖ్య విషయాల మీద దృష్టి పెట్టాల్సి వుంటుంది.

మొదటిది కథాంశం. అనువాదానికి నేను ఎన్నుకునే కథలకి సార్వజనీకతే ప్రధాన కారణం. స్థల కాలాదులకి అతీతంగా వుండే కథా, కథనమూ నన్నెక్కువగా ఆకట్టుకుంటాయి కాబట్టి వాటినే ఎక్కువగా అనువాదానికి ఎన్నుకుంటాను.

"అరే, ఇలాటిదే మన వూర్లో కూడా జరిగింది కదా," అని అనిపించే కథలే మనల్ని మనుషులన్న ఒకే గొడుగు కిందకి చేరుస్తాయి. ఎక్కడ బ్రతికినా, ఎలా బ్రతికినా, సాంఘికంగా, రాజకీయంగా, సాంస్కృతికంగా, ఆర్థికంగా, ఎలాటి తేడాలున్నా, మన ఆశలూ, సుఖాలూ, దుఃఖాలూ, కన్నీళ్ళూ, నవ్వులూ, అన్నీ, ఆకలి దప్పుల్లాగే ఒకే రంగులో వుంటాయి. మానవ జాతి చరిత్రలో ఇంతకంటే విచిత్రమైన, అద్భుతమైన విషయం ఇంకోటుంటుందనుకోను. ఈ సంగతిని మనకి మళ్ళీ మళ్ళీ గుర్తు చేసే కథాంశాలే అనువాదానికి నేనెన్నుకునే కథల్లో ఎక్కువగా వుంటాయి.

అనువాద ప్రక్రియలో రెండో ముఖ్య అంశం భాష. ప్రతి భాషకీ దానికే ప్రత్యేకమైన నుడికారమూ, ధ్వనీ, సామెతలూ, భావ ప్రకటనా పద్ధతీ వుంటాయి. మూలభాషలో వున్న వాక్యాలని యథా తథంగా అనువదించడం ఒక అనువాద

పద్ధతి. అలా కాకుండా, ప్రతీ వాక్యానికీ, భావానికీ సమానార్థకంగా అనువాద భాషలోని నుడికారాన్నీ, భావ ప్రకటననీ వాడుకునే పద్ధతి ఇంకోటి. వ్యక్తిగతంగా నాకు రెండో పద్ధతి ఎక్కువగా నచ్చుతుంది. దీనివల్ల అనువాద కథ తానే ఒక మూలకథలా స్వతంత్రంగా నిలబడగలదు. ఇవే కాక, వివిధ ప్రాంతాల యాసలూ, హాస్యమూ అనువాద ప్రక్రియని కొంచెం కష్ట తరం చేయగల విషయాలు.

కొన్ని కథలని యథాతథంగా అనువాదం చేసినా, కొన్నిటిని స్థలాలూ పేర్లూ మార్చి స్వేచ్ఛానువాదం కూడా చేసాను.

భారతీయ సంగీతంలోనూ, పాశ్చాత్య సంగీతంలోనూ సమానంగా ప్రసిద్ధమైన రాగం. కర్ణాటక సంగీతంలో ధీర శంకరాభరణం అన్నా, హిందుస్తానీ పద్ధతిలో బిలావల్ అన్నా, పాశ్చాత్య సంగీతంలో సి-మేజర్ అన్నా - దాని స్వరాల్లోంచి కురిసే జీవధార ఒకటే. అందుకే ఈ కథాహారాన్ని శంకరాభరణం అన్నాను.

# శారద

# కొవ్వుపుంజి

(మార్చి 2012 ఈమాట)

(గీ-ద-మొపాస్సా)

కొన్ని రోజులుగా ఓడిపోయిన సైనికులు మందలు మందలుగా ఆ ఊరి గుండా ప్రయాణిస్తున్నారు. వాళ్ళిప్పుడు సుశిక్షితులైన సైనికులు కాదు, కేవలం చిన్న చిన్న రౌడీ మూకల్లాటి గుంపులు. మురికి బట్టలతో, బవిరి గడ్డాలతో, నాయకుడు లేక నిరాసక్తంగా సాగిపోతున్నారు. మానసికంగా, శారీరకంగా అలిసిపోయి, ఆశయం కొద్దీ కాకుండా, అలవాటు కొద్దీ అడుగులేస్తున్నారు. నడక కూడా అసాధ్యమనిపించినప్పుడు నిలబడ్డ చోటే చతికిలబడుతున్నారు. వాళ్ళల్లో కొంత మంది పాపం మామూలు పౌరులు! యుద్ధాల గురించీ, మరణాల గురించీ, గాయాల గురించీ ఏమీ తెలియని శాంతి కాముకులు. ఆ రైఫిళ్ళ బరువు కింద ఒరిగిపోతున్నారు. మరి కొంత మంది యుద్ధం అంటే ఏదో ఆట అనుకునే అమాయకులు. పోరాటానికీ, పారిపోవటానికీ సమానమైన ఉత్సాహం చూపే స్వచ్ఛంద సైనికులు! కొంత మంది మాత్రం నిజమైన సైనికులు. పాపం, ఓటమి భారంతో కృంగిపోతూనే కొంచెం వడి వడిగా అడుగులేస్తున్నారు. ఇంకొంతమంది ఫక్తు దోపిడీ దొంగల ముఠాలు!

విజేతలైన ప్రష్యనులు రూన్ నగరంలో కొచ్చేస్తున్నారన్న పుకారు బయల్దేరింది. అంతే, అప్పటివరకూ చుట్టు పక్కల అడవుల్లో శత్రువుల కొరకు గాలిస్తూ, చీమ చిటుక్కుమంటే తుపాకీలు తీసే నేషనల్ గార్డు సభ్యులు, చడీ చప్పుడు లేకుండా తమ తమ ఇళ్ళల్లోకి దూరిపోయారు. అందర్నీ హడలెత్తించిన వాళ్ళ యూనిఫారాలూ, ఆయుధాలు మంత్రించినట్టు మాయమై పోయాయి.

ఆఖరి ఫ్రెంచి సైనికులూ, వారి వెనకగా ఇద్దరు సైనికుల మధ్య తలవంచుకొని ఓటమితో కలిగిన దిగ్భ్రాంతి నుంచి ఇంకా తేరుకోలేని దైన్యంతో నడుస్తున్న వాళ్ళ సేనాధిపతి, సీన్ నదిని దాటి వెళ్ళిపోయారు.

ఆ తర్వాత ఆ ఊరు నిశ్శబ్దమైపోయింది. ఆ ఊరి ప్రజలు గుండెలు అర చేతిలో పట్టుకుని రాబోయే విజేతల కోసం ఎదురు చూస్తున్నారు. బ్రతుకంతా స్తంభించి పోయినట్టయింది. దుకాణాలు మూసివేసారు. వీధులన్నీ నిర్మానుష్యంగా వున్నాయి. నరాలు చిట్లిపోయే టెన్షన్‌తో రాబోయే విపత్తు ఊహిస్తూ గడపటం కంటే ఆ శత్రువు రాకే మంచిదేమో!

ఆ రోజు మధ్యాహ్నామే జర్మను సైన్యం ఊళ్ళోకి దిగింది. అర్థం కాని భాషలో ఆజ్ఞలు ఇస్తూ అధికారులు, బెటాలియన్ల కొద్దీ సైన్యమూ ఆ ఊరిని హక్కు భుక్తంగా అనుభవించటానికన్నట్టు దర్పంగా వచ్చాయి. నగర వాసులంతా గడ గడా వణికిపోతూ ఇళ్ళల్లో దూరి తలుపులేసుకున్నారు. ఏదో మానవశక్తి ఆపలేని భయంకర ఉపద్రవం ముంచుకు వస్తుందని తెలిసి, దానికోసం ఎదురు చూస్తున్న వాళ్ళలా వున్నారు వారంతా!

చిన్న చిన్న గుంపుల్లో జర్మను సైనికులు ఒక్కో ఇంటి తలుపూ తడుతున్నారు. తెరవగానే దూసుకు లోనికి ప్రవేశించి ఇంటిలోకి కనుమరుగౌతున్నారు. వాళ్ళతో చాలా మర్యాదగా ప్రవర్తిస్తున్నారు ఆ ఊరి పౌరులు. అవును మరి! విజేతలతో విభేదించటానికుంటుందా?

మెల్లిగా కొద్ది రోజులకి ప్రజలు భయాన్నించి తేరుకున్నారు. నిజానికి సంవత్సరం క్రితం అదే నగరంలో ఫ్రెంచి సైనికుల ప్రవర్తనా, అధికార దురహంకారమూ ఇప్పుడొచ్చిన జర్మను సైనికులకంటే తక్కువేమీ కాదు. వాళ్ళు ఆ మొరటు తనానికి అలవాటు పడిపోయారు.

అయితే గాలిలో ఏదో తేడా, ఏదో పరాయి భావన; ఇళ్ళల్లో జొరబడుతూ, తింటున్న తిండి రుచి కూడా మార్చివేసే దుర్భరమైన పరాయి వాతావరణం! విజేతలు పీడించి డబ్బు లాక్కున్నారు.

పౌరులు మాట్లాడకుండా వాళ్ళడిగినంతా ఇచ్చుకున్నారు. నిజానికి వాళ్ళంతా ధనికులే. కానీ ధనికులైన నార్మన్ వర్తకులు ఎంత ఎక్కువ ధనం సంపాదిస్తే, ఆ డబ్బు అప్పనంగా వదులుకోవడానికి అంత ఎక్కువ బాధపడతారు. అది వారి నైజం!

అయినా అప్పుడప్పుడూ నదిలో తేలుతూ జర్మన్ సైనికుల శవాలు –- ఫ్రెంచి ప్రజలు సాధించిన పగకి ప్రతీకారంగా. అలాటి దేశ భక్తుల వీరోచిత గాధలను పౌరులు గుస గుసలుగా చెప్పుకుని, తమ మీద యుద్ధంలో గెలిచిన జర్మన్ల మీద వాళ్ళ కసినంతా తీర్చుకునేవారు. ఇంకొన్ని రోజులకి అంతా సద్దుమణగటంతో వర్తకులకు మళ్ళీ తమ వ్యాపారాన్ని చేసుకోడానికి ధైర్యం వచ్చింది. అలాటి వాళ్ళల్లో కొందరు వ్యాపార రీత్యా హావ్రే నగరానికి వెళ్ళాలనుకున్నారు. రకరకాల జర్మను అధికారులను మచ్చిక చేసుకుని వాళ్ళు ఆ వూరు వదిలి వెళ్ళటానికి కావల్సిన అనుమతి పత్రాలు సంపాదించుకున్నారు.

ఒకనాటి మంగళవారం తెల్లవారు ఝాముమున ఒక గుర్రపు బగ్గీ పది మంది ప్రయాణీకులతో బయల్దేరింది. చలికి నేలంతా ముడుచుకుని పోయి ఉంది. అంతకు ముందు రోజు ఆగకుండా మంచు కురిసింది. తెల్లవారు ఝాముమున నాలుగు గంటలకి ప్రయాణీకులంతా బగ్గీలో సర్దుకుని కూర్చున్నారు. చలికి వారంతా గడ గడా వణుకుతూ వున్నారు. చిరు చీకట్లలో ఒకరి రూపం ఒకరికి అంత బాగా తెలియటం లేదు. ఇద్దరు మగవారు మాత్రం ఒకరినొకరు గుర్తు పట్టుకుని పలకరించుకున్నారు. ఇంకొక మూడో వ్యక్తి వాళ్ళతో వచ్చి కలిసాడు.

“నా భార్య నాతో ప్రయాణం చేస్తుంది,” ఒకతను అన్నాడు. “నా భార్య కూడా!”, “మా ఆవిడ కూడా!” మిగతా ఇద్దరూ అన్నారు.

మొదటి వ్యక్తి గుస గుసగా అన్నాడు, “మేం తిరిగి రూన్ రాదల్చుకోలేదు. హావ్రే నుంచి ఇంగ్లండు వెళ్ళే ప్రయత్నం చేస్తాము.” మాటల్లో ఆ ముగ్గురూ అదే ఉపాయంతో ఉన్నట్టు అర్ధమైంది. దట్టంగా మంచు కురవటం మొదలైంది. బగ్గీ నడిపేవాడు ఒక పెద్ద లాంతరుతో

ముభావంగా వచ్చి గుర్రాన్ని బగ్గీకి కట్టాడు. అంతా సరిగ్గా వుందో లేదో చూసుకున్నాడు. ఇంకొక గుర్రాన్ని తీసుకు రావటానికి వెళ్తూ నిలబడ్డ మగవారిని చూసాడు.

“లోపలికెళ్ళి కూర్చోండి! బయట చలిగా వుంది!” ముగ్గురు మగవాళ్ళూ ఆ మాటతో బగ్గీ లోపలికెళ్ళి కూర్చున్నారు. వారి వారి భార్యలను భద్రంగా బగ్గీ చివర కూర్చోపెట్టారు. తరువాత మిగతా నలుగురూ మాట్లాడకుండా ఎక్కి మిగతా స్థలాల్లో సర్దుకుని కూర్చున్నారు. కిందంతా మెత్తటి గడ్డి పరచి వుంది. వెనక వున్న ఆడవారు వెచ్చటి చెప్పులేసుకున్నారు. ఆఖరికి బగ్గీకి ఆరు గుర్రాలు కట్టింతరువాత బయటినించి ఒక గొంతు “అందరూ ఉన్నట్టేనా?” అని అరిచింది. “ఉన్నాం లే, పద!” లోపలినించి జవాబొచ్చింది.

గుర్రపు బగ్గీ బయల్దేరింది. విపరీతంగా కురిసిన మంచు వల్ల ప్రయాణం నత్తనడక నడుస్తోంది. గుర్రాలు మధ్య మధ్యలో కాలు జారుతూ కూడా ఈడ్చుకుంటూ చెర్నాకోల తగిలినప్పుడల్లా కొంత వేగం పెంచి నడుస్తున్నాయి. చీకటిని చిన్న చిన్న దీపాలు ఏమాత్రం తరమ లేక పోతున్నాయి. సమయం భారంగా సాగుతోంది.

ఇంతలో తెల్లవారింది. దూది పింజల్లా, చీకట్లో మెత్తని కాంతిని వెదజల్లే వెలుగు రవ్వల్లా అనిపించే సన్నని మంచు జల్లుల వాన ఆగిపోయింది. దట్టమైన నీలి మేఘాల మధ్య సందు చేసుకొని ప్రసరించే మసక వెలుతురు ఇంటి కప్పులపై రాజ్యమేలుతున్న మంచుకుప్పల తెల్లదనంతో పోటీపడుతున్నది.

తెల్లవారి వెలుతురులో బగ్గీ లోపల ప్రయాణీకులు ఒకరినొకరు కుతూహలంగా చూసుకున్నారు. చివర అన్నిటి కంటే మంచి సీట్లలో శ్రీమాన్, శ్రీమతి లూసో కూర్చున్నారు. లూసో పేరు పొందిన సారా వర్తకులు. ఆయన ఒకప్పుడు ఇంకొక సారా వ్యాపారి వద్ద గుమాస్తాగా పని చేసేవారు. క్రమేపీ యజమాని వ్యాపారాన్ని తనే కొనుక్కుని వృద్ధిలోకి తెచ్చారు. ఆ క్రమంలో చెప్పలేనంత ధనాన్ని ఆర్జించారని వినికిడి. నిజానికి ఏ మాత్రమూ రుచి

బాగుండని సారాయిని ఆయన చవకగా అమ్ముతారు. వ్యాపారంలో కుతంత్రాలకు ఆయన పెట్టింది పేరు. అన్నిటికంటే ఆయన హాస్య ప్రియత్వం విచిత్రమైనది! స్నేహితులమీదా, బంధువుల మీదా ఆయన చేసే వ్యాఖ్యలూ, వేసే జోకులూ అందరికీ బాగా తెలుసు. కొంచెం పొట్టిగా లావుగా నెరుస్తున్న జుట్టుతో వుంటారాయన. ఆయన భార్య పొడవుగా, గంభీరంగా, వాళ్ళ ఇంట్లో వుండే క్రమశిక్షణకి మారు పేరులా హుందాగా వుంది.

వాళ్ళ పక్కనే, అంతే హుందాగా వున్నారు, శ్రీమాన్ లామడోన్! ఆయన ఎంతో ప్రసిద్ధి చెందిన నూలు వర్తకులు. ఎన్నెన్నో గౌరవ పురస్కారాలూ, సత్కారాలూ అందుకొన్నారు. రాజకీయాల్లో కూడా ఆయన చాలా ప్రసిద్ధుడు. ఆయన శ్రీమతి, ఆయన కంటే ఎంతో చిన్నదిగా, అందంగా వుంది. సన్నగా, తీగలా చలికి ముడుచుకుని అందరి వైపూ చూస్తుందావిడ.

ఆమె పక్కనే తమ శ్రీమతితో సహా కూర్చున్నవారు, కౌంట్ హ్యూబెర్ట్ బ్రెవీల్. నార్మండీకి చెందిన అతి పురాతన రాచవంశాలలో వారిదొకటి. కొంచెం వయసు పైబడ్డట్టున్నా, కౌంట్ సహజమైన రాచరికపు ఠీవీ, దర్పమూ తెలుస్తూనే వున్నాయి. జన్మ సంజాతమైన రూపు రేఖలకి ఆయన శ్రద్ధగా మెరుగులు కూడా దిద్దుకున్నారు. ఆయనలో కొంచెం మహారాజు నాలుగో హెన్రీ పోలికలు కనబడతాయి. ఎందుకన్నది దేవ రహస్యం! కౌంట్ హ్యూబెర్ట్‌కీ, లామడోన్‌కీ రాజకీయ బంధుత్వం వుంది. ఆయనకి తగ్గదే ఆయన శ్రీమతి కౌంటెస్ హ్యూబెర్ట్. ఆమె కూడా తన అందచందాలకీ, తమ ఇంట్లో ఏర్పాటు చేసే విందు భోజనాలకీ, రాచరికపు కుటుంబాల్లో వాళ్ళకున్న పలుకుబడికీ పేరు పొందారు. రాచరికపు కుటుంబాలన్నీ ఆవిడ ఇచ్చే విందుల్లో పాల్గొనటానికీ, ఆహ్వానం సంపాదించటానికీ పోటీలు పడతారు. బ్రెవీల్ లో వాళ్ళ ఎస్టేటు విలువ దాదాపు అయిదు లక్షల ఫ్రాంకులుంటుందని అంచనా!

బగ్గీలో వెనక భాగంలో కూర్చున్న వీళ్ళారుగురూ ఫ్రాన్స్ లోని గొప్ప కుటుంబీకులు. డబ్బూ, అధికారమూ, పరపతీ అన్నీ వున్న అదృష్టవంతులు. బగ్గీలో వున్న ఆడవాళ్ళంతా ఒకే వైపు కూర్చున్నారు. కౌంటెస్ హ్యూబెర్ట్ పక్కన ఇద్దరు క్రైస్తవ మిషనరీకి చెందిన సిస్టర్లు

కూర్చున్నారు. ఇద్దరూ చేతిలో రోజరీలను తిప్పుతూ భగవద్ధ్యానంలో వున్నారు. అందులో ఒక నన్ వృద్ధురాలు. మొహం మీద స్ఫోటకం మచ్చలతో జీవితంలో ఎన్నో ఢక్కామొక్కీలు తిన్నదానిలా ఉన్నారామె. ఆమె పక్కనే కూర్చున్న ఇంకొక సిస్టరు కొంచెం వయసులో చిన్నదైౖ కాస్త ఆకర్షణీయంగానే వున్నా, చాలా బలహీనంగా వుంది. ఆ సిస్టర్లిద్దరికీ ఎదురుగా ఒక స్త్రీ, ఒక పురుషుడూ కూర్చొని ఉన్నారు. అందరూ వాళ్ళిద్దరినీ పరిశీలనగా చూడసాగారు.

ఆ మగవాడు అందరికీ సుపరిచితుడే! కోర్నుడెట్! ప్రజాస్వామ్యవాది. మర్యాదస్థులందరూ అసహ్యించుకునే పోకిరీ! అడ్డమైన స్నేహితులందరితో కలిసి తండ్రి ఇచ్చిన సంపదనంతా తగలేసాడు. కొత్త ప్రభుత్వం వస్తే తన దరిద్రం తీరుతుందని ఎదురు చూస్తున్నాడు. యుద్ధంలో పని చేద్దామని వెళితే వీలు పడలేదు. నిజానికి అంత దుర్మార్గుడేమీ కాదు! యుద్ధంలో నగరాన్ని పటిష్ఠం చేయటానికి చాలా మందితో కలిసి వ్యూహాలు పన్నాడు! పనికూడా చేసాడు. ఇప్పుడు హావ్రే నగరానికెళ్ళటానికి బగ్గీలో కూర్చున్నాడు.

అతని పక్కన కూర్చుని ఉందొక స్త్రీ! ఆమెని గుర్తు పట్టగానే అక్కడున్న మిగతా స్త్రీలందరూ నిర్ఘాంత పోయారు. మెల్లిగా వారిలో వారు గుస గుసలు పెట్టుకున్నారు. “సిగ్గులేని మొహం”, “తగుదునమ్మా అంటూ వీధిలోకొచ్చింది”, పెద్దగానే మాటలు వినపడటంతో ఆమె తలెత్తి చూసింది. ఆ చూపులో కనిపించిన తిరస్కారానికీ, ఆత్మ విశ్వాసానికీ జడిసి అందరి నోళ్ళూ మూత పడ్డాయి. అందరూ తలలు తిప్పుకున్నా, ఒక్క లూసో మాత్రం ఆమె వంక కుతూహలంగా, నిశితంగా చూడసాగాడు.

ఆమె వేశ్యా కులానికి చెందినది. ఆమె స్థూలకాయం చిన్నప్పట్నించి ఊళ్ళో అందరికీ తెలిసిందే! అందుకే ఆమెనందరూ “కొవ్వుపుంజి” అని వెక్కిరిస్తారు. ఆమె బొద్దుగా, గుండ్రంగా ఉంది. ఆమె చేతి వేళ్ళూ పొట్టిగా లావుగా ఉన్నాయి. అంత లావున్నప్పటికీ ఆమె అందంగానే వుండటం వల్ల కాబోలు, ఆమెకి ప్రేమికులు ఎక్కువే. ఆమె మొహం ఎర్రగా ఆపిల్

పండులాగుంది. ఒత్తుగా రెప్పలు పర్చుకుని వున్న పెద్ద పెద్ద కళ్ళు, చిన్నని నోరు, మొత్తం మీద చూట్టానికి బాగుంది.

శత్రువు రాకతో ఏకమైన మిత్రుల్లాగా ముగ్గురు స్త్రీలు దగ్గరికి జరిగి ఎన్నడూ లేని స్నేహ భావంతో ముచ్చటించుకుంటున్నారు. ఇలాటి స్త్రీలందరి వల్లే స్త్రీజాతి గౌరవం మంటగలుస్తుంది. మనమంతా ఎలాగైనా ఒక్కటిగా వుండి కుల స్త్రీలందరి పరువూ కాపాడాలి అని నిశ్చయించుకున్నట్టుంది వాళ్ళా క్షణంలోనే.

వారి వారి భర్తలు కూడా, కోర్నుడేట్‌కి అసంకల్పితంగా వ్యతిరేకంగా ఏకమై, డబ్బు లేని వాళ్ళ వల్ల వచ్చే సమస్యల గురించి మాట్లాడుకుంటున్నారు. ఆ సంభాషణలో ఎన్నో విషయాలు దొర్లి పోతున్నాయి. వాళ్ళ వ్యాపర దక్షతలూ, డబ్బు సంపాదనా, జర్మనీతో యుద్ధ సమయంలో కూడా వాళ్ళు తమ సంపదలనెలా కాపాడుకుందీ వగైరా వివరాలున్నాయి. ముగ్గురూ ఒకరివంక ఒకరు స్నేహ భావంతో చూసుకున్నారు. సాంఘికంగా వేరు వేరు వర్గాలకి చెందినా ప్రధానంగా డబ్బు కులానికే చెంది ఉన్నవాళ్ళవటంతో వాళ్ళ మధ్య ఇదీ అని చెప్పలేని ఆప్యాయత చోటు చేసుకుంది.

బగ్గీ మెల్లగా నడుస్తూ వుండటంతో ఉదయం పది గంటలైనా వాళ్ళు పన్నెండు మైళ్ళైనా దాటలేక పోయారు. మూడు సార్లు మగవాళ్ళూ బగ్గీ లోంచి దిగి కాస్త నడిచొచ్చారు. ప్రయాణీకులకి కొంచెం అసహనం మొదలైంది. మధ్యాహ్నం భోజనం టోట్స్ నగరంలో చేయొచ్చని వాళ్ళనుకున్నారు కానీ, వాలకం చూస్తే రాత్రైనా టోట్స్ చేరేటట్టు కనపడలేదు.

దారిలో ఏదైనా తినటానికనువైన ప్రదేశం కనబడకపోతుందా అని అంతా ఆశతో చూసారు. ఏమీ కనిపించలేదు, సరి కదా, బగ్గీ మంచులో దిగబడిపోయి దాదాపు రెండు గంటల విశ్వ ప్రయత్నం మీద మళ్ళీ రోడెక్కింది.

ఆకలి పెరుగుతున్న కొద్దీ, ప్రయాణీకుల్లో ఉత్సాహం జారిపోసాగింది. దారిలో వున్న చిన్న చిన్న ఎస్టేటులలో కొంచెం తినటానికేదైనా తిండీ, తాగటానికి ఏదైనా వైనూ దొరుకుతాయేమోనని మగవాళ్ళు చాలా ప్రయత్నం చేసారు. కానీ ఊళ్ళ మీద పడుతున్న జర్మను సైనికుల భయంతో ఎవరి ఇంట్లోనూ కనీసం చిన్న రొట్టె ముక్క కూడా దొరకలేదు. దాదాపు ఒంటి గంట ప్రాంతంలో లూసో ఇక ఆకలి బాధని ఓర్చుకోలేనని ప్రకటించాడు. పేగులు కొరికేస్తున్న ఆకలితో సంభాషణ ఏమీ సాగలేదు.

మధ్య మధ్యలో ఎందుకో కొవ్వుపుంజి తన కుర్చీ కింద ఏదో వెతకి మళ్ళీ తలెత్తి అందరి వైపూ ఒక సారి చూసి మాట్లాడకుండా కూర్చుంటుంది. ఆకలితో, చలితో అందరి మొహాలూ పాలిపోయాయి. లూసో ఒక చిన్న రొట్టె ముక్క దొరికితే వెయ్యి ఫ్రాంకులైనా ఇవ్వటానికి తను సిద్ధమేనని నవ్వులాటలా అన్నాడు. ఆయన భార్య ఆయన వైపొకసారి చురుగ్గా చూసింది. ఆమెకి డబ్బు వృధా చేయటమంటే ఎక్కడలేని కోపం! ఆ విషయంలో హాస్యాలెలా చేస్తారో కూడా ఆమెకి అర్థం కాదు.

"నిజం చెప్పాలంటే నా ఆరోగ్యం ఈ మధ్య బాగుండటం లేదు! ఏమైనా తినటానికి తెచ్చుకోనుంటే ఎంత బాగుండేది!" కౌంట్ పెద్దగా అన్నాడు. అక్కడున్న అందరి మనసుల్లోనూ అదే ఆలోచన!

కోర్నుడేట్ తన సంచీలోంచి ఒక రమ్ము బాటిల్ తీసి పక్కవారికొక్క గుక్క తాగమని అన్నాడు. అందరూ మర్యాదగా తిరస్కరించారు, ఒక్క లూసో తప్ప. లూసో సీసా అందుకొని ఒక్క గుక్క తాగి ధన్యవాదాలు చెప్పకుండా తిరిగి ఇచ్చేస్తూ, "బాగుంది! కనీసం కొంచెం సేపైనా ఆకలి బాధ తెలియదు!" అని వ్యాఖ్యానించాడు. "వెనకటి రోజుల్లో దారి తప్పి తిండి దొరకని నావికులు అందరికంటే లావుగా వున్న స్నేహితులని తిని ఆకలి బాధ తీర్చుకునేవారట!" వున్నట్టుండి లూసో అదేదో పెద్ద జోకైనట్టు చెప్పి నవ్వ సాగాడు. అందరి చూపులూ ఒక్క సారే

బొద్దుగా వున్న వేశ్య వైపు మళ్ళాయి. వెంటనే అసహ్యంతో తలలు తిప్పుకున్నారు. కోర్నుడెట్ ఒక్కడే జోకు అర్ధమైనట్టు చిరునవ్వు నవ్వాడు. సిస్టర్లిద్దరూ దేవుడిలా తమని శిక్షించటానికేదో కారణం వుండి ఉండాలన్నట్టు తలలు వంచుకుని ప్రార్ధిస్తున్నారు.

మధ్యాహ్నం మూడు గంటల వేళ ఇక ఆకలి బాధ ఓర్చుకోలేక కొవ్వుపుంజి తన కుర్చీ కింద వున్న బుట్ట బయటికి తీసింది. బుట్టలోంచి ఒక చిన్న పళ్ళెం తీసి ఒళ్ళో పెట్టుకుని బుట్టలోంచి ఒక్కొక్క పదార్ధమే తీసి వడ్డించుకుంది. ఒక వెండి మగ్గూ తీసి పెట్టుకుంది. ముందు రెండు పెద్ద చికెన్ ముక్కలు పెట్టుకుంది పళ్ళెంలో. బుట్ట నిండుగా వున్నట్టున్నాయి తినుబండారాలు. రొట్టెలూ, పళ్ళూ, కేకులూ, చిరు తిళ్ళూ, అబ్బో, మూడు రోజుల ప్రయాణానికి సరిపడేట్టు వున్నాయి. ఒక మూల బుట్టలోంచి నాలుగు వైన్ సీసాలు తొంగి చూస్తున్నాయి.

చిన్న చికెన్ ముక్క పట్టుకుని ఒక రొట్టెతో పాటు నాజూకుగా తినసాగింది ఆమె. అందరి దృష్టీ ఆమె పైనే వుంది. కమ్మటి వంటకాల వాసన బగ్గీ అంతా వ్యాపించింది. అందరికీ ఆకలి గుర్తొచ్చి నరాలు పట్టు తప్పాయి. ఆడవాళ్ళైతే ఆమె మీద అసహ్యాన్నీ కోపాన్నీ పట్టలేకపోయారు. వీలైతే ఆమెని అక్కడికక్కడే ముక్కలు ముక్కలుగా నరికేసి ఆ మంచులో ఆమె శవాన్ని పారేసి వెళ్ళాలనిపించింది వాళ్ళకు.

లూసో మాత్రం చికెన్ మీంచి తన కళ్ళు తిప్పుకోలేకపోయాడు.

“పర్వాలేదే! కనీసం మనలో ఒక్కళ్ళకైనా తెలివితేటలున్నాయి. ఈవిడ చూడండి! ఎంత ముందు చూపుతో తన తిండి సంగతి ఆలోచించిందో!” అన్నాడు. కొవ్వుపుంజి తలెత్తి లూసో వైపు చూసింది.

“మీరు కొంచెం తింటారా? రోజంతా పస్తు ఉండలేరు కదా?” అని మర్యాదగా అడిగింది.

"తప్పకుండా! కాదనే పరిస్థితిలో వున్నానా నేను? నేనింకొక్క నిమిషం కూడా తిండిలేకుండా వుండలేను. మొహమాటాలకి పోయే సమయం కాదిది." ఒక్క సారి చుట్టూ అందరినీ పరికించి చూసి, జనాంతికంగా అన్నాడు, "ఇలాటప్పుడే తోటి మనిషి అవసరం తెలిసేది."

ఒక వార్తా పత్రిక తీసి మోకాళ్ళ మీద పరచుకున్నాడాయన, పాంటు పాడవకుండా. జేబులోంచి ఒక చిన్న కత్తి తీసి చికెన్ ముక్కలోంచి ఒక భాగాన్ని నేర్పుగా కత్తిరించాడు. ఆ తరువాత ఇక దాని పని పట్టాడు.

కొవ్వుపుంజి కొంచెం మొహమాటంగా సిస్టర్లిద్దరినీ కొంచెం ఆహారం తీసుకోమని అడిగింది. వాళ్ళు ఇంకేం వాదించకుండా ఒప్పుకున్నారు. లోగొంతుకలతో ఆవిడకు ధన్యవాదాలు చెప్పి కళ్ళెత్తకుండా మౌనంగా తినసాగారు. కోర్నుడెట్ కూడా వాళ్ళతో చేరిపోయాడు.

గబగబా నములుతున్న శబ్దం తప్ప అంతటా నిశ్శబ్దం. వెనకాల లూసో మెల్లిగా తన భార్యనీ కొంచెం తినమని బ్రతిమాలుకుంటున్నాడు. ఆవిడ కొంచెం సేపు మొండికేసినా ఆకలి దాడికి ఓడిపోయింది. లూసో మెత్తటి గొంతుకతో, "ఏవమ్మా? కొంచెం మా ఆవిడ కూడా తినొచ్చా?" అని స్నేహ పూర్వకంగా అడిగాడు. ఆవిడ చిరునవ్వుతో, "అయ్యో! తప్పకుండానండీ" అంటూ చికెన్ గిన్నెని వాళ్ళకందించింది. వైన్ సీసా మూత తెరిచి ఒకటే మగ్గు వుండటంతో దానినే తుడిచి అందరూ వాడుకున్నారు.

చుట్టూ అందరూ హాయిగా భోంచేస్తూ వుండటం, ఆ కమ్మటి వాసనలూ తట్టుకోలేక కౌంటు, ఆయన శ్రీమతీ, లామడోన్, వారి భార్యామణీ చిత్రవధ అనుభవించారు. ఇంతలో శ్రీమతి లామడోన్ పెద్దగా నిట్టూర్చిన శబ్దం వినిపించింది. అందరూ ఆమె వంక తిరిగి చూసి ఆశ్చర్యపోయారు. ఆవిడ మొహం బయట కురుస్తున్న మంచులా తెల్లగా పాలిపోయి వుంది. ఆవిడ కళ్ళు మూసుకుని, తల ముందుకు వాలిపోయి వుంది. లామడోన్ అందరి వంకా దీనంగా చూసారు. ఎవరికీ ఎం చేయాలో తోచలేదు. ఇంతలో పెద్ద సిస్టరు ఆమె తలని వళ్ళోకి

తీసుకుని మగ్గుతో ఆమెకి రెండు మూడు గుక్కలు వైన్ తాగించింది. శ్రీమతి లామడోన్ మెల్లిగా కళ్ళు తెరిచి ఒకసారి అందరి వైపూ చూసింది. మెల్లిగా చిరునవ్వు నవ్వి, తాను సరిగ్గానే వున్నానని లేవబోయింది. కానీ సిస్టరు ఆమెని అలాగే పొదివి పట్టుకుని ఇంకొంచెం వైను తాగించింది. "ఏమీ లేదు, ఆకలికి కళ్ళు తిరిగి పడిపోయారంతే!" చెప్పింది సిస్టరు.

కొవ్వుపుంజి కొంచెం మొహమాటంగా ఎర్ర పడ్డ మొహంతో, పస్తు వుంటున్న మిగతా నలుగురినీ ఉద్దేశించి, "మీరు కూడా కొంచెం ఎంగిలి పడితే..." అని ఆగిపోయింది. వాళ్ళంతా తనని హేళన చేస్తారన్న భయం ఆమెకి చాలా వున్నట్టుంది.

లూసో అందుకొని, "అవునండీ! ఇలాటి పరిస్థితులలో మనమంతా ఒక్కటే. ఒకరికొకరు సహాయం చేసుకోవాల్సిందే. మీరందరూ కూడా చాదస్తాలేవో పెట్టుకోకుండా సహకరించాలి. మనం టోట్స్ చేరేసరికి రేపు మధ్యాహ్నం కావచ్చు. అంతవరకూ ఏమీ తినకుండానే వుండదల్చుకున్నారా?" అని అందరినీ చీవాట్లేసారు. ఎవరికీ ఏమనాలో తోచలేదు. కౌంటు లేచి హుందాగా ఆవిడవైపు తిరిగి, "మేమంతా మీకెంతో ఋణపడి వుంటామమ్మా!" అన్నాడు. ఆ మాటతో అందరికీ మొహమాటం పోయింది. అందరూ తినుబండారాలున్న బుట్టపై పడ్డారు. దాని నిండా నోరూరుంచే ఎన్నో వంటకాలు, పళ్ళూ, కేకులూ! ఆవిడ చాలా భోజన ప్రియురాలిలాగుంది!

ఆవిడ తిండి తింటూ ఆవిడతో మాట్లాడకుండా వుండటం ఏం మర్యాద? అందుకని ముందు కొంచెం ఇబ్బందిగా సంభాషణ ప్రారంభించారు. ఆవిడ మాటల్లోనూ, ప్రవర్తనలోనూ వాళ్ళూహించిన వెకిలితనం ఏమీ లేకపోవటం చేత మాటలు తరువాత సాఫీగా సాగాయి. వాళ్ళు ఆమెతో లౌక్యంగా, తెలివిగా, మాట్లాడారు. వాళ్ళకు జన్మతః సంక్రమించిన తెలివితేటలూ, ప్రాపంచిక జ్ఞానమూ ఆ సంభాషణల్లో స్పష్టంగా తెలుస్తున్నాయి. కానీ లూసో సతీమణి మాత్రం మాట్లాడకుండా కేవలం భోజనం మీదనే మనసంతా కేంద్రీకరించారు.

సహజంగానే సంభాషణ యుద్ధం వైపు మళ్ళింది. జర్మన్ల నీచత్వాన్ని గురించీ, ఫ్రెంచి వారి సాహసాల గురించీ ఆసక్తిగా చెప్పుకున్నారు. ఎందుకు వారందరూ రూన్ వదిలి పారిపోతున్నారో చెప్పుకున్నారంతా.

కొవ్వుపుంజి చాలా ఉద్వేగంగా తనెందుకు రూన్ నగరం వదిలేయాలని నిశ్చయించుకోవలసి వచ్చిందో వివరించింది.

"ముందుగా ఇక్కడే వుండిపోదామనుకున్నాను. నాకు తిండికేమీ లోటు లేదు. బయట ఎలా వుంటుందో తెలియని పరిస్థితులలో కెళ్ళే కన్నా జర్మన్ సైనికులు అడిగినప్పుడల్లా వాళ్ళని పోషిస్తూ ఇక్కడ వుండటమే మంచిదనుకున్నాను కూడా. కానీ వాళ్ళని నిజంగా చూసే సరికి కోపంతో ఊగిపోయానంటే నమ్మండి! ఆ రోజంతా దుఃఖంతో ఏడ్చాను. నేను మగవాడినై పుట్టివుంటేనా! ఒక రోజు కిటికీలోంచి కింద జర్మన్ సైనికులు నడిచి వెళ్తుంటే చూసాను. నా నౌకరు నన్ను చేతులు గట్టిగా పట్టుకోవటంతో ఊరుకున్నాను కానీ, లేకపోతే ఒక్కొక్కడి నెత్తిన కుర్చీలు పడదోద్దామనుకున్నాను. తరువాత ప్రభుత్వం నన్ను కొంతమంది సైనికులని పోషించవలసిందిగా ఆదేశించింది. వాళ్ళు కొంతమంది మా ఇంటికొచ్చారు. మొదట గడపలో కాలు పెట్టిన వాడిమీద సివంగిలా పడ్డాను. వాణ్ణి గొంతు నులిమి చంపేసేదాన్నే, వాడు నన్ను జుట్టు పట్టుకుని ఈడ్చుకోకపోయి వుంటే! ఆ నేరం వల్ల నేను దాక్కోవలసి వచ్చింది. అందుకే వీలైనంత త్వరగా ఆ ఊరినించి బయట పడ్డాను."

ఆమె సాహసానికీ, పౌరుషానికీ,ధైర్యానికీ చుట్టూ వున్నవాళ్ళంతా నోళ్ళు వెళ్ళబెట్టారు. హఠాత్తుగా ఆమె విలువ వారి దృష్టిలో పెరిగిపోయింది. వాళ్ళంతా పిరికి వాళ్ళు మరి! ఒక్క కోర్నుడెట్ మాత్రం ఆమె వంక చిరునవ్వుతో, దేవుని ముందర భక్తుడు చదివే స్తోత్రపాఠాలను చిరునవ్వుతో వీక్షిస్తున్న జ్ఞానిలా, ఆమె వంక చూస్తూ కూర్చున్నాడు. ఆ తరువాత అతను అందుకుని గంభీరమైన కంఠంతో దేశభక్తిని గురించి సుదీర్ఘంగా ఉపన్యసించాడు.

దురదృష్టవశాత్తూ అతను ఉపన్యాసం చివరిలో నెపోలియన్ని తీవ్రమైన పదజాలంతో విమర్శించాడు. కొవ్వుపుంజి ఎర్రబడ్డ మొహంతో ఆ విమర్శను అంతే తీవ్రంగా ఖండించింది.

ఆవిడ నెపోలియన్ బోనాపార్టీ భక్తురాలు మరి. కోపంతో ఆవిడ మాటలు తడబడ్డాయి. "అబ్బో! పెద్ద నెపోలియన్ని విమర్శించేవారు బయల్దేరారు. ఆయన స్థానంలో మీరుంటే ఏమయ్యేదో! మీవంటి వారే కదా ఆయనని వెన్నుపోటు పొడిచింది. మీవంటివారికి పదవి చేతికి వస్తే ఫ్రాన్సు నరకప్రాయమై పోతుంది."

ఆ మాటలకి కోర్నుడెట్ ఏమీ చలించలేదు. అదే చిద్విలాసపు నవ్వుతో ప్రతి విమర్శ చేయబోయాడు. చూస్తుంటే ఇదేదో పెద్ద వాగ్వివాదం కాబోతున్నట్టనిపించింది. అది బాగుండదని కౌంటు కల్పించుకుని వాదనని ఆపేసారు. "నిజాయితీ నిబద్ధతతో కూడిన ఏ అభిప్రాయాన్నైనా గౌరవించవలసిందే" అని ఆయన ఇద్దరికీ నచ్చచెప్పారు.

అయితే ఇతర స్త్రీలకి మాత్రం ఆవిడ వాదన చాలా నచ్చింది. వారికి సంఘంలో పెద్ద మనుషులకి సాధారణంగా వామ పక్ష సిద్ధాంతాల మీద వుండే అసహనమే వుంది. పైగా స్త్రీలవ్వటం మూలాన నిరంకుశ ధోరణుల్లో ఒక రకమైన అందం కనిపిస్తుంది. వాళ్ళందరికీ ఆ లావాటి స్త్రీ మీద ఆప్యాయత పెరిగిపోయింది. "తక్కువ కులంలో పుట్టినా ఈవిడ భావాలెంత హుందాగా, ఉదాత్తంగా వున్నాయో," అని వాళ్ళందరూ మనసుల్లో అనుకున్నారు కూడా.

చలితో కొవ్వుపుంజి కొంచెం వణక సాగింది. కౌంటెస్ తన వెచ్చటి చెప్పుల జతని ఇచ్చిందావిడకి. శ్రీమతి లామడాన్, శ్రీమతి లూసో వారి చెప్పులని అప్పటికే సిస్టర్లకి ఇచ్చేసి వున్నారు. బగ్గీ బయట లాంతర్లు వెలిగించాడు బండితోలేవాడు. లోపలంతా అంధకారం. వున్నట్టుండి కోర్నుడెట్ వున్న మూల ఏదో కదలిక. లూసో కళ్ళు పొడుచుకుని చూసాడు. అతనికి కోర్నుడెట్ కొవ్వుపుంజి పైన చేయి వేసినట్టూ, ఆవిడ విసురుగా ఆ చేయిని తోసేసినట్టూ అనిపించింది.

దూరంగా టోట్స్ నగరపు దీపాలు కనిపించాయి. అప్పటికి వాళ్ళు ప్రయాణం ప్రారంభించి పధ్నాలుగు గంటలైంది. బగ్గీ టోట్స్ నగరంలో వాళ్ళు బస చేయాల్సిన హోటల్ ముందు ఆగింది. ఉన్నట్టుండి బగ్గీ తలుపు తెరుచుకుంది. భయం రేకెత్తించే సుపరిచితమైన శబ్దాలతో వాళ్ళందరూ ఉలిక్కి పడ్డారు. జర్మన్ భాషలో ఏవో కేకలు!

బగ్గీ ఆగి వున్నా ఎవరూ కదలటానిక్కూడా సాహసించలేదు. కదిల్తే చస్తామేమోనని భయపడ్డట్టున్నారు! ఇంతలో లాంతరుతో బండి తోలేవాడు వచ్చి నిలబడ్డాడు. లాంతరు వెలుగులో అందరూ భయంతో పాలిపోయిన మొహాలతో దయ్యాల్లాగ అనిపించారు. తోలేవాడి పక్కన ఒక జర్మన్ అధికారి మొత్తం యూనిఫారంలో నిటారుగా నిలబడి కనిపించాడు. పొడవుగా సన్నగా వున్న అతని వయసంతేమీ ఎక్కువనిపించలేదు. అందుకేనేమో, పెద్ద పెద్ద మీసాలని పెంచి గంభీరంగా వున్నాడు.

“అందరూ కిందకి దిగండి,” జర్మన్ యాసతో కూడిన ఫ్రెంచి భాషలో భావరహితంగా అన్నాడు. వెంటనే సిస్టర్లిద్దరూ కిందకి దిగారు. ఆ తరువాత కౌంటూ, కౌంటెస్సూ, లామడాన్, ఆయన శ్రీమతీ, లానో, ఆయనతో బాటు ఆయన భార్యా కిందకి దిగారు. దిగుతూనే లూసో “గుడ్-డే సార్!” అని పలకరించాడు. ఆ పలకరింపులో మర్యాద కన్నా లౌక్యమే ఎక్కువగా వుంది. జర్మన్ అధికారి అందరు అధికారుల్లాగే తిరిగి జవాబివ్వలేదు.

కోర్నుడెట్, కొవ్వుపుంజి ఆఖర్న దిగారు. భయపడ్డా వాళ్ళ మొహం మీద జర్మన్ అధికారి పట్ల నిరసన తప్ప ఇంకేమీ కనిపించటంలేదు. ఆవిడ అతి కష్టం మీద తన ఉద్రేకాన్నీ అణుచుకున్నట్టు కనిపించింది. కోర్నుడెట్ వణుకుతున్న చేతులతో తన గడ్డాన్ని నిమురుకుంటున్నాడు. తమ సహచరుల పిరికితనాన్ని చూసి చిరాగ్గా అందరి వంక చూసారిద్దరూ. అందరూ ఒకరి వెంట ఒకరు హోటల్ లోనికి నడిచారు. లోపలికి వెళ్ళగానే జర్మన్ అధికారి వారి పాస్పోర్టులను చూపమన్నాడు. అందరూ మౌనంగా వాటిని

అందించారు. వాటిల్లో రాసి వున్న పేరు వృత్తి వివరాలను చదువుతూ ఫోటోలతో మనుషులని పట్టి పట్టి పోల్చి చూసాడు అధికారి.

“మీరు వెళ్ళొచ్చు,” అని వెనుదిరిగి వెళ్ళిపోయాడు. అందరూ అమ్మయ్య అని ఊపిరి పీల్చుకున్నారు. అందరికీ ఆకలి విపరీతంగా వేస్తుండటంతో హోటల్ యజమానిని తొందరగా భోజనం వడ్డించమని వేడుకున్నారు. ఇద్దరు నౌకర్లు గబ గబా వంటకుపక్రమించారు. ఈ లోగా అందరూ ఎవరికి కేటాయించబడ్డ గదుల్లో వాళ్ళ సామాను పడేసారు. అన్ని గదులూ పొడవాటి కారిడార్ కి అటూ ఇటూ వున్నాయి. గదులు చూసుకొని వచ్చి అందరూ డైనింగ్ హాల్లో భోజనానికి కూర్చున్నారు. ఇంతలో హోటల్ యజమాని వచ్చి

“మీలో ఎలిజబెత్ రూసో ఎవరు?” అని అడిగాడు.

కొవ్వుపుంజి ఉలిక్కిపడి, “నేనే! ఎందుకు?” అంది.

“అమ్మా! జర్మన్ అధికారి మిమ్మలని అర్జంటుగా రమ్మంటున్నారు!మీతో మాట్లాడాలట.”

“నాతోనా?”

“ఎలిజబెత్ రూసో అంటే మీరేనా?”

“అవును! అయినా నేనతనితో మాట్లాడను.”

అందరూ ఇబ్బందిగా చూసారు. ఇప్పుడీమె ప్రతిఘటనతో మళ్ళీ ఏం ముంచుకొస్తుందోనని అందరి భయం. కౌంట్ ఆమె దగ్గరకొచ్చాడు.

“చూడమ్మా! మీ నిరాకరణ వల్ల అందరి ప్రాణాల మీదకొస్తుందో ఏమో! అధికారంలో వున్న వాళ్ళతో తగవులాడటం విజ్ఞత కాదు. బహుశా మీ పేపర్లలో ఏదో వివరం ఉండి ఉండదు.

అందుకే పిలుస్తూ వుండి వుండొచ్చు కదా? కొంచెం ఆలోచించండి," వీలైనంత మృదువుగా అన్నాడు.

అందరూ కౌంటు మాటను బలపర్చారు. అందరికీ అదే భయం వుండటంతో ఆవిడని వేడుకున్నారు, జర్మన్ అధికారితో తలపడొద్దని. ఆఖరికి ఆవిడ లేచి నిలబడింది.

"సరే, మీ అందరికోసం వెళ్ళి ఏం మాట్లాడాలో అడిగొస్తాను."

కౌంటెస్ ఆవిడ చేయందుకుంది. "మీ మేలు ఈ జన్మలో మరిచిపోలేం!" కృతజ్ఞజ్ఞతగా అంది.

ఎలిజబెత్ గదిలోంచి బయటికెళ్ళింది. అందరూ భోజనం కూడా చేయకుండా ఆవిడ కోసం ఎదురు చూస్తున్నారు. ఎవరికి వారే, "ఈ తలపొగరు మనిషిని కాకుండ నన్ను పిలిచినా అయిపోయేది కదా!" అని అనుకున్నారు. పది నిముషాల తర్వాత ఎలిజబెత్ తిరిగొచ్చింది. ఆమె మొహం కోపంతో ఎర్రబడి వుంది.

"దరిద్రుడు! దరిద్రుడాని!" ఆమె కోపంగా గొణుగుతుంది.

అందరికీ ఉత్కంఠ పెరిగిపోయింది. కానీ వాళ్ళెంత అడిగినా ఆమె సంగతేంటో చెప్పలేదు.

ఎవరెన్ని రకాలుగా అడిగినా, "ఏమీ లేదు! మీకు సంబంధించిన విషయం కాదు. నన్ను నమ్మండి!" అని జవాబిచ్చింది. ఇక ఎవరేం మాట్లాడకుండా భోజనాలు మొదలు పెట్టారు. ఈ చిన్న చికాకు వ్యవహారం మినహా భోజనమంతా చాలా బాగుంది. ఆపిల్ పళ్ళ రసమూ, వైనూ, బీరూ అందరూ బాగానే పట్టించారు.

హోటల్ యజమాని ఫోలెన్వీ, అతని భార్యా కూడా వీళ్ళతో పాటే భోజనం చేసారు. ఆయనకి ఆయాసం లాగుంది, ఎక్కువ మాట్లాడలేదు, కానీ ఆవిడ మాత్రం ఆపకుండా మాట్లాడుతూనే

వుంది. ఆవిడ ముందుగా జర్మన్ సైనికుల మీద విమర్శలు గుప్పించింది. ఆవిడకు వాళ్ళు కొంచెం కూడా నచ్చినట్టులేదు. వాళ్ళ రాక ఆమెకెంతో ధన నష్టాన్ని కలగజేసింది. పైగా ఆమె కొడుకులిద్దరూ ఫ్రెంచి సైన్యంలో వున్నారు. మరి జర్మన్ సైనికుల మీద ఆమెకి కోపం వుండటంలో ఆశ్చర్యమేముంది? ప్రధానంగా ఆమె కౌంటెస్ తోనే సంభాషించింది. ఆవిడకి అలా పెద్దింటి స్త్రీతో చనువుగా మాట్లాడే అవకాశం రావటం చాలా సంతోషంగా వుంది.

కొంచెం సేపటి తర్వాత ఆమె కొంచెం గొంతు తగ్గించి రహస్యాలు చెప్పసాగింది. “నువ్వారికే ఎక్కువగా మాట్లాడకు!” ఆమె భర్త ఆమెని హెచ్చరించాడు కానీ ఆమె పట్టించుకోలేదు.

“నిజంగా మేడం! ఈ జర్మన్లు ఇరవై నాలుగ్గంటలూ పంది మాంసమూ, బంగాళా దుంపలూ తప్ప ఇంకేమీ తినరు! పంది మాంసం! కొంచెమైనా శుభ్రత తెలీని మృగాలు. రోజుల తరబడి అలా కవాతు చేస్తూనే వుంటారు. ఇట్నించి అటూ, అట్నించి ఇటూ! ఆ శ్రమంతా దండగ చేయకుండా పంటలు పండించటానికో, రోడ్లు వేయటానికో ఉపయోగిస్తే ఎంత ప్రయోజనం! ఈ సైనికులంత అప్రయోజకులు ఇంకొకళ్ళు వుండరంటే నమ్మండి! మనలాంటి బీదా బిక్కీ జనం కష్టపడి వాళ్ళని పోషిస్తుంటే వాళ్ళు ఎవరిని ఎలా చంపాలా అని సాధన చేస్తుంటారు. వాళ్ళనలా కవాతు చేస్తూ చూసినప్పుడలా నాకు ఇలానే అనిపిస్తుంది. పెద్దగా చదువూ సంధ్యా లేని దాన్ని, నా మాటలు మీకు నచ్చకపోవచ్చు. కానీ వాళ్ళ వల్ల సంఘానికి ఏం ఉపయోగమో చెప్పండి! బయట మిగతావాళ్ళు ఎన్నెన్ని గొప్ప పనులు చేస్తున్నారు? ఎవరినైనా సరే చంపటం మంచిదా మీరే చెప్పండి!సామాన్య జనం పగ తీర్చుకోవటానికో ఇంకేదో కోపం మీదో పరాయిలకి హాని కలగచేస్తే అది నేరం. సైనికులు ఎంత మందిని చంపితే అంత గొప్ప! యుద్ధంలో మన పిల్లలు కూడా చచ్చిపోతున్నారు కదా! ఏమిటో నాకెంత ఆలోచించినా అర్థం కాదు.”

కోర్నుడెట్, "అమ్మా! ఊరికే పక్క వాడి పైకి యుద్ధం ప్రకటించటం అమానుషమే! కానీ మనని మనం రక్షించుకోవటానికి యుద్ధం చేయక తప్పదు. అప్పుడదొక పవిత్రమైన ఆదర్శం అవుతుంది," అన్నాడు గంభీరంగా. ఆమె అతని వంక చూసింది.

"అవును! ఆత్మ రక్షణకి యుద్ధం అవసరమే! కానీ నిజానికి అసలీ రాజులందరినీ హత మారిస్తే అసలు యుద్ధాలే వుండవు."

ఆ మాటలతో కోర్నుడెట్ కళ్ళు మిల మిలా మెరిసాయి.

"మంచి మాట సెలవిచ్చారు!" అన్నాడు.

లామడాన్ ఈ మాటల గురించి ఆలోచన మొదలు పెట్టారు. సైన్యాన్నీ, సైన్యాధ్యక్షులనీ అందర్లాగే గౌరవించినా, ఆయన ఆ మామూలు ఇల్లాలి మాటల్లో వున్న నిజాన్ని గురించి ఆలోచించాడు. వ్యర్థమవుతున్న ఆ సైనిక శక్తిని సరిగ్గా ఉపయోగిస్తే ఇంకా ఎంత ధనాన్ని సంపాదించవచ్చో లెక్కలు వేసాడు.

లూసో భోజనం ముగించి తన గదికి వెళ్ళే ముందర హోటల్ యజమానితో ఏకాంతంగా ముచ్చటించాడు. లూసో గారి మాటలకి యజమాని భారీ కాయాన్నంతా ఊపుతో పడీ పడీ నవ్వాడు. ఏం మాట్లాడాడో కానీ, లూసో దగ్గర ఆరు పెట్టెల వైన్ సీసాలు కొనటానికి ఒప్పుకున్నాడతను. భోజనానంతరం అందరూ అలిసి వారి వారి గదులు చేరుకున్నారు. లూసో మాత్రం తన భార్యని పడుకోమని చెప్పి తను తలుపు దగ్గర కూర్చొని తాళం చెవి రంధ్రం గుండా బయట కారిడార్లోకి తొంగి చూస్తూ కాలం గడిపాడు. ఆయనకదో సరదా! ఆ రకంగా తెలుసుకోవలసిన చాలా విశేషాలని తెలుసుకోవచ్చని ఆయన నమ్మకం!

ఒక గంట తరవాత ఆయన నిరీక్షణ ఫలించింది. ఎలిజబెత్ ఒక నీలిరంగు నైట్ గౌనులో చేతిలో కొవ్వొత్తి పట్టుకుని నడుస్తూ కారిడార్లోకి వచ్చింది. ఒక గదిలోకి వెళ్ళింది, కానీ రెండు నిమిషాల్లోనే బయటికొచ్చింది. ఆమె వెనకే దేనికో ప్రాధేయ పడుతూ కోర్నుడెట్. వాళ్ళు చాలా లోగొంతుకలతో మాట్లాడటం వల్ల వారి మాటలు లూసోకి వినిపించలేదు. కానీ చూస్తే కోర్నుడెట్ ఏదో బ్రతిమాలుతున్నట్టూ, ఎలిజబెత్ అతని ప్రార్థనలని నిరాకరిస్తున్నట్టూ అనిపించింది. కొంచెం సేపటికి అప్రయత్నంగా ఇద్దరి గొంతుకలూ హెచ్చాయి. కోర్నుడెట్ తనని ఆమె పడక గదిలోకి రానివ్వమని అడుగుతున్నట్టూ, ఆమె నిరాకరిస్తున్నట్టూ అర్ధమయింది.

“ఇదేం మూర్ఖత్వం? ఏమిటి నీ అభ్యంతరం?” అంటున్నాడు కోర్నుడెట్.

ఆమె కోపంగా, “ఛీ!ఛీ! జర్మన్లున్న ఈ ఇంట్లోనా.” అన్నది.

ఒక వేశ్య దగ్గరనించి అంత దేశభక్తినీ, నిబద్ధతనూ ఊహించలేదేమో, కోర్నుడెట్ ఒక్క క్షణం నిరుత్తరుడయ్యాడు. అంతలోనే తేరుకుని ఆమె చెంపపైన ఒక చిన్న ముద్దు పెట్టి ఆమెకి అభివాదం చేసి అక్కణ్ణించి వెళ్ళి పోయాడు. అలసిపోయిన లూసో కూడా పక్క చేరాడు. అటు పిమ్మట అంతటా నిశ్శబ్దం రాజ్యమేలింది.

ఉదయం ఎనిమిది గంటలకి బయల్దేరాలని నిశ్చయించుకోవటం వల్ల అందరూ పొద్దున్నే కిందకి దిగారు. కానీ మంచులో కూరుకుపోయున్న బగ్గీ ఏ మాత్రం ప్రయాణానికి సిద్ధంగా లేదు. అసలు బగ్గీ నడిపేవాడు కూడా ఎక్కడా కనిపించలేదు. అతని కోసం గుర్రపు శాలలూ, నౌకర్ల వసతీ అంతటా వెతికారు. ఎక్కడా కనపడలేదు.

అతని కొరకు వెతుకుతూ మగవాళ్ళంతా ఊర్లోకి నడిచారు. ఊరి మధ్య కూడలిలోకి రాగానే వింతైన దృశ్యాలు కంట బడ్డాయి. ఒక వైపు చర్చ్, రెండో వైపు ఇళ్ళూ ఉన్నాయి. ఆ ఇళ్ళల్లో జర్మన్ సైనికులు చిన్న చిన్న పనుల్లో నిమగ్నమై వున్నారు. ఒకడు ఆలుగడ్డలు తొక్కు

తీస్తుంటే, ఒకడు నాగలి దున్నుతున్నాడు. ఇంకొకడు మంగలి దుకాణం చావిడి శుభ్రం చేస్తున్నాడు. ఇంకొక గుబురు గడ్డం సైనికుడు ఒక ఇంట్లో చంటి పాపాయిని లాలించి ఆడిస్తున్నాడు. ఇళ్ళల్లో మగవాళ్ళందరూ యుద్ధానికి పోవటం వల్ల ఒంటరిగా పన్లు చేసుకుంటున్న స్త్రీ జనానికి ఈ జర్మన్ సైనికులు సహాయం చెయ్యటం కొంచెం వింతగా అనిపించింది. ఆ స్త్రీలు సైగల ద్వారా తమ విజేతలకి పనులు పురమాయిస్తున్నారు. కొందరిని కట్టెలు కొట్టివ్వమంటే, కొందరిని వంట పనిలో సహాయం చేయమనీ, ఇంకొకడిని కాఫీ పొడి కొట్టివ్వమనీ అడుగుతున్నారు. మరీ ఒకడైతే ఒక వృద్ధురాలి బట్టలుతుకుతున్నాడు.

ఇదంతా చూసి కౌంటు మహాశయుడు ఆశ్చర్యం పట్టలేక పోయాడు. చర్చి నించి బయటికొస్తున్న ఒక ఉద్యోగిని పట్టుకొని ఈ వింతేమిటని అడిగాడు కూడా. దానికతను, “అయ్యా! నిజానికి వీళ్ళెవ్వరూ ప్రష్యన్లు కారట. వాళ్ళంతా చాలా దూరదేశంలో తమ తమ భార్యా బిడ్డలని వదిలి ఇక్కడకిచ్చారు. ఈ యుద్ధమంటే మనకెంత అయిష్టత వుందో, వాళ్ళకీ అంతే పాపం! అందుకే ఇక్కడ స్త్రీలకి సహాయం చేసి, తమ స్త్రీలకి కూడా ఎవరో సహాయం చేస్తూ వుండి వుండొచ్చన్న ఆశా భావనతో కాలం వెళ్ళదీస్తున్నారు. ఎప్పుడైనా గొప్ప వాళ్ళూ, పెద్ద వాళ్ళే యుద్ధాలు ప్రారంభిస్తారు. ఆఖరికి పేదలే ఒకరినొకరు కనిపెట్టి వుండేది.”

విజేతలకీ పరాజితులకీ మధ్య ఈ సహకార స్నేహాలు కోర్నుడెట్‌కి ఎంత మాత్రమూ నచ్చినట్టు లేదు. అతను తమ సత్రపు బసకి తిరిగి వెళ్ళిపోయి తలుపులేసుకున్నాడు. లూసో, “మనం దేశపు వాకిళ్ళు మళ్ళీ అందరికోసం తెరిచినట్టుంది,” అన్నాడు. లామడోన్, “ఇన్నాళ్ళూ చేసిన హానికి ఇప్పుడు ప్రాయశ్చిత్తం చేసుకుంటున్నట్టున్నారు,” అన్నాడు గంభీరంగా.

ఏమయితేనేం, బగ్గీ నడిపే సారథి మాత్రం ఎక్కడా కనబళ్ళేదు. ఆఖరికి వెతగ్గా వెతగ్గా, ఒక మూల చిన్న పాకలో కాఫీ తాగుతూ కనిపించాడు. అతన్ని చూస్తూనే కౌంటు మహోదయుడు,

“నీకు మేము ఎనిమిదింటికల్లా బయల్దేరాలని చెప్పామా లేదా?” అని అడిగాడు కోపంగా.

“అవును, కానీ నాకు పైనించి వేరే తాఖీదులొచ్చాయండీ,” అన్నాడు బండి వాడు వినయంగా.

“పైనించి వేరే ఉత్తరువులా? ఏమని?”

“అదే, మిమ్మల్ని ఎక్కడికి తీసికెళ్ళటానికీ వీల్లేదని!”

“ఎవరలా ఉత్తరువిచ్చింది?”

“నిన్న తనిఖీ చేసిన జర్మను అధికారి.”

“ఎందుకని?”

“ఏమోనండి! అతన్నే వెళ్ళి అడగండి. నన్ను బగ్గీ తీయొద్దన్నారు, నేను తీయలేదు. అంతే!”

“ఆయనే స్వయంగా చెప్పారా?”

“లేదండి. సత్రపు యజమాని చేత ఉత్తరువు పంపించారు.”

“ఎప్పుడు?”

“నిన్న రాత్రి.”

అందరూ దిగాలు పడి సత్రానికి తిరిగొచ్చి ఫోలెన్వీని అడుగుదామనుకున్నారు, కానీ నౌకరు ఆయన ఆయాసంతో పది గంటలకి ముందు ఎప్పుడూ నిద్ర లేవడని చెప్పారు. జర్మను అధికారిని కలుద్దామంటే అదీ సాధ్యం కాలేదు. ఆయన ఫోలెన్వీని తప్ప ఎవరినీ కలవడు. వేచి వుండటం తప్ప వేరే దారి లేదని అర్థమైంది వాళ్ళందరికీ. ఆడవాళ్ళు వారి వారి గదులు చేరుకున్నారు.

కోర్నుడెట్ ఒక జగ్గు నిండా బీరుతో చలి మంట దగ్గర, ఒక పైపు కాలుస్తూ కూర్చున్నాడు. లూసో "కూర్చొని కాళ్ళు లాగుతున్నా"యంటూ కాస్త వ్యాయామానికి నడుచుకుంటూ ఊళ్ళో కెళ్ళాడు. కౌంటూ, లామడాన్ రాజకీయాల గురించి ముచ్చటించుకోసాగారు. ఫ్రాన్సు దేశపు భవిష్యత్తు గురించి వారు గంభీరంగా చర్చించుకున్నారు. ఒకరు ఆర్లీన్స్ వంశం మీద ఆశలు పెట్టుకుంటే ఇంకొకరు ఒక పెద్ద నేత దేశాన్ని రక్షిస్తాడని అభిప్రాయపడ్డారు. వారి మాటలు వింటూ కోర్నుడెట్ భవిష్యత్ జ్ఞానిలా చిరునవ్వు నవ్వాడు.

సరిగ్గా పది గంటలయ్యేటప్పటికి ఫోలెన్వీ కిందికొచ్చాడు. అంతా వెంటనే ఆయన చుట్టూ మూగారు. అన్ని ప్రశ్నలకీ కలిపి ఆయన ఒకటే జవాబిచ్చారు.

"జర్మను అధికారి నాతో తన అనుమతి అయ్యేంతవరకూ మిమ్మల్నెవరినీ ఇక్కడనించి కదలనివ్వొద్దని నాతో అన్నారు. అంతే నాకు తెలిసింది."

వెంటనే మగవాళ్ళందరూ జర్మను అధికారిని చూడటానికి అనుమతి కోరారు. అధికారి భోజనానంతరం ఇద్దరు మగవాళ్ళు వచ్చి తనని కలుసుకోవచ్చని అనుమతి ఇచ్చాడు. అంటే ఒంటి గంట తరువాతన్నమాట. భోజనాల సమయానికి ఆడవాళ్ళందరూ చేరారు. అందరూ ఏదో ఎంగిలి పడ్డామనిపించారు. ఎందుకనో ఎలిజబెత్ దిగులుగా, పరాకుగా అనిపించింది. వాళ్ళు భోజనం ముగించి కాఫీ తాగుతుండగా అధికారి గుమాస్తా వచ్చి "అయ్యగారు రమ్మంటున్నారని" చెప్పాడు.

లామడాన్, కౌంటూ వెళ్ళబోతుండగా, లూసో తనూ వాళ్ళతో బయల్దేరాడు. అందరూ కోర్నుడేట్‌ని కూడా తమతో రమ్మన్నారు, కానీ అతను కంఠంలో ప్రాణం వుండగా జర్మను అధికార్లతో మాట్లాడనన్నాడు. ముగ్గురు మగవాళ్ళు పైన అధికారి గదికి వెళ్ళారు. జర్మను అధికారి ఒక వాలు కుర్చీలో కూర్చొని పైపు కాలుస్తూ తీరికగా కనిపించాడు. వీళ్ళని చూసి కుర్చీ లోంచి లేవలేదు సరి కదా, కనీసం కళ్ళెత్తి పలకరించను కూడా లేదు. విజేతలకు సహజమైన

అహంకారాన్నే అతను ప్రదర్శించాడు. రెండు మూడు నిమిషాలయ్యాక, తడుముకుంటూ ఫ్రెంచి భాషలో అడిగాడు, "ఎందుకొచ్చారు?" అని. "మేం మా ప్రయాణాన్ని కొనసాగించాలనుకుంటున్నాం."

"వీల్లేదు!"

"మీరెందుకు మమ్మల్ని బంధించారో తెలుసుకోవచ్చా?"

"అది నా ఇష్టం."

"అయ్యా! మేమంతా ఈ ప్రయాణానికి ముందే మీ పై అధికారి వద్ద అనుమతి తీసుకున్నాం. ఇప్పుడు మమ్మల్నే కారణంగా ఇక్కడ ఆపేసారో కూడా మాకర్థం కావటం లేదు. మా మీద ఇంత ఆగ్రహం చూపటం మీకు తగునా?"

"ఇన్ని మాటలనవసరం. మిమ్మల్ని పంపొద్దని నేను నిశ్చయించుకున్నాను. అంతే. మీరిక వెళ్ళొచ్చు."

అందరూ ఆయనకి నమస్కరించి బయట పడ్డారు. మధ్యాహ్నం అందరికీ చిరాకు పుట్టుకొచ్చింది. చేసేదేమీ లేక అందరూ వంటగదిలో దూరి జర్మను అధికారిని శాపనార్థాలు పెట్టారు. ఎందుకు తమ మీద కక్ష బూనాడో అన్నది మాత్రం వాళ్ళ ఊహకందలేదు. బహుశా డబ్బు కోసమేమో! ఆ ఆలోచనతోటే అందరికీ ముచ్చెమటలు పుట్టయి. తమలో అందరికంటే ధనవంతులకి ఆపద ఎక్కువ, అలాగైతే. డబ్బు సంచులతో గుమ్మరించాల్సి వస్తుంది, ఆ జర్మను అధికారిని వదిలించుకోవటానికి. ఒకవేళ అలాటి సందర్భమే వస్తే ఏం చెప్పి తప్పించుకోవాలా అన్న ఆలోచనలు సాగాయి అందరికీ. ఎందుకైనా మంచిదని, లూసో తన ఖరీదైన గడియారాన్ని తీసి దాచేసాడు. రాత్రి దగ్గరవుతున్నకొద్దీ అందరి నిరాశా నిస్పృహలూ పెరగసాగాయి.

భోజనాలకి ఇంకా రెండు గంటల వ్యవధి వుండటంతో శ్రీమతి లూసో పేకాడదామంది. కోర్నుడెట్ కూడా తన పైపు ఆర్పివేసి ఆటలో చేరాడు. ఆటలో అందరూ కాసేపు తమ దిగులునీ, భయాన్నీ మరచిపోయారు. అయితే లూసో, అతని భార్యా తోడు దొంగలని కోర్నుడేట్ కనిపెట్టేసాడు.

సరిగ్గా రాత్రి భోజనానికి ఉప్రక్రమించబోతుండగా ఫోలెన్వీ వచ్చాడు. తన బొంగురు గొంతుతో, "ఎలిజబెత్ తన మనసు మార్చుకుందా అని జర్మను అధికారి అడుగుతున్నాడు," అని ప్రకటించాడు. ఎలిజబెత్ మొహం పాలిపోయింది. అంతలోనే కోపంతో ఎర్రబడింది.

లేచి నిలబడి, " ఆ దరిద్రుడు, ఆ కుక్క, ఆ నీచుడితో చెప్పు. నేను చచ్చినా ఒప్పుకోనని! అర్థమైందా? ఎప్పటికీ! ప్రాణాలు పోయినా సరే!" అని అరిచింది.

ఫోలెన్వీ మాట్లాడకుండా వెళ్ళిపోయాడు. అందరూ ఆశ్చర్య పోయి, ఎలిజబెత్ చుట్టూ చేరారు. ఏం జరిగిందో చెప్పమని వేడుకున్నారు. ఆమె మొదట నిరాకరించింది. కానీ కోపం పట్టలేక పోయింది!

"వాడికేం కావాలా? ఇంకా ఏం కావాలి? ఒక్క రాత్రికి నాతో పడుకుంటాడట!"

అందరూ నిర్ఘాంతపోయారు. కోర్నుడెట్ అక్కడున్న జగ్గు తీసి నేలకేసి కొట్టాడు. అందరూ హాహాకారాలు చేసారు. కౌంటు మనుషుల్లో ఇంత నీచులుంటారా అని ఆశ్చర్యపోయాడు. ఆడవాళ్ళు ఎలిజబెత్ పరిస్థితికి సానుభూతి ప్రకటించారు. ఆమె నిర్ణయాన్ని హర్షించారు కూడా. ఆఖరికి మాటలు చాలించి అందరూ భోజనం చేసారు. ఆడవాళ్ళు తమ తమ గదుల్లోకెళ్ళి పోయారు. మగవాళ్ళు పైపు కాలుస్తూ మళ్ళీ ఏదైనా ఆడుకోవాలనుకున్నారు. ఆటలోకి వాళ్ళు ఫోలెన్వీని కూడా ఆహ్వానించారు. చిన్నగా మాటల్లో పెట్టి అతన్నించి ఏదైనా సమాచారం రాబట్టాలనుకున్నారు. కానీ అతను తన పేక ముక్కల మీద తప్ప ఇంకే ఇతర

విషయాల మీదా ధ్యాస పెట్టలేదు. ఏ ప్రశ్నలకీ జవాబివ్వలేదు. ఇక అతనితో ఎంత సేపు పేకాడినా ఏమీ లాభంలేదని అందరూ ఆట ముగించి లేచారు.

మర్నాడు మళ్ళీ ఆశతో తొందరగానే లేచి కిందకొచ్చారు. ఏదో జరిగి తమ నిర్బంధం వదులుతుందేమోననే ఆశా, ఎలాగైనా ఇకణ్ణించి వెళ్ళిపోవాలనే ఆందోళనా, ఇంకొక్క రోజు ఇక్కడే వుండాల్సి వస్తుందేమోనన్న భయమూ, అన్నీ కలిపి వాళ్ళని చుట్టుముట్టాయి.

లోపలే తిరుగుతున్న గుర్రాలనీ, కట్టేసి వున్న బగ్గీనీ చూసి హతాశులయ్యారు. మళ్ళీ అలా నడుద్దామని వూళ్ళోకి బయల్దేరారు. మధ్యాహ్నం భోజనాలు కూడ నిస్సారంగా గడిచాయి. ఎందుకో అందరికీ ఎలిజబెత్‌ని చూస్తే చిరాకొచ్చింది. రాత్రి అందరూ నిద్ర పోయాక ఆమె తన నిర్ణయాన్ని మార్చుకుని జర్మన్ అధికారిని సంతోషపెట్టి తమకి విముక్తి ప్రసాదిస్తుందని రహస్యంగా ఆశ పడ్డారు. అలా జరగక పోయే సరికి ఒక రకమైన అసహనం బయల్దేరింది అందరిలో. ఆవిడ అలా చేసి ఎవరికీ చెప్పకపోయినా పర్వాలేదు కదా! అలా చేయటం వల్ల ఆమెకొచ్చిన పరువు నష్టం కూడా ఏమీ లేదు. అటువటప్పుడు అలా చేస్తే తమ సమస్య ఎంత తేలికగా తీరిపోయి వుండేది! అలా అనుకుంటున్న కొద్దీ అందరికీ కోపం పెరిగిపోయింది. అయితే అందరూ మర్యాదస్తులు కాబట్టి ఈ ఆలోచనలను పైకి అనలేదు.

మధ్యాహ్నం అందరూ అలా నడిచొద్దామని బయల్దేరారు. వాళ్ళతో ఇద్దరు సిస్టర్లూ, కోర్నుడెట్ మాత్రం చేరకుండా సత్రం లోపలే వుండిపోయారు. అందరూ వెచ్చటి స్వెట్టర్లూ, కోట్లూ తొడుక్కుని వున్నా చలి ఎముకలు కొరికేస్తుంది. ఒంట్లోని రక్తమంతా ఘనీభవించినట్టూ, ఎముకలు విరిగిపోతున్నట్టూ అనిపించే చలి! అడుగు తీసి అడుగు వేయటమే నరక యాతన లాగుంది. కొంచెం దూరం నడిచేసరికి, నిర్మానుష్యంగా వున్న వూరు, దట్టంగా కురుస్తున్న మంచూ అసలే కృంగిపోయి వున్న వారి మనసుల్ని ఇంకా కృంగ దీసాయి.

నలుగురు స్త్రీలూ ముందు నడుస్తుండగా, ముగ్గురు మగవాళ్ళూ వెనక నడుస్తున్నారు. లూసో వున్నట్టుండి, “ఈ పునీతురాలు ఇలా చేయబట్టి మనమంతా ఇక్కడ ఇంకా ఎన్నాళ్ళు

చిక్కుబడిపోతామో," అన్నాడు. కౌంటు మాత్రం తన సహజ గాంభీర్యంతో, "ఏ స్త్రీ నించైనా ఇటువంటి త్యాగం మనం ఆశించలేం! అది ఆమె నిర్ణయానికే వదిలేయక తప్పదు. అంత వరకూ మనం చేయగలిగిందేమీ లేదు," అన్నాడు. లామడాన్, ఒకవేళ ఫ్రెంచి వారు జర్మనులకి బుద్ధి చెప్పాలను కున్నట్టయితే ఆ యుద్ధం ఇక్కడ టోట్స్ నగరంలోనే జరుగుతుందని అన్నాడు. ఆ ఆలోచనకే అందరికీ ఆందోళన పెరిగింది. తాము యుద్ధంలో చిక్కుకుంటామా?

"పోనీ, కాలి నడకన పారిపోవటానికి ప్రయత్నిద్దామా?" లూసో అన్నాడు ఆత్రంగా. కౌంటు ఒప్పుకోలేదు! "కాలినడకనా? ఈ మంచులోనా? స్త్రీలతోనా? సాధ్యం కాదేమో! మనం ఒకవేళ బయల్దేరినా నాలుగడుగులు వేసేసరికి జర్మను సైనికులు మనని వెంబడించి పట్టుకుని, ఖైదులో వేస్తారు కూడా!" అదీ నిజమే అనిపించి అందరూ మౌనంగా వుండిపోయారు.

ఆడవాళ్ళూ ఏవో బట్టల గురించి మాట్లాడుకుంటున్నారు కానీ కొంచెం ముభావంగానే వున్నారు. వున్నట్టుండి వీధి చివర్న జర్మను అధికారి కనిపించాడు. తెల్లగా కురుస్తున్న మంచులో అతని పొడవాటి విగ్రహమూ, దుస్తులూ, బూట్లూ స్పష్టంగా అగుపించాయి. స్త్రీలకి తల వంచి అభివాదం చేసాడు. మగ వాళ్ళ వైపు నిరసనగా ఒక చూపు చూసి వెళ్ళి పోయాడు. వారూ అతనికి అభివాదం చేయలేదు.

ఎలిజబెత్ మొహం ఎర్ర బడింది. మిగతా స్త్రీలందరికీ అలాటి చవకబారు స్త్రీతో కలిసి నడుస్తూ అతని కంట బడటం వల్ల అవమానం ముంచుకొచ్చింది. కొవ్వుపుంజి వైపు జర్మను అధికారి చూసిన హేళనతో కూడిన చూపు వాళ్ళకి భయాన్ని కలిగించింది. అంతా అతని గురించే మాట్లాడుకోసాగారు. లామడాన్ శ్రీమతి, అతనెంతో వున్నత కుటుంబానికి చెందిన వాడిలాగున్నాడంది. చాలా అందగాడని కూడా ప్రకటించింది. అతను ఫ్రెంచి వాడై వుండి వుంటే తామందరూ అతన్ని ప్రేమించే వారిమని కూడా అన్నది.

మళ్ళీ అందరూ సత్రం లోపల చేరారు. ఎవరికీ ఏం చెయ్యటానికీ తోచలేదు. చిరాకులూ, విసుక్కోవటాలూ ఎక్కువైనయి. నిశ్శబ్దంగా అందరూ భోజనం ముగించి పడకలు చేరారు, మర్నాటిని గురించిన ఆశతో.

మర్నాడు అందరి కోపతాపాలు ఇంకా పెరిగిపోయాయి. ఆడవాళ్ళందరూ ఎలిజబెత్‌తో మాటలాడటమే మానేసారు. ఇంతలో చర్చి గంటలు మోగాయి, అందరినీ ఎవరిదో బాప్టిజంకి ఆహ్వానిస్తూ.

ఎలిజబెత్‌కి తన చిన్న కొడుకు గుర్తొచ్చాడు. అతను వెతోత్ నగరంలో ఒక రైతు వద్ద పెరుగుతున్నాడు. ఏడాదికొకసారి వాణ్ణి వెళ్ళి చూసొస్తుందామె. బాప్టిజం గంటలతో తన కుమారుడు జ్ఞాపకం రావటంతో ఎవరిదో అపరిచితుల బాప్టిజం చూడటానికి చర్చిలో కెళ్ళిందామె.

ఆమె బయటికెళ్ళటం కోసమే ఎదురు చూస్తున్నట్టు అందరూ తలుపులేసి ఒక్క దగ్గర చేరారు. ఏదో ఒకటి చేయకపోతే లాభం లేదని అర్థమైంది అందరికీ. జర్మన్ అధికారిని ఎలిజబెత్‌ని మట్టుకు నిర్బంధించి మిగతా అందరినీ వదిలేయమని ప్రాధేయపడదాం, అన్నాడు లూసో. వెంటనే ఈ సందేశాన్ని ఫొలెన్వీతో చెప్పి అధికారి వద్దకు పంపారు. గోడకు కొట్టిన బంతిలా తిరిగొచ్చాడతను. వీల్లేదన్నాడు అధికారి. వెంటనే కోపం పట్టలేని శ్రీమతి లూసో బూతులు లంకించుకుంది.

“మనమంతా ఇక్కడే ముసలి వాళ్ళమైపోయి చస్తామో ఏమో! అయినా ఈ బజారుదానికిదేం పోయే కాలం? అదేదో మహా పతివ్రత ఐనట్టు, పెద్ద నిరాకరణ. రూన్ నగరంలో అయితే బండి వాళ్ళతో సహా ఎవరినీ వదలదు కదా! నాకెలా తెలుసని అడక్కండి, నాకు తెలుసు. అక్కడ మగ పురుగుని దారంట పోనివ్వదు కానీ, ఇక్కడ పెద్ద నీతులు చెప్తుంది. కేవలం మనమీద తనకున్న శక్తి చూపించుకోవటానికే ఈ నాటకమంతా! నన్నడిగితే అసలా అధికారి చాలా మంచి వాడంటాను! మనలాటి కుటుంబ స్త్రీల జోలికి పోకుండా, అదెలాగూ బజారుదేనని

దాన్నడిగాడు! మనల్నెవరైనా అడిగుంటే చచ్చేవాళ్ళం! పెళ్ళైన స్త్రీలంటే అతనికి ఎంత గౌరవమో చూడండి. మనల్నతను బలాత్కరించినా మనం చేయగలిగేదేముంది," అంటూ ఉద్ఘాటించింది. మిగతా ఇద్దరు స్త్రీలూ వణికిపోయారు. శ్రీమతి లామడాన్ కళ్ళెందుకో మెరిసాయి. తననెవరో బలాత్కరించిన దృశ్యం ఊహించుకోవటం వల్ల కాబోలు, ఆమె మొహం మీద ఆవిరి కమ్మింది.

మగవాళ్ళు కూడా గొంతు కలిపారు. ఎలాగైనా కొవ్వుపుంజిని కాళ్ళూ చేతులు కట్టేసైనా సరే అధికారికి అప్పగించాల్సిందేనని తీర్మానించారు. కౌంటు అలాటి మొరటుతనానికి ఒప్పుకోలేదు. తర తరాల నించీ హుందాగా బ్రతుకుతున్న రాచ వంశీయులు. వాళ్ళ పద్ధతులన్నీ నాజూకు గానే వుంటాయి మరి!

"బలవంతం మీద పనులు జరగవు. మనం తెలివిగా ఆమెని ఒప్పించాలి," అన్నాడాయన. అందరూ ఆలోచించి ఒక వ్యూహం పన్నారు. గుస గుసలతో విషయాన్ని చర్చించుకున్నారు. అలాగని ఎవరూ మోటు మాటలు మాట్లాడలేదు. వాళ్ళంతా పెద్ద పెద్ద కుటుంబాల్లో పుట్టి పెరిగిన వాళ్ళు. ముఖ్యంగా ఆడవాళ్ళకి – మాటలతో సాలెగూళ్ళు అల్లటం, ఆకుకు అందకుండా పోకకు పొందకుండా మాట్లాడటం కొత్తగా నేర్పాలా! అక్కడికెవరైనా కొత్త మనిషొస్తే వారికి అక్కడ చర్చిస్తున్న విషయం ఏమిటో ఒక పట్టాన అర్ధం కాదు. అంత జాగ్రత్తగా మాట్లాడుకున్నారు వాళ్ళు.

నిజానికి కొంత సేపయ్యాక వారికీ వ్యవహారమూ, నీతి గురించిన చర్చలూ చాలా సరదాగా అనిపించసాగింది. నేర్పరి అయిన వంట వాడు తను వండిన వంటకాలను కంటికి నదరుగా వుండేటట్టు ఎలా అమరుస్తాడో అలాగే వాళ్ళు తమ వ్యూహాన్ని అందంగా తీర్చి దిద్దుకున్నారు. ఆఖరికి అందరి మనసులూ కుదుట పడ్డవి. కౌంటు కొన్ని కొంటె వ్యాఖ్యానాలు కూడ చేసాడు. ఆయనకి లూసో వంత పాడాడు. ఆ కొంటె మాటలకి ఎవరికీ కోపం రాలేదు సరికదా, అంతా

ముసి ముసిగా నవ్వారు. శ్రీమతి లూసో నిర్మొహమాటంగా, "దాని వృత్తే అది అయినప్పుడు, ఆ అధికారిని నిరాకరించటానికి దానికేం హక్కు వుందీ, అంటాను?" అని అడిగినప్పుడు అందరూ అంగీకరించారు.

కోటను ముట్టడిస్తున్న సైనికుల్లా వాళ్ళ వ్యూహాన్ని మళ్ళీ మళ్ళీ చర్చించుకున్నారు. ఎవరు చేయాల్సిన వాదనలూ, వ్యాఖ్యానాలూ వాళ్ళు మననం చేసుకున్నారు. కొన్ని మామూలు దాడులకీ, ఇంకొన్ని ఆకస్మిక దాడులకీ ప్రణాళికలు సిద్ధం చేసుకున్నారు. కోర్నుడెట్ మాత్రం ఈ వ్యూహ రచనకి దూరంగా వున్నాడు. వాళ్ళు మాటల్లో పడి ఎలిజబెత్ చర్చి నించి తిరిగి రావటం గమనించనేలేదు. వున్నట్టుండి కౌంటు "హుష్" అని సైగ చేసాడు. ఆమెని చూసి అందరూ మాటలాపేసారు. ఒక్క క్షణం అందరూ తేలు కుట్టిన దొంగల్లా మౌనంగా వుండిపోయారు. అందరికంటే ముందు శ్రీమతి కౌంటు తేరుకున్నారు.

"బాప్టిజం బాగా జరిగిందా ఎలిజబెత్?" అనడిగింది స్నేహ పూర్వకంగా.

ఎలిజబెత్ తను చూసిన బాప్టిజంని వర్ణించి, "కొన్నిసార్లు ప్రార్ధనతో మనసు కుదుటపడుతుంది కదూ?" అంది. అందరూ ఆమెతో అంగీకరించారు.

ఆ తరువాత భోజనాల సమయం వరకూ స్త్రీలందరూ ఆమెతో చాలా ఆప్యాయంగా మాట్లాడారు. భోజనాలకి బల్ల వద్ద కూర్చోగానే వాళ్ళ పథకం అమలులో కొచ్చింది. ముందుగా యధాలాపంగా 'త్యాగం' అన్న విషయాన్ని చర్చకి పెట్టారు. పురాణాల్లోవీ, చరిత్రలోవీ త్యాగధనుల కథలు ఏకరువు పెట్టారు. అందరికంటే శత్రు సైన్యాధికారులకి తన అందాన్ని ఎరగా వేసి తన ప్రజలని కాపాడుకున్న క్లియోపాత్రాని నోరారా పొగిడారు. అంతే కాదు, కేవలం వాళ్ళ ఊహల్లోంచి జనించిన కథని కూడా వాళ్ళు చెప్పుకున్నారు. హన్నీబాల్ రోమ్ నగరాన్ని ముట్టడించినప్పుడు ఆ నగరంలోని స్త్రీలందరూ అతన్నీ, అతని సైన్యాధికారులనీ, అతని

సైనికులందరినీ తమ పడక గదుల్లోకాహ్వానించి రోమ్ నగరానికెదురైన ముప్పు తప్పించటానికి సిద్ధపడ్డారట.

శత్రువులకి తమ శరీరాన్ని ఎరగా వేసి, ఆయుధంగా చేసి తమ ప్రజలని కాపాడుకోవటం కంటే స్త్రీ చేయగలిగే త్యాగం ఏముంటుంది అని వారు ఆశ్చర్యపోయారు! అయితే ఒక్కటి మాత్రం ఒప్పుకోవాలి! ఈ విషయాలన్నిటినీ వారు సూచన ప్రాయంగానే చర్చించారు. ఆడవాళ్ళను ఇబ్బంది పెట్టే అసభ్య పదజాలమేదీ వారు వాడలేదు! చాలా నిగ్రహంతో, సభ్యతతో వాళ్ళు విషయం గురించి మాట్లాడుకున్నారు. వాళ్ళ మాటలు విన్న ఏ మనిషికైనా ఆడదాని శరీరం వున్నది అలా శత్రువులనించి తమ పురుషులని కాపాడటానికే అన్న నమ్మకం ఏర్పడుతుంది. అంత ఆవేశంగా వాళ్ళు మాట్లాడారు. ఇద్దరు సిస్టర్లూ, ఎలిజబెత్ మాత్రం ఏమీ మాట్లాడలేదు.

ఆ మధ్యాహ్నమంతా ఎలిజబెత్ ఆలోచిస్తూ వుండిపోయింది. కానీ తనని అందరూ ఇంతకు ముందులా 'మీరు' అనకుండా, 'నువ్వు' అంటున్నారు. సంఘంలో తన స్థాయి ఏమిటో తనకి తెలియజేస్తున్నారా?

మళ్ళీ సాయంత్రం భోజనాలకి బల్ల వద్దకి రాగానే ఫొలెన్వి క్రితం రోజులాగానే పెద్ద గొంతుకతో తన ప్రశ్న వేసాడు.

"ఎలిజబెత్ తన మనసు మార్చుకుందా అని జర్మన్ అధికారి తెలుసుకోగోరుతున్నారు."

"లేదని చెప్పు!" ఎలిజబెత్ గంభీరంగా అంది.

భోజనాల వద్ద మళ్ళీ అందరిని నిస్పృహ కమ్ముకుంది. త్యాగాన్ని గురించి చెప్పుకోవటానికి తలలు బద్దలు కొట్టుకున్నా ఒక్కళ్ళకీ ఒక్క కథా గుర్తు రాలేదు. కౌంటు గారి శ్రీమతి

వున్నట్టుండి మతాన్ని గురించీ, ధర్మాన్ని గురించీ సిస్టర్లతో మాటల్లోకి దిగింది. వాళ్ళ మాటలు మహాత్ముల జీవిత ఘట్టాల్లోకి దారి తీసాయి.

మామూలు మనుషులం పాపమని భావించే చాలా పనులని మహాత్ములు ఆపద్ధర్మంగా చాలా సార్లు చేసారు. అయినా వారిని ఎటువంటి పాపమూ అంటుకోదు. ఎందుకంటే ఆ పాపపు పనులు వాళ్ళు స్వార్ధం కోసం కాక పరుల హితం కొరకు చేసినవి కాబట్టి. అటువంటి పనులను చర్చి క్షమించి వారిని అక్కున చేర్చుకుంటుంది కూడా. అలా చెప్తూ ఇద్దర్లోకి పెద్దదైన సిస్టరు రంగం లోకి దిగింది. అది అమాయకత్వమో, అతి తెలివో తెలియదు కానీ మిగతా అందరికంటే ఆమె ఎక్కువ ఆవేశంగా మాట్లాడింది. అంతవరకూ ఆమెని వాళ్ళంతా ముభావి అనుకున్నారు, కానీ ఆమె వీళ్ళందరికంటే రెండాకులు ఎక్కువే చదివినట్టుంది. ఆమెకి తన చర్చీ, తన సంప్రదాయాలే జీవితం కాబట్టి ఆమె చెప్పేదంతా సాధికారికంగా, కాలాతీతమైన ధర్మం అనిపించేటట్టు చెప్పింది. ఉద్దేశ్యం మంచిదైనప్పుడు పాప కార్యాలని కూడా భగవంతుడు మన్నిస్తాడు అని అనర్గళంగా ఉపన్యసించి ఆమె అందరినీ ఒప్పించగలిగింది.

“అయితే సిస్టర్! నిజంగా భగవంతుడు పరుల హితం కొరకు మనం చేసే పాప కార్యాలనీ క్షమిస్తాడా?” కౌంటు శ్రీమతి అడిగింది.

“నిస్సందేహంగా!”

ఈ రకంగా వారు భగవంతుని అంతర్యాన్ని గురించీ, అతని తీర్పుల గురించీ చర్చించుకున్నారు. మిగతా వాళ్ళ మాటలకంటే ఈ సిస్టరు మాటలు ఎలిజబెత్ ని చాలా కదిలించాయి.

అక్కణ్ణించి సంభాషణ సిస్టర్లిద్దరి దైనందిన జీవితం వైపు మళ్ళింది. వారిద్దరినీ వాళ్ళ కాన్వెంటు హావ్రే నగరానికి క్షతగాత్రుల సేవ కోసమని పంపుతుంది. తనతో వున్న సిస్టరు

క్షతగాత్రుల సేవలో నిష్ణాతురాలని చెప్పిందామె. ఆ తరువాత ఆమె తను చూసిన సైనికుల కష్టాలనీ, వారికైన గాయాలనీ, వారి దుర్భర వేదననీ కళ్ళకి కట్టినట్టు వర్ణించింది. వాళ్ళని వైద్య సహాయంతో సేద దీర్చాల్సిన తామిద్దరూ దురదృష్టవశాత్తూ ఇక్కడ చిక్కుకునిపోయారు. ఎంత మంది ఫ్రెంచి సైనికులు వైద్య సహాయం లేక అలమటిస్తున్నారో, ఎంత మంది చచ్చిపోతున్నారో, అనుకుని నిట్టూర్చిందామె. ఆవిడ మాట్లాడింతరువాత ఆ మాటల ప్రభావం పోతుందో ఏమో నన్న భయంతో ఇంకెవ్వరూ ఏమీ మాట్లాడకుండ పక్కలు చేరారు.

మర్నాడు అందరూ తీరుబడిగా లేచారు. తాము నాటిన విత్తనం మొలకెత్తేంత వరకూ వేచి చూడాలనుకున్నారేమో, ఎవరూ మధ్యాహ్నం భోజనాల వరకూ ఏమీ మాట్లాడలేదు. భోజనానంతరం శ్రీమతి కౌంటు వ్యాహ్యాళి కెళ్ళాలని ప్రతిపాదించింది.

ముందే వారనుకున్న పథకం ప్రకారం కౌంటు కొవ్వుపుంజి చేయందుకుని అందరికీ కొంచెం దూరంగా నడవసాగాడు.

ఆయనలాటి గొప్ప కుటుంబీకులు తక్కువ స్థాయితో మాట్లాడేటప్పుడు ఉపయోగించే చనువూ అధికారమూ కూడిన గొంతుతో ఆయన వెంటనే విషయానికొచ్చాడు. "చూడమ్మా! మమ్మల్నిలా ఇక్కడ చిక్కుబడేలా చేయటం నీకేమైనా బాగుందా, ఒక్క సారి ఆలోచించు. ఇప్పుడు నీతో పాటు మా అందరి బ్రతుకులూ ఆపదలో పడ్డట్టే కదా? దీనికంటే ఆ అధికారి కోరిక మన్నించటం సబబేమో ఒక్కసారి ఆలోచించు! నువ్వెన్ని సార్లు ఎంత మంది కోర్కె తీర్చలేదు?"

ఎలిజబెత్ ఏమీ మాట్లాడలేదు. ఆయన సామ దాన భేదో పాయాలన్నీ ప్రయోగించాడు, తన హుందా ఏ మాత్రం చెడకుండానే. అప్పుడప్పుడూ, చనువుగా, అంతలోకే తండ్రిలా, అంతలోకే కొంటెగా, మళ్ళీ అంతలోకే గంభీరంగా ఆయన కొవ్వుపుంజిని ఉక్కిరి బిక్కిరి చేసాడు తన

వాదనలతో. ఆమె చేయబోయే త్యాగాన్ని మెచ్చుకోవటానికి తనకున్న శక్తి చాలదన్నాడు. అంతలోనూ ఆయన స్వచ్ఛమైన గ్రాంథిక భాష మాట్లాడటం మరిచిపోలేదు.

"అసలు, నువ్వు అతని కోరిక తీర్చిన తరువాత ఆ అధికారి గర్వానికి పట్ట పగ్గాలుండవేమో! నీలాటి అందగత్తెని వశ పర్చుకోవటమంటే మాటలా! బహుశ జర్మనీ అంతటా వెదికినా నీలాటి స్త్రీ కనపడదేమో అతనికి" అని ఆమెని మురిపించాడు. అంతా విని ఎలిజబెత్ ఏమీ మాట్లాడలేదు.

వ్యాహ్యాళి నించి తిరిగి రాగానే ఎలిజబెత్ తన గదికి వెళ్ళిపోయి మళ్ళీ కిందకి రాలేదు. అందరిలో ఆతృత హెచ్చింది.

రాత్రి భోజనం సమయమైంది. అయినా ఆమె కిందికి రాలేదు.

ఇంతలో ఫొలెన్వీ వచ్చి "ఎలిజబెత్ గారికి వంట్లో బాగుండనందున ఆమె ఇవాళ భోజనానికి రానన్నారు," అని ప్రకటించాడు. కౌంటు మెల్లగా ఫొలెన్వీ దగ్గరకెళ్ళి గుస గుస లాడాడు.

"అంతా సర్దుబాటయినట్టేనా?"

"ఆహా!"

ఎవరితో ఏమీ చెప్పకుండా కేవలం అందరి వంకా చూసి తల పంకించాడాయన. అందరి మొహాలూ వెలిగిపోయాయి.

"హమ్మయ్యా!" అని అరిచాడు లూసో. "ఈ సత్రంలో షాంపేన్ వుంటే తీసుకు రావొయ్! అందరికీ ఇవాళ నా పేరు మీద షాంపేన్!" అని పురమాయించాడు ఫొలెన్వీని. ఫొలెన్వీ వెంటనే నాలుగు షాంపేన్ సీసాలతో వచ్చాడు. ఈ విషయం లూసో సతీమణి కెంత మాత్రమూ నచ్చలేదు. అందరి మనసులూ తేలిక పడటంతో అందరూ కబుర్లు మొదలు పెట్టారు. కౌంటు

శ్రీమతి లామడన్ అంద చందాలని ప్రశంసిస్తే, లూసో కౌంటెస్ గారి రూప లావణ్యాలను పేర్కొన్నారు.

అందరూ హాయిగా, కులాసాగా నవ్వుతూ కబుర్లు చెప్పుకున్నారు. చాలా కొంటె మాటలూ, పడక గది జోకులూ చెప్పుకున్నా ఎవరూ కోపగించుకోలేదు. ఒకరకమైన హాయి, సంతోషం అందరికీ గుండెల నిండా నిండి పోయింది. పైగా జోకుల స్థాయి మరీ దిగజారిపోసాగింది, రాత్రవుతున్న కొద్దీ! ఆఖరికి స్త్రీలు కూడా రెండర్థాల మాటలూ, మత్తెక్కించే చూపులూ మొదలు పెట్టారు. అందరూ షాంపేన్ తాగేరు. ఇద్దరు సిస్టర్లు కూడా. షాంపేన్ అచ్చం నిమ్మరసం లాగుంది, అన్నారిద్దరూ!

“ఛ!ఛ! ఇక్కడొక పియానో వుండి వుంటే ఎంత బాగుండేది! ఒకళ్ళం పాట వాయిస్తూ వుంటే మిగతా అందరమూ డాన్సు చేసే వాళ్ళం!” అన్నాడు లూసో.

కోర్నుడెట్ ఎందుకనో సాయంత్రమంతా ఒక్క మాట కూడా మాట్లాడలేదు. ఏదో ఆలోచనలో వుండి పోయాడు, గడ్డాన్ని నిమురుకుంటూ! ఆఖరికి మధ్య రాత్రి దగ్గరవుతుండా తడబడుతున్న అడుగులతో లూసో అతని దగ్గరికెళ్ళి వీపు మీద చరిచి, “నీ బాధేమిటయ్యా మిత్రమా?” అనడిగాడు నవ్వుతూ. కోర్నుడెట్ విసురుగా కుర్చీలోంచి లేచాడు. అందరి వంకా అసహ్యంగా చూసాడొకసారి.

“మీ అంత నీచులని నేనింతవరకూ చూడలేదు!” అన్నాడు. విసురుగా లేచి తలుపు తెరుచుకొని వెళ్ళబోతూ, ఒక్క క్షణం ఆగాడు. మళ్ళీ అసహ్యాన్నంతా గొంతులో నింపుకుని,

“నీచులు!” అని వెళ్ళిపోయాడు.

అందరూ నిర్ఘాంతపోయారు. లూసో కయితే అలేమయిందో కూడా అర్థం కాలేదు. అంతలోకే తేరుకుని పెద్దగా నవ్వుతూ అందరి వైపూ చూసి "మీలాటి అమాయకులకసలేమీ తెలియదు," అంటూ మొదలు పెట్టి, "రాత్రి రహస్యాలు చెప్పనా?" అని మూడు రోజుల క్రితం తను కారిడార్లో చూసిందంతా చిలవలూ పలవలూ నేసి అందరికీ చెప్పాడు. అందరూ పగలబడి నవ్వారు "ఒహో! ఇతనూ గ్రంథసాంగుడేనన్నమాట," అంటూ.

"నిజమా? నిజంగా అలా జరిగిందా?" కొందరికింకా నమ్మకం కుదరలేదు.

"నిజంగా నిజం! నా కళ్ళతో నేను చూసాను, అతను బ్రతిమాలుతుంటే!"

"అది వొద్దంటుందా?"

"అవును! ఎందుకంటే పక్క గదిలో జర్మను అధికారి వున్నాడు కాబట్టి!"

"నువ్వేం పొరబడలేదు కదా?"

"అరె! నిజమేనంటుంటే!"

కౌంటు నవ్వాపుకోలేక పొర్లి పొర్లి నవ్వుతున్నాడు. లామడాన్ నవ్వీ నవ్వీ కడుపులో నొప్పి లేస్తుందన్నాడు. లూసో ఇంకా అన్నాడు, "ఇప్పుడర్థమైందా కోర్నుడెట్ కి అంత కోపం ఎందుకొచ్చిందో?"

మళ్ళీ అందరూ పగలబడి నవ్వసాగారు. అలిసి నిద్రకుపక్రమించారు. పడుకోబోతూ లూసోతో అతని భార్య, "ఆ చుంచు మొహం లామడాన్ పెళ్ళాం ఏడుస్తూనే నవ్విందీ రాత్రంతా. జర్మన్ అధికారి తనని పిలవలేదని దాని ఏడుపంతాను!" అంది.

“కొంతమంది ఆడవాళ్ళకి యూనిఫారం వేసుకున్న మగాడైతే చాలు! ఒళ్ళూ పై తెలియదు. ఛీ!ఛీ! సిగ్గూ ఎగ్గూ లేని వాళ్ళు,” ముక్తాయించింది పడుకోబోతూ.

మర్నాడు అంతా లేచేసరికి తెల్లటి మంచు అంతటా కప్పేసినా పల్చటి సూర్యకాంతి వెచ్చగా ప్రసరిస్తూ వుంది. బగ్గీ, గుర్రాలు, బగ్గీ తోలే అతనూ అంతా ప్రయాణానికి సిద్ధంగా వున్నాయి. బగ్గీ అతను పైపు కాలుస్తూ ప్రయాణీకుల కోసం ఎదురు చూస్తున్నాడు. అందరి మొహాల్లోనూ సంతోషం! గబగబా తమ తమ సామాన్లు బగ్గీ లోకెక్కించుకున్నారు. అంతా ఎలిజబెత్ కొరకు ఎదురు చూస్తున్నారు.

ఆఖర్న వచ్చింది ఎలిజబెత్. సిగ్గూ అవమానాలతో తల దించుకుని వుంది. మునుపట్లా ధైర్యంగా నడవటంలేదు. పిరికిగా, బెదురుగా వాళ్ళ వైపు అడుగేయబోయింది. కూడబలుక్కున్నట్టు అందరూ ఆమె వైపు అసహ్యంగా చూసి తలలు తిప్పుకున్నారు. అలాటి అపవిత్రురాలి గాలి తన భార్య వైపు సోకద్దన్నట్టు కౌంటు తన భార్యని గంభీరంగా పక్కకి తీసికెళ్ళిపోయాడు, ఆమె వైపు విషపు చూపులు చూస్తూ.

ఎలిజబెత్ మొహం వెల వెలా పోయింది. ధైర్యం తెచ్చుకుని శ్రీమతి లామడాన్‌ని పలకరించింది. ఆవిడా కేవలం తల పంకించి తల తిప్పేసుకుంది. వున్నట్టుండి అందరూ చాలా హడావిడిగా అక్కణ్ణించి వెళ్ళిపోయి బగ్గీలోకెక్కి కూర్చున్నారు. ఏదో అంటు వ్యాధి వచ్చిన వాళ్ళని వెలేసినట్టు ఎవరూ ఎలిజబెత్ వైపు చూడనైనా చూడటం లేదు.

లూసో సతీమణి కొవ్వుపుంజి వైపు అసహ్యంగా చూసి, భర్తతో, ” ఆ చవకబారు దాని పక్కన నేను కూర్చోలేను,” అని అంటుంది పెద్ద గొంతుకతో. అందరూ బగ్గీలో సర్దుకుని కూర్చొన్నారు.

ఎవరూ మాట్లాడటం లేదు. ఎలిజబెత్ తల వాల్చుకుని కూర్చుంది. ఆమెకి తనని బలవంతంగా జర్మన్ అధికారి కౌగిట్లోకి తోసినందుకు వాళ్ళందరి మీదా, వారి వూక దంపుడు

మాటలకి మోసపోయినందుకు తన మీదా, మొత్తం ప్రపంచం మీదా పట్టరానంత ఆగ్రహం వస్తుంది. కోపమూ, అవమానమూ, ఉక్రోషమూ అన్నీ కలిపి ఆమెని ఉక్కిరి బిక్కిరి చేస్తున్నాయి.

కౌంటెస్ శ్రీమతి లామడాన్ గారి వైపు తిరిగి సంభాషణ మొదలు పెట్టింది. “మీరు శ్రీమతి డెట్రిలీస్ నెరుగుదురా?”

“చాలా! ఆవిడ నాకు దగ్గరి స్నేహితురాలు!”

“అవునా? ఆడదంటే ఆమే! ఎంత చక్కని స్త్రీ!”

“అవును! ఆవిడకి రాని విద్య లేదనుకోండి. బొమ్మలేసినా, పాటలు పాడినా, అబ్బో, ఆవిడకావిడే సాటి!”

లామడాన్, కౌంటూ మాట్లాడుకుంటున్నారు. వారి మాటల్లో, షేర్లూ, డబ్బులూ, పన్నులూ పదాలు పదే పదే వినబడుతున్నాయి. లూసో సత్రం నించి తను కాజేసిన పేక ముక్కలతో ఆట మొదలు పెట్టాడు. సిస్టర్లిద్దరూ సంచీలోంచి రోజరీ తీసి ఆగకుండ ప్రార్ధనలు చేస్తున్నారు. కోర్నుడెట్ ఏమీ మాట్లాడకుండ మౌనంగా వున్నాడు.

మూడు గంటల ప్రయాణం తరువాత లూసో ఆకలవుతుందన్నాడు. ఆయన సతీమణి సంచీ లోంచి ఒక చిన్న పార్సెల్ తీసి ఆయనకీ తనకీ భోజనం వడ్డించుకుంది. కౌంటు గారి భార్యామణీ, లూసో గారి శ్రీమతీ వారి వారి పాకెట్టులు విప్పి భోజనం వడ్డించుకున్నారు. సిస్టర్లిద్దరూ వాళ్ళ భోజనమూ ముగించారు. కోర్నుడెట్ తన కోటు జేబులోంచి నాలుగు ఉడకబెట్టిన కోడి గుడ్లని తీసి వలుచుకుని తినటం మొదలు పెట్టాడు.

దురదృష్టవశాత్తూ క్రితం రోజు జరిగిన సంఘటనలతో మనసు చెదిరి వున్న ఎలిజబెత్ తన తిండి సంగతి ఏమాత్రమూ ఆలోచించలేదు. తన సంగతి ఏ మాత్రం పట్టించుకోని ఆ కృతఘ్నులపైన కోపం ఆమెని కుదిపేసింది. వాళ్ళని పెద్ద గొంతుకతో తిడదామనుకుని గొంతెత్తింది, కానీ దుఃఖం ఆమె గొంతు కడ్డుపడింది. ఎవరూ ఆమె వైపు చూడలేదు, ఎవరూ ఆమె గురించి ఆలోచించలేదు.

తన పట్ల తనే అసహ్యంతో కుంచించుకు పోయిందామె. తనని తను సంబాళించుకునేందుకు శత విధాలా ప్రయత్నించి వెక్కిళ్ళను గొంతులోనే ఆపేసింది. అయినా ఆమె కంటి వెంట ధారలుగా కన్నీళ్ళు ప్రవహిస్తున్నాయి. అయినా ఆమె తలెత్తి నిటారుగా కూర్చుంది మొహాన్ని కఠినంగా మార్చుకుని.

ఆమె కన్నీళ్ళనాపుకునే ప్రయత్నాన్ని చూసి కౌంటు నా తప్పేం లేదన్నట్టు భుజాలెగరేస్తే, శ్రీమతి లూసో కిసుక్కుమంటూ నవ్వి, “సిగ్గూ లజ్జా లేని వాళ్ళకి ఏడుపే గతి,” అంది ఈసడింపుగా. సిస్టర్లిద్దరూ మిగిలిపోయిన భోజనాన్ని జాగ్రత్తగా పొట్లం కట్టుకుని ఆపైన తిరిగి ప్రార్థన మొదలు పెట్టారు.

కోర్నుడెట్ తిన్న గుడ్లని అరిగించుకుంటూ మనుషుల నైజాన్ని అర్థంచేసుకున్న వాడిలా నవ్వుతూ ఈల మొదలు పెట్టాడు. అతని ఈల పాట విన్న వాళ్ళందరి మొహాలూ పాలి పోయాయి. వాళ్ళ అసౌకర్యాన్ని చూస్తున్న కొద్దీ కోర్నుడెట్ ఈల పాట ఇంకా గట్టిగా వినిపిస్తున్నాడు. అప్పుడప్పుడు తనూ ఆ పాటలోని కొన్ని పంక్తులను గొంతెత్తి ఆలపిస్తున్నాడతను. రాత్రంతా కోర్నుడెట్ ఈల పాట, కొవ్వుపుంజి సన్నని ఏడుపు వినిపిస్తూనే ఉన్నాయి.

కోర్నుడెట్ పాడుతున్న ఆ పాట ఫ్రెంచి జాతీయుల ధైర్య సాహసాలను, నిజాయితీనీ, దేశభక్తిని ఉగ్గడించే ఫ్రెంచి జాతీయ గీతం: La Marseillaise!

*( మూలం : Boule de Suif – Guy de Maupaassant)*

*రచయిత పరిచయం: ఫ్రెంచి కథకుల్లోకెల్లా గొప్పవాడిగా చెప్పుకోబడ్డ గీ-ద-మొపాస్సా (Guy de Maupassant), తన నలభై మూడేళ్ళ జీవితంలో మరచిపోలేని కథలని రాసారు. ఆయన ఎక్కువగా నీతికీ అవినీతికీ మధ్య వున్న సన్నటి గీతని గురించి ప్రశ్నిస్తూ రాసారు.*
*మొపాస్సా ఫ్రాన్స్ దేశంలో 1850 లో జన్మించారు. ఆయన తల్లి లారె సుప్రసిద్ధ ఫ్రెంచి రచయిత ఫ్లాబర్ట్ చిన్ననాటి స్నేహితురాలు. బహుశా అందువల్లనే ఫ్లాబర్ట్ మొపాస్సా జీవితంలో చాలా శ్రద్ధ తీసుకున్నారు. ఆయన రచనల్లో కూడా ఫ్లాబర్ట్ ప్రభావం చాలా కనబడుతుంది. ఆ రోజుల్లో ఫ్లాబర్ట్ రాసిన "మేడం బొవరీ" నీతి అవినీతుల నిర్వచనాలని ధిక్కరిస్తూ చాలా దుమారాన్నే లేపింది.*
*మొపాస్సా చిన్నతనంలోనే అతని తల్లి తండ్రులిద్దరూ విడిపోయారు. పదమూడేళ్ళ వరకూ ఆయన తల్లితో పాటూ సముద్రపు ఒడ్డూన పల్లెటూళ్ళో గడిపారు. పధ్నాలుగేళ్ళ వయసులో పాఠశాలకెళ్ళినా, ఎక్కువ రోజులు వుండ లేకపోయారు. ఫ్రెంచి-జర్మన్ యుద్ధంలో ఏడాది పాటు సైనికునిగా పాల్గొని, అటు పిమ్మట పారిస్ నగరంలో ఉద్యోగంలో స్థిర పడ్డారు. దాదాపు పదేళ్ళ తరువాత ఉద్యోగం మారి పత్రికా సంపాదకులుగా పని చేసారు. 1880 లో ప్రచురించబడ్డ "బౌల్ ది స్యూ" అనే కథ సుప్రసిద్ధమైంది. ఇదే ఆయన రాసిన మొదటి చిన్న కథ.*
*ఈ కథ తరువాత ఆయన వెనుదిరిగి చూడలేదు. ఆ తరువాత పదేళ్ళ కాలంలో ఒకదాన్ని మించి ఒకటి కథలు రాసారు. సంవత్సరానికి కనీసం రెండు మూడు సంచికలైనా ఆయన కథలవి వచ్చేవి. ఈ కథా సంకలనాల వల్ల డబ్బూ, పేరూ వచ్చి పడ్డాయి.  సాధారణంగా ఆయనకి ఒంటరితనమంటే ఎక్కువ ఇష్టం వుండేది. అందుకే తన సొంత పడవలో ప్రపంచమంతా చుట్టబెడుతూ వుండేవారు.*
*ఇరవై యేళ్ళ వయసులో సోకిన సిఫిలిస్ వ్యాధి వల్ల ఆయన తన చివరి రోజులు ఆయన మానసిక వ్యాధులతో బాధ పడ్డారు. మతి పూర్తిగా భ్రమించిన ఆ స్థితిలో ఆయన కొన్ని అద్భుత, భయానకమైన కథలు రాసారు కాని అవంతగా పేరు పొందలేదు. మానసిక*

వ్యాధితోనే ఆయన నలభై మూడేళ్ళ వయసులో మరణించారు. సూటిగా, ఆలోచింపచేసి, మనసుల్ని కదిలించే ఆయన కథలు తరువాత తరాల కథకులందరినీ చాలా ప్రభావితం చేసాయి.

# కిటికీ

(సెప్టెంబరు 2012 ఈమాట)

(హెచ్. హెచ్. మన్రో (సాకి) )

“కూర్చోండి మిస్టర్ నటెల్. మా పిన్ని ఇప్పుడే కిందికి వచ్చేస్తారు.” అందా పదిహేనేళ్ళఅమ్మాయి. ఆమె మాట తీరులో ఏదో వయసుకి మించిన గాంభీర్యం వుంది.

“అంత వరకూ మీరు నా కంపెనీ భరించక తప్పదు,” అంది తనే.

పదిహేనేళ్ళ అమ్మాయిని సంతోషపెట్టే కబుర్లు ఏం వుంటాయో ఫ్రాంటన్ తల బద్దలు కొట్టుకున్నా తట్టలేదు. నిజానికతడు ఇలా అపరిచితుల ఇళ్ళకు వెళ్ళి వారితో కాలం గడపడం తన నరాల వ్యాధికి ఉపశమనం ఎలా కలిగిస్తుందోనని అనుమానంతో వున్నాడు.

“అక్కడ ఎలా వుంటుందో నాకు బాగా తెలుసు,” అంది అతని అక్క, అతనీ మారుమూల పల్లెకి ప్రయాణం ఐనప్పుడు. “నువ్వక్కడ ఒక్కడివే ఇంట్లో ఈసురోమంటూ చుట్టు పక్కల ఎవరినీ పట్టించుకోకుండా గడిపేయాలనుకుంటున్నావు. దానితో నీ నరాల బలహీనత ఎక్కువయ్యే అవకాశం వుంది. అందుకే నేన్నీకు కొన్ని ఉత్తరాలిస్తాను, నీ గురించి చెప్తూ. ఆ ఉత్తరాలు పట్టుకెళ్ళి అక్కడ ఇరుగూ పొరుగుతో కాస్త పరిచయాలు చేసుకో. నాకు గుర్తున్నంత వరకూ అక్కడ చాలావరకు మంచి మనుషులే వున్నారు.”

ఇప్పుడీ మిసెస్ సేపుల్టన్ మంచివాళ్ళ కిందికొస్తారో లేదో అనుకున్నాడు, ఫ్రాంటన్.

“మీకీ వూళ్ళో ఎవరైనా పరిచయస్తులున్నారా?” మౌనం చాలనుకుని అడిగిందా అమ్మాయి.

“అబ్బే! ఒక్కళ్ళైనా తెలిస్తే ఒట్టు! ఇక్కడ నాలుగేళ్ళ కింద మా అక్కయ్య వుండేది. ఇప్పుడు నన్ను అందరిళ్ళకీ వెళ్ళి పరిచయం చేసుకోమంది,” జవాబిచ్చాడు ఫ్రాంటన్. అతనా మాట అంటున్నప్పుడు అంత సంతోషంగా అనిపించలేదు.

“అయితే మీకు మా పిన్ని గురించేమీ తెలియదన్నమాట!”

“ఆవిడ పేరూ, చిరునామా మాత్రం తెలుసు,” ఒప్పుకున్నాడు ఫ్రాంటన్.

ఇంతకీ ఇప్పుడీ మిసెస్ సేపుల్టన్ భర్తగారు జీవించి వున్నట్టా లేదా, అంతుపట్టలేదతనికి. ఆ గది వాలకం చూస్తే ఇంట్లో మగవాళ్ళున్నట్టే అనిపిస్తుంది మరి.

“ఆవిడ మూడేళ్ళ కింద ఒక విషాదాన్నెదుర్కొన్నారు, బహుశా అప్పటికి మీ అక్కయ్యగారీ ఊరొదిలి వెళ్ళిపోయి ఉంటారు.”

“అయ్యయ్యో! అలాగా పాపం.” అతనెందుకో ఈ అందమైన పల్లెటూరులో విషాదమైన సంఘటనలకి చోటు వుంటుందనుకోలేదు.

“ఆ కిటికీ చూడండి! ఈ అక్టోబరు నెలలో ఎవరైనా అంత పెద్ద కిటికీ తెరచి వుంచుకుంటారా?” బయట తోటలోకి దారి తీస్తున్న పెద్ద ఫ్రెంచి కిటికీలని చూపిస్తూ అడిగిందా అమ్మాయి.

“అంటే, ఇప్పుడు కొంచెం వెచ్చగానే వుంది కాబట్టి ఫర్వాలేదనుకుంటాను. ఆ కిటికీకి ఈ ఇంట్లో జరిగిన సంఘటనకీ ఏదైనా సంబంధం వుందా?” కుతూహలంగా అడిగాడు.

“ఆ ఫ్రెంచి విండో గుండానే మూడేళ్ళ క్రితం ఒకరోజు మా చిన్నాన్న, ఆవిడ తమ్ముళ్ళిద్దరూ, బయటికెళ్ళారు, వేట కోసం. వాళ్ళిక మరి తిరిగి రాలేదు. బయట అడవుల్లో మంచులో, వానలో చిక్కుకు పోయారు. ఆ సంవత్సరం కనీ వినీ ఎరగని వర్షాలు పడి బయట నేలంతా

చిత్తడిగా అయింది. ఏ ఊబిలోనో చిక్కుకొని వుంటారు, వాళ్ళ శవాలు కూడా దొరకలేదు." బాధగా అందా అమ్మాయి. ఆమె గొంతులో ఇంతకు ముందున్న దృఢత్వం తగ్గి, గొంతు జీర పోయింది.

"పాపం, పిన్ని, వాళ్ళు ఎప్పుడో తిరిగి వస్తారనుకుంటుంది. అందుకే సాయంత్రం వరకూ ఆ కిటికీ అలా తెరిచే వుంచుతుంది. కొన్ని సార్లు ఆవిడ ఆ రోజుని తలచుకుంటుంది. ఆవిడ భర్త తెల్లని కోటులో, పెద్ద గొంతేసుకొని పాటలు పాడి ఆవిడని విసిగిస్తూ వుండే ఆవిడ చిన్న తమ్ముడు రోనీ, వాళ్ళ వెంట ఆ రోజు వెళ్లిన చిన్న కుక్క, అన్నీ ఆవిడకి బాగా జ్ఞాపకం. ఇలా ఇక్కడ నిశ్శబ్దంగా సాయంత్రం కూర్చున్నప్పుడు, నాకు కొన్నిసార్లు నిజంగానే వాళ్ళు ఆ కిటికీలోంచి తిరిగొస్తారేమో అనిపిస్తుంది."

ఊహ వల్ల వచ్చిన భయంతో కాబోలు, ఆ అమ్మాయి సన్నగా వణికింది.

ఇంతలో మిసెస్ సేపుల్టన్ ఆ గదిలోకి వస్తున్న అలికిడైంది. ఫ్రాంటన్ ఊపిరి పీల్చుకున్నాడు. వస్తూనే ఆవిడ అతన్ని అంత సేపు కూర్చోపెట్టినందుకు క్షమాపణలు చెప్పింది.

"మా వేరాతో కాలక్షేపం బాగా అయిందనుకుంటాను," వాకబు చేసింది ఆవిడ.

"అమ్మాయి చాలా తెలివైనది," వ్యాఖ్యానించాడు ఫ్రాంటన్.

"ఆ కిటికీ తెరిచి వుంటే మీకేం అభ్యంతరం వుండదు కదా? మా వారూ, మా తమ్ముళ్ళూ పొద్దున్ననగా వెళ్ళారు వేటకి. ఏ క్షణంలో నైనా వచ్చేస్తారు. ఇవాళ బోలెడు పిట్టలని కొడతామన్నారు. రాగానే ఇల్లంతా మురికి చేస్తారు,"

ఏదో ఒకటి మాట్లాడుతూనే వుందావిడ. బయట అడవిలో పక్షుల గురించీ, వేట గురించీ, భర్త గురించీ. ఫ్రాంటన్ ఎన్నో సార్లు సంభాషణని వేరే వైపు మళ్ళించటానికి ప్రయత్నించాడు కానీ,

కుదరలేదు. అసలావిడ అతని మాటలు వింటున్నట్టే లేదు. ఏదో ధ్యాసలో కిటికీ వైపు మాత్రమే చూస్తూ వుంది. అతనికా పరిస్థితి ఏ మాత్రమూ నచ్చటం లేదు.

“డాక్టర్లు నన్ను పూర్తిగా విశ్రాంతి తీసుకోమని ఇక్కడకి పంపారు,” ఫ్రాంటన్ మొదలు పెట్టాడు. ప్రపంచంలో అందరూ తన వ్యాధి గురించీ, వ్యాధి లక్షణాల గురించీ, చికిత్స గురించీ చాలా ఆసక్తిగా వుంటారని అతని ప్రగాఢ విశ్వాసం. అదే వూపులో అతను తన వ్యాయామ నియమాల గురించీ, ఆహార నిష్టల గురించీ, ఇంకా చాలా వివరంగా చెప్పాడు. వస్తున్న ఆవలింతల నాపుకుంటూ, “అవునా?” అంటున్నారు మిసెస్ సేపుల్టన్. ఉన్నట్టుండి ఆమె మొహంలోకి కాంతి వొచ్చింది.

“వచ్చేశారా, రండి. మీ కోసమే చూస్తున్నా,” అంది లేచి నిలబడుతూ.

అసంకల్పితంగా వేరా వైపు చూశాడు ఫ్రాంటన్. ఆశ్చర్యంతో, భయంతో కొయ్యబారి పోయి కిటికీ వైపే చూస్తుందా అమ్మాయి. ఆమె మొహం పాలిపోయి వుంది. ఏదో అర్థం కాని భయంతో తనూ కిటికీ వైపు చూశాడు ఫ్రాంటన్.

ఆ మసక వెల్తుర్లో ముగ్గురు మగవాళ్ళు తోట దాటుకుంటూ కిటికీ వైపొస్తున్నారు. ముగ్గురి భుజాలపైనా తుపాకులు వేళ్ళాడుతున్నాయి. ఒకతని భుజం పైన ఒక తెల్ల కోటు కూడా వేళ్ళాడుతుంది. చిన్న కుక్క పిల్ల వాళ్ళ కాళ్ళ దగ్గర పరిగెడుతుంది. నిశ్శబ్దంగా తోట దాటి కిటికీ దగ్గరకొచ్చారు వాళ్ళు. రాగానే అందులో ఒకడు పెద్ద గొంతుతో ఏదో పాటెత్తుకున్నాడు.

ఒక్క ఉదుటున లేచాడు ఫ్రాంటన్. తన చేతి కర్రా, టోపీ అందుకుని వాయు వేగంతో తలుపూ, మెయిన్ గేటూ దాటుకుని బయటపడ్డాడు.

తెల్లకోటు వేసుకున్న అతను లోపలికొస్తూ, “వచ్చేశాం చూడు. బయట పెద్ద తడిగా ఏం లేదు. బూట్లకి కొంచెం మట్టి అంటిందనుకో. అన్నట్టు ఎవరలా బయటికి పరిగెట్టింది?” అన్నాడు.

“ఎవరో విచిత్రమైన వ్యక్తి లాగున్నాడు. పేరు మిస్టర్ నటెల్. పాపం తన జబ్బుల గురించి తప్ప ఇంకేమీ మాట్లాడలేడనుకుంటా. మిమ్మలని చూడగానే అలా దయ్యాల్ని చూసినట్టు భయపడి పారిపోయాడెందుకో!” ఆశ్చర్యంగా అంది మిసెస్ సేపుల్టన్.

“అతనికి కుక్కలంటే భయంట పిన్నీ! ఎప్పుడో ఇండియా వెళ్ళాడట. గంగానది ఒడ్డున ఊర కుక్కలు వెంటబడ్డాయట. రాత్రంతా ఒక స్మశానంలో దాక్కున్నాడట, భయంతో వణికిపోతూ. ఇందాకే చెప్తున్నాడు, పాపం!” చెప్పింది వేరా జాలిగా.

అన్నట్టు, ఆ అమ్మాయి కథలు రాస్తుంటుంది.

*****************

*మూలం: The Open Window – H. H. Munro (Saki)*

*రచయిత పరిచయం :*

*సాకి అనే కలంపేరుతో హాస్యం ప్రధానంగా కథలు రచించిన హెచ్.హెచ్.మన్రో 1870 లో బర్మా లో జన్మించారు. ఇంగ్లండు తిరుగు ప్రయాణంలో అతని తల్లి మరణించారు. అప్పటికతని వయసు రెండేళ్ళు.  ఇంగలండులో చదువు పూర్తిచేసుకొని కొన్నేళ్ళు ఇండియాలో పోలీసుగా పనిచేసారు. నలభై ఆరేళ్ళ వయసులో (1916) మొదటి ప్రపంచ యుద్ధంలో మరణించారు మన్రో. చిలిపితనమూ, హాస్యమూ ప్రధానంగా నడిచిన ఆయన కథల్లో అప్పటి ఇంగ్లండు సంస్కృతీ, సంప్రదాయాలను వ్యంగ్యంగా విమర్శించేవి. సాకీ అన్న ఆయన కలం పేరు ఆయన ఒమర్ ఖయ్యాం రుబాయత్‌ల నుండి తీసుకున్నాడని అనుకుంటారు. అనేక సంపుటలుగా వెలువడ్డ కథలతోపాటు ఆయన ఒక నాటకాన్ని కూడా రచించారు.*

# పులి వేట

(జనవరి 2013,  ఈమాట)

(హెచ్. హెచ్. మన్రో (సాకి))

ఏమైతేనేం, ఒక పెద్ద పులిని వేటాడి చంపి తీరాల్సిందేనని మిసెస్ పేకిల్‌టైడ్ గట్టిగా నిర్ణయించుకుంది. ఈ రక్త పిపాస వున్నట్టుండి ఆవిడలో జన్మించిందనడానికి లేదు. పోనీ, కనీసం ఒక్క పెద్ద పులినైనా చంపేసి భారతదేశ జనాభాకి క్రూర మృగాల బెడద కొంచెమైనా తగ్గించేయాలన్న సత్సంకల్పమూ కాదు. ఈ విచిత్రమైన కోరికకు కారణం మిసెస్ లూనా బింబర్టన్, ముమ్మాటికీ!

లూనా ఈ మధ్య ఒక ఆల్జీరియన్ విమానంలో పదకొండు మైళ్ళు ప్రయాణం చేసింది. ఆ తర్వాత ఆవిడ తన విమాన ప్రయాణం గురించి తప్ప ఇక వేరే యే విషయం గురించీ మాట్లాడడం మానివేసింది. ఆవిడ నోరు మూయించాలంటే తను స్వయంగా సంపాదించిన పులి చర్మమూ, చచ్చి పడున్న పులితో తను దిగిన ఫోటోలూ తప్ప ప్రత్యామ్నాయం లేదు మరి!

మిసెస్ పేకిల్‌టైడ్ అప్పుడే లూనాని ముఖ్య అతిథిగా ఆహ్వానించి, కర్జన్ స్ట్రీట్ లోని తమ ఇంట్లో ఒక విందు భోజనం ఏర్పాటు చేసినట్టూ, తమ ఇంట్లోని హాలులో పులి చర్మంతో చేసిన రగ్గు పరచినట్టూ, అందరూ తన పులి వేట గురించి అబ్బురంగా మాట్లాడుకుంటున్నట్టూ కలల్లోకి వెళ్ళిపోయింది. అంతే కాదు, పులిగోరుతో తయారు చేసిన పతకాన్ని లూనాకి రాబోయే పుట్టిన రోజు నాడు బహూకరించాలని కూడా నిర్ణయించుకున్నది.

ప్రపంచంలో చాలా వరకు సంఘటనలకి పునాది ఆకలో, ప్రేమో అనుకుంటాం. మిసెస్ పేకిల్‌టైడ్ చర్యలన్నీ ఇందుకు మినహాయింపు. ఆవిడ చేష్టలన్నీ లూనా మీద ఆవిడకున్న అంతులేని అసహ్యం పైనే అధారపడి వుంటాయి.

ఈ పులి వేటకన్నీ కలిసొచ్చాయి. ముందస్తుగా మిసెస్ పేకిల్‌ట్రైడ్ తనకి పులిని చూపెట్టిన వారికి వెయ్యి రూపాయిల బహుమతి ప్రకటించింది. అదృష్టవశాత్తూ పక్కనే వున్న ఒక వూళ్ళో పెద్ద పులి తిరుగుతోందనీ, చాలా మేలు జాతి పులి అనీ, కొడితే అలాటి పులినే కొట్టాలనీ వదంతులు వినొచ్చాయి. వయసులో వుండగా తమ పూర్వీకుల్లాగే క్రౌర్యానికి మారు పేరయినా, ప్రస్తుతం అది వయసుడిగి, వేటాడే ఓపిక లేక ఇళ్ళల్లో దొరికే చిన్నా చితకా జంతువులతో కడుపు నింపుకుంటోందని కూడా తెలియ వచ్చింది.

వెయ్యి రూపాయల మంత్రం బాగా పారింది. ఊరి జనం అంతా పులి కొరకే వెతక సాగేరు. రాత్రీ పగలూ పిల్లలని తల్లి తండ్రులు అడవి చుట్టూ కాపుంచారు. తినడానికి ఏమీ దొరకపోతే పులి గానీ అడివి వదిలి పోతుందేమోనన్న భయంతో ప్రజలు అప్పుడప్పుడూ తమ మేకలను అడివిలో వదిలెయ్యటం మొదలు పెట్టారు. అయితే మిసెస్ పేకిల్‌ట్రైడ్ వేటకి బయల్దేరి వెళ్ళే లోగానే పులి ముసలితనంతో చస్తుందని భయపడ్డవాళ్ళూ లేకపోలేదు. సాయంత్రం పిల్లల్నేసుకుని అడవి బాట వెంట వచ్చే తల్లులు తమ పాటలని తగ్గించుకున్నారు, పులికి నిద్రాభంగం కలిగించడం ఇష్టం లేక.

అనుకున్న రోజు, చీకటి పడి రాత్రవనే అయింది. ఆకాశంలో చందమామ, మేఘాల అడ్డమేమీ లేకుండా హాయిగా సంచరిస్తున్నాడు. 'మేమ్ సాహెబ్' పులి వేట కోసం ఎత్తయిన మంచె కట్టారు. దాని మీద నక్కి కూర్చున్నారు మిసెస్ పేకిల్‌ట్రైడ్, ఆమె అనుచరి లూయిసా మెబ్బిన్. 'మే, మే' అని దీనంగా అరవడంలో ఎక్కువ నైపుణ్యం గల ఒక మేకని అక్కడే కట్టేసి ఉంచారు. దాని అరుపులు మామూలు పులులకేం ఖర్మ, చెవిటి పులులక్కూడా వినబడతాయి!

"మనకేదైనా ప్రమాదం వుంటుందంటారా?" అడిగింది లూయిసా. ఆవిడకి పెద్ద పులిని గురించిన భయం కంటే, తన రోజువారీ విధులకంటే ఒక్క చిల్లు కానీ వంతు పని చేయటం మీద అయిష్టత మెండు.

“ఎంత మాత్రమూ లేదు!” అన్నది మిసెస్ పేకిల్‌ట్రైడ్. “అది చాలా ముసలి పులి. ఎగిరి గంతేసినా ఈ మంచె పైకెక్కలేదు.”

“అంత ముసలి పులికి మరి తమరు వెయ్యి రూపాయిలెందుక్కర్చు చేసినట్టో! కొంచెం తక్కువ డబ్బుకి బేరం చేసి వుండవలిసింది.”

లూయిసాకి డబ్బుని చూస్తే అదొకరకమైన ప్రేమ. డబ్బుని, అది యే దేశానికి చెందినదైనా సరే, ఆవిడ తన స్వంత చెల్లెల్ని కాపాడినట్టు కాపాడుతుంది. తన సమయస్ఫూర్తితో ఆవిడ చాలా సన్నివేశాలలో చిల్లర డబ్బులు ఆదా చేసింది. పెద్దపులి వయసు పెరగడంతో పాటు దాని ధర తగ్గుతుందనే ఆర్థిక సూత్రం గురించి ఆవిడ చెప్తూ ఉండగనే – వాళ్ళకి అక్కడ పెద్ద పులి కనిపించింది. అక్కడ కట్టేసి వున్న మేకని చూడగానే, అది ముందుగా నేల మీద అడ్డంగా పడుకుండి పోయింది కొంచెం సేపు. మేక మీద మెరుపు దాడి చేయటానికో, లేక దాడి చేసే ముందు కొంచెం విశ్రాంతి తీసుకోవటానికో మరి!

“దానికి ఒంట్లో బాలేదనిపిస్తోంది,” అంది లూయిసా, పెద్దగా, హిందీలో, అక్కడే నిలబడి వున్న ఆ వూరి పెద్దాయన కోసం.

“హుష్! మెల్లిగా!” అంది మిసెస్ పేకిల్‌ట్రైడ్. అదే క్షణంలో పెద్ద పులి లేచి వాళ్ళున్న వైపు నడవటం మొదలు పెట్టింది.

“కానివ్వండి, కానివ్వండి! అది మేకని ముట్టుకోకముందే మనం దాన్ని చంపేస్తే, మేక ధర ఇవ్వక్కర్లేదు,” లూయిసా తొందర పెట్టింది. (మేకకి ఇచ్చే ధర వేరే!)

“ఢాం” అని రైఫిల్ పేలింది. పెద్ద పులి ఒక్క గెంతు గెంతి, పక్కకి తిరిగి విరుచుకొని పడిపోయింది. ఒక్క క్షణం తర్వాత ప్రాణం పోయినట్టు దాన్లో ఏ కదలికా లేదు.

ఊరి ప్రజలంతా జయ జయ ధ్వానాలు చేస్తూ పెద్ద పులిని చుట్టు ముట్టారు. అంతటా డప్పులూ, తప్పెట్లూ కోలాహలం. మిసెస్ పేకిల్‌టైడ్ విజయగర్వంతో చిరునవ్వులు చిందుస్తున్నారు. ఆవిడకి తమ ఇంట్లో విందు భోజనం అప్పుడే మొదలైపోయినట్టనిపించింది.

ఉన్నట్టుండి లూయిసా మేక వైపు చూపెట్టింది. అది బుల్లెట్ దెబ్బ తగిలి కొన వూపిరితో గిలగిల లాడుతోంది. పెద్ద పులి శరీరం మీద ఎక్కడా గాయం లేదు. నిస్సందేహంగా బుల్లెట్ గురి తప్పింది. మరి పెద్ద పులి ఎందుకు చచ్చిపోయినట్టు? అప్పుడర్థమైంది అందరికీ. మేక బుల్లెట్‌తో చచ్చిపోతే, పెద్ద పులి బుల్లెట్ శబ్దానికి గుండె ఆగిపోయి చచ్చిపోయింది.

మిసెస్ పేకిల్‌టైడ్ ఈ విషయాన్ని వినగానే చాలా చిరాకు పడిపోయింది. ఎలాగైతేనేం ఆవిడ ఒక మరణించిన పెద్ద పులి శరీరానికీ, చర్మానికీ హక్కుదారు. వెయ్యి రూపాయల కృతజ్ఞతతో ఊరి వాళ్ళు ఈ విషయాన్ని ఎక్కడా చెప్పకుండా ఉండేటట్టు ఒప్పందమైంది. లూయిసా మెబ్బిన్ దేముంది, జీతానికి పని చేసే మనిషి. అందువల్ల మిసెస్ పేకిల్‌టైడ్ ఏమాత్రమూ జంకకుండా ప్రెస్ ఫోటోగ్రాఫర్లకి చచ్చిన పులితో సహా బోలెడు పోజులిచ్చారు. ఆ ఫోటోలు ఇంగ్లండు దాకా చేరుకున్నాయి కూడా. ఆ పులివేట ఇచ్చిన ఉత్సాహంతో మిసెస్ పేకిల్‌టైడ్ ఫాన్సీ డ్రెస్ పార్టీలో వేటగాళ్ళ అధిదేవత డయానా వేషం వేసింది. అయితే “ఎవరు చంపిన జంతువు చర్మం వాళ్ళు ధరిస్తే బాగుంటుందన్న” మిస్టర్ క్లోవిస్ సూచనని మాత్రం మృదువుగా తిరస్కరించింది.

“నిజానికొస్తే, ఆ నియమంతో నాకే ఎక్కువ ఇబ్బంది! నేను చిన్న కుందేలు పిల్ల చర్మంతో నాట్యం చేయాల్సి వొస్తుంది మరి” అన్నాడు క్లోవిస్, ఆయన వేటలో చంపేసిన కుందేటి పిల్లని తల్చుకుంటూ. “అయినా సరే, నాకేం పరవాలేదు. నేను చూడడానికి బానే వుంటానుగా ,” అన్నాడాయన మళ్ళీ, అదో రకమైన కొంటె నవ్వుతో.

ఆ ఫాన్సీ డ్రస్సు విందు తరవాత ఒక రోజు మాటల్లో, లూయిసా మెబ్బిన్ మిసెస్ పేకిల్‌టైడ్ తో, "అసలు చచ్చిన పులిని గురించిన నిజం తెలిస్తే అందరూ ఏమంటారో," అంది సాలోచనగా.

"అంటే?" చురుకుగా అడిగింది మిసెస్ పేకిల్‌టైడ్.

"అంటే, ఏముంది? మీ తుపాకీ గుండుతో చచ్చిపోయింది పులి కాదు మేక అనీ, ముసలి పులి గుండె ఆగి చచ్చిపోయిందనీ తెలిస్తే అందరూ మీ గురించి ఏమంటారా అని ఆలోచిస్తున్నాను," చిరాకెత్తించే చిరునవ్వుతో అన్నది మెబ్బిన్. మిసెస్ పేకిల్‌టైడ్ ముఖం రంగులు మారింది. "ఎవ్వరూ ఆ మాట నమ్మరు," అంది బింకంగా.

"లూనా బింబర్టన్ నమ్మొచ్చునేమో," తాపీగా అన్నది మెబ్బిన్. ఎన్నో రంగులు మారిన మిసెస్ పేకిల్‌టైడ్ ముఖం ఆఖరికి ఒక విధమైన పాలిపోయిన ఆకుపచ్చ రంగు దగ్గర ఆగిపోయింది. "నువ్వు ఆమె దగ్గర అదంతా చెప్పవు కదా!"

నిర్లక్ష్యంగా భుజాలెగరేసింది మెబ్బిన్. "అన్నట్టు, డార్కింగ్ దగ్గర ఒక చిన్న ఇల్లు చూసాను. ఎంత ముద్దుగా వున్నదో! కొనుక్కుంటే బాగుండనిపిస్తుంది నాకు. ఎక్కువ ధర కూడా కాదు, ఆరువందల ఎనభై పౌండ్లు. అయితేనేం, ఇప్పుడు నా దగ్గరంత డబ్బు లేదు."

లూయిసా మెబ్బిన్ తరవాత కొన్న చిన్న ఇల్లు భలే బాగుంది. చిన్న తోటా, చుట్టూ స్థలం అంతా చూసి ఆమె స్నేహితులు తెగ మెచ్చుకున్నారు. "లూయిసా ఎలా చేస్తుందో కానీ, అన్నీ సాధిస్తుంది," స్నేహితులంతా ఏకగ్రీవంగా అంగీకరించారు.

మిసెస్ పేకిల్‌టైడ్ ఆ మీదట క్రూరజంతువులని వేటాడటం నుంచి విరమించుకున్నారు. "అబ్బ! అదంతా చాలా ఖర్చుతో కూడుకున్న వ్యవహారమోయ్," అని సన్నిహితుల దగ్గర వాపోయారని విన్నవారు చెప్తారు.

# విందు

(ఎప్రిల్ 17 , 2013, సారంగ పత్రిక)

(కేథరిన్ మేన్స్‌ఫీల్డ్)

ఆ రోజు వాతావరణం చాలా బాగుంది. తమ తోటలో ఆ మధ్యాహ్నం తామివ్వబోయే విందుకొరకు షెరిడన్ గారి కుటుంబం సరిగ్గా అలాటి వాతావరణమే కావాలనుకొంది. పెద్ద గాలులూ అవీ లేకుండా, ఆకాశమొక్క మబ్బు తునకైనా లేకుండా, వెచ్చగా, భలే బాగుంది. నీలాకాశంలో బంగారు చెంబు బోర్లించినట్టు న్నాడు సూరీడు! తోటమాలి పొద్దుణ్ణించీ తోటలోనే వున్నాడు. శుభ్రం చేస్తూ, ఊడుస్తూ, గడ్డి చెక్కేస్తూ, తోటంతా మిల మిలా మెరిసేలా చేస్తూ! అసలా గులాబీలు! తోటలో విందు ఇవ్వాలంటే గులాబీలు వుండి తీరాల్సిందేనని ఎవరైనా ఒప్పుకుంటారు. గులాబీలైతే అందరికీ తెలుస్తాయి, మిగతా పువ్వులు తెలిసినా తెలియకపోయినా. ఆ రోజు వందల కొద్దీ గులాబీలు పూచినట్టుంది తోటంతా.

పొద్దున్న కాఫీలూ, టిఫిన్లూ ఇంకా అవకముందే షామియానాలూ, పందిర్లూ వేసే పనివాళ్ళొచ్చేసారు.

“షామియానాలవీ ఎక్కడ వేయించమంటావమ్మా?” పిల్లలు అమ్మనడిగారు.

“ఇవాళ నన్నేం అడిగినా ప్రయోజనం వుండదు. నేను మీ అమ్మననే మాట మర్చిపోయి, నన్నూ ఒక అతిథిగా భావించండి. ఈ సంవత్సరం అన్ని బాధ్యతలూ మీకే వదిలేస్తున్నాను.”

మెగ్ ఎలాగూ పనివాళ్ళతో పని చేయించటానికి బయటికి వెళ్ళదు. అంతకుముందే తను తలంటుకొని తలకు తువ్వాలు చుట్టుకొని హాయిగా కాఫీ తాగుతూ కూర్చొనుంది. జోస్ ఎప్పుడూ పట్టు లంగా, కిమోనో లాటి జాకెట్టూ వేసుకొని వుంటుంది.

“లారా, నీకే వెళ్ళక తప్పదు. అలంకరణలవీ నీకే బాగా తెలుస్తాయి.”

చేసేదేమీ లేక లారా బ్రెడ్డు ముక్కని అలా చేత్తో పట్టుకోనే బయటికి పరిగెత్తింది. నిజానికి అలాటి వాతావరణంలో ఏదో ఒక వంకన బయటికి రావటమే ఇష్టం తనకి.

నలుగురు మగవాళ్ళు నిల్చొని వున్నారు తోటలో. కర్రలూ, షామియానాలూ, సామాన్లతో ఆమె కోసం ఎదురుచూస్తున్నారు. తను చేతిలోని బ్రెడ్డు ముక్కని ఇంట్లోనే ఎక్కడైనా పెట్టి రావాల్సింది అనుకుంది లారా. ఇప్పుడు పారేయటానికీ మనసొప్పలేదు. వాళ్ళ దగ్గరకొచ్చేసరికి కొంచెం సిగ్గుతో ఎర్రబడ్డ మొహాన్ని సీరియస్ గా పెట్టింది.

“గుడ్ మార్నింగ్!” అచ్చం వాళ్ళమ్మలా గంభీరంగా అనటానికి ప్రయత్నించింది. కానీ, తన గొంతు చిన్న పిల్లల్లాగే అనిపించేసరికి ఇంకా సిగ్గుతో తడబడింది.

“మీరంతా వొచ్చినట్టేనా? ఇదేనా షామియానా?”

“అవును అమ్మాయిగారూ!” అన్నాడు వాళ్ళల్లో అందరికన్నా పొడ్డుగ్గా వున్న అతను.

సామాన్ల సంచీ పక్కకి జరిపి, తలపై వున్న టోపీని కిందికని ఆమె వంక చూసి చిరు నవ్వు నవ్వాడు. స్నేహంగా వున్న అతని చిరునవ్వుతో లారా కొంచెం సర్దుకొంది. స్వచ్ఛంగా నీలంగా వున్న అతని కళ్ళు చూసి, మిగతా అందరివైపూ చుసింది. అందరూ “నిన్ను మేమేం తినేయం లేమ్మా! అంత భయమెందుకు?” అన్నట్టు నవ్వుతూ ఆమె వైపు చూస్తున్నారు. అసలు వీళ్ళంతా చాలా మంచి వాళ్ళలాగున్నారు, తనే అనవసరంగా భయపడింది. అందులో ఎంత అందంగా వుంది ఈ వుదయం. అయినా అందమైన వుదయాల గురించి మాట్లాడటం కాదు, తను చాలా హుందాగా, బాధ్యతగా వుండాలి. తనకి తనే చెప్పుకుంది లారా.

“సరే! ఎక్కడ వేస్తారు షామియానా? ఆ లిల్లీ పూల పక్కన లాన్ లో వేస్తారా? అక్కడైతే బాగుంటుందా?”

అందరూ అటు వైపు చూసారు. పొట్టిగా లావుగా వున్న అతను పెదవి విరిచాడు. పొడుగాటి వ్యక్తి బొమ్మలు ముడేసాడు.

“అక్కడంత బాగుండదేమో అమ్మాయిగారూ. ఒక మూలకి వున్నట్టుగా వుంటుంది. ఇప్పుడూ, షామియానా అంటే ఎలాగుండాలంటే వచ్చిన అందరి దృష్టీ ఫేడీలమని పడి పోవాలన్నమాట, ” పొడుగాటి వ్యక్తి వివరించాడు.

అతని భాష అంతగా నచ్చకపోయినా, అతను చెప్పేది సరిగ్గానే వుందనుకుంది.

“అయితే టెన్నిస్ కోర్టులో ఒక మూలకి వేస్తారా? కానీ, అక్కడ పాటల ప్రోగ్రాం కొరకు ఆర్కెస్ట్రా వాళ్ళు వుంటారు!”

“ఓ! అయితే బ్యాండు మేళం కూడా వుంటుందన్న మాట!” అన్నాడింకొక అతను. పాలిపోయిన మొహంతో, అలసిపోయిన కళ్ళతో ఒక్కసారి టెన్నిస్ కోర్టంతా పరికించి చూశాడతను. ఏమాలోచిస్తున్నాడో మరి!

“అబ్బే! బ్యాండంటే పెద్దదేమీ కాదు. చిన్న బ్యాండు!”

అంతలో మళ్ళీ పొడుగాటి వ్యక్తి కల్పించుకున్నాడు.

“అటు చూడండి అమ్మాయిగారూ! అక్కడైతే సరిగ్గా వుంటుంది.” అతను చూపించిన  చెట్ల వైపు చూసింది. అక్కడ షామియానాలు వేస్తే ఆ చెట్లేవి కనిపించవు మరి. కానీ ఆ చెట్లెంత అందంగా వున్నాయి! మిల మిలా మెరిసే ఆకులతో, బరువుగా వేళ్ళాడుతున్న పళ్ళతో, గర్వంగా, హుందాగా నిలబడి వున్నాయి.  అవన్నీ కనిపించకుండా షామియానా వేస్తే ఏం బాగుంటుంది?

ఆమె అభిప్రాయం వినకుండానే వాళ్ళంతా పని మొదలు పెట్టేసారు. పొడుగాటి వ్యక్తి మాత్రం అక్కడే ఆగిపోయి ఒక చిన్న పూవుని తెంపి వాసన చూడసాగాడు. లారా ఆశ్చర్యపోయింది. ఎంత మందికి పని మధ్యలో పూవుల వాసన చూసేంత ఓపికా, సహృదయమూ వుంటాయి, అనుకుందామె. పని వాళ్ళంతా చాలా మంచి వాళ్ళలాగున్నారు. కనీసం తనతో ఆదివారాలు

రాత్రి భోజనానికొచ్చి డాన్సులు చేసే పెద్ద కుటుంబాల్లోని జులాయిలకంటే! అసలు మనుషుల్లో ఎక్కువ తక్కువలేమిటి, విచిత్రం కాకపోతే!

"నాకైతే అలాటి తేడాలేవీ లేవు. హాయిగా వీళ్ళతోనైనా స్నేహం చేయగలను, ఏ మాత్రం సందేహం లేకుండా, " అనుకుంది లారా. అంతలోకే పనివాళ్ళు పని మొదలు పెట్టిన సందడి వినబడింది. "వెయ్ రా దెబ్బ! హైసా!" పని వాళ్ళు సరదాగా అరుపులూ, పాటలూ మొదలు పెట్టారు.

అసలు శ్రామిక జనం ఎంత స్నేహంగా, స్వచ్ఛంగా వుంటారో కదా! డబ్బున్న వాళ్ళలాగా మూతులు బిగించుకొని కుర్చోకుండా పాడుతూ, నవ్వుతూ, తుళ్ళుతూ, సంతోషంగా వుంటారు! తనూ వాళ్ళల్లో ఒకర్తినే అన్నది నిరూపించటానికి లారా బ్రెడ్డు ముక్క తింటూనే పొడుగాటి వ్యక్తి షామియానా కొరకు వేసిన డిజైను బొమ్మ చూడసాగింది.

"లారా! లారా! నీకే, ఫోన్!" ఇంట్లోంచి పెద్దగా వినపడింది.

"ఆ! వస్తున్నా!" ఎగురుతూ, గంతులేస్తూ, లారా తోటలోంచి ఇంట్లోకి పరిగెత్తింది. హాల్లో నాన్న గారూ, అన్నయ్య లేరీ, బయటికెళ్ళటానికి సిద్ధమవుతున్నారు.

"లారా! ఒక్కసారి నా కోటు కొంచెం ఇస్త్రీ చేసిస్తావా? మధ్యాహ్నం వేసుకోవాలి!""

"ఓ! తప్పకుండా!" లారా పరిగెత్తి లేరీని ప్రేమగా హత్తుకుంది.

"అసలు పార్టీలంటే నాకెంత సంతోషంగా వుంటుందో చెప్పలేను.'

"అవుననవును. సరేకానీ, వెళ్ళి చూడు! నీకేదో ఫోన్ వచ్చింది."

అయ్యో ఫోను సంగతి మర్చే పోయింది.!

“హల్లో! ఎవరు? కిట్టీ? మధ్యాహ్నమా? భోజనానికా?వచ్చెయ్యి! పెద్ద వంటేమీ చెయ్యట్లేదు. వట్టి బ్రెడ్డు మాత్రమే మరి! ఇవాళ ఎంత అందంగా వుంది కదా? ఏదీ? తెల్లదా? చాలా బాగుంటుంది. ఒక్క క్షణం వుండు- అమ్మ పిలుస్తోంది. ”, లారా ఫోన్ మూసి పెద్దగా అరచింది, “అమ్మా! ఏమిటి? వినపడటంలేదు.”

శ్రీమతి షెరిడన్ గొంతు మెట్లమీదినించి తేలి వచ్చింది.

“కిందటి శనివారం పెట్టుకున్న టోపీనే పెట్టుకొమ్మను ఇవాళ కూడా.”

“కిట్టీ ! అమ్మ నిన్ను కిందటి శనివారం పెట్టుకున్న టోపీనే మళ్ళీ పెట్టుకొమ్మంటుంది. సరే ! ఒంటి గంటకి! బై.” లారా ఫోన్ పెట్టేసింది.

రిసీవర్ పెట్టేసి లారా చేతులు మడచి తల వెనక పెట్టుకుని నిట్టూర్చింది. కిటికీలోంచి మెత్తగా సూర్య రశ్మి గదిలోకి పడుతోంది. మనసంతా ఏదో తెలియని సంతోషంతో నిండి పోయిందా అమ్మాయికి.

ఎవరో ఇంటి ముందర బెల్లు మోగించారు. సేడీ తలుపు దగ్గరకు నడుస్తున్న చప్పుడు! సేడీ ఎవరితోనో మాట్లాడుతున్నట్టుంది. “ఏమో, నాకు తెలియదు. అమ్మగార్ని అడిగొస్తానుండు.” నిర్లక్ష్యంగా జవాబిస్తోంది.

లారా హాల్లోకి నడిచింది. “ఏమిటి సంగతి సేడీ?”

“పూలమ్మే అతను అమ్మాయిగారూ!”

పూలతను తెచ్చిన పూలు హాలంతా పరచుకొని వున్నాయి. రంగు రంగుల్లో గది నిండా లిల్లీ పూలు.

“అయ్యో! సేడీ! ఏదో పొరపాటు జరిగింది. ఇన్ని లిల్లీ పూలెవరు తెమ్మన్నారు? అసలు నువ్వెళ్ళి అమ్మను పిలుచుకొని రా!”

వాళ్ళ మాటల్లోనే శ్రీమతి షెరిడన్ అక్కడికొచ్చింది.

“పొరపాటేం లేదు. నేనే తెమ్మన్నాను. ఎంత బాగున్నాయి కదా?” లారా వైపు తిరిగింది.

“నిన్న అక్కణ్ణించొస్తుంటే షాపు కిటికీలో చూసాను. వెంటనే అనుకున్నాను, ఇవాళ పార్టీలో అంతటా లిల్లీ పూలే కనిపించాలని.”

“కానీ ఇవాళ పార్టీలో అన్ని ఏర్పాట్లకూ మాదే బాధ్యత అన్నావు!” లారా తల్లి మెడ చుట్టూ చేతులేసి గారాబంగా అంది. సేడీ వంటింట్లోకి వెళ్ళిపోయింది. పూల కొట్టతను వెళ్ళి తన వాన్ దగ్గర నిలబడ్డాడు.

“బంగారు తల్లీ! అమ్మ ఎప్పుడూ మనసు మార్చుకోకూడదా?? ఇంకా పూలు తెస్తున్నాడు చూడు.” పూల కొట్టతను ఇంకొక లిల్లీ పూల ట్రేలు తీసుకొని లోపలికి తెచ్చాడు.

“అన్నీ లోపల వరండా అన్ని వైపులా పెట్టించు. ఏమంటావు లారా? అలా పెడితే బాగుండదూ?”

“అవునమ్మా. చాలా బాగుంటుంది.”

పక్కన ఇంకో పెద్ద హాల్లో మెగ్, జోస్, హేన్స్ అందరూ కలిసి పియానోని ఒక మూలకి నెట్టే ప్రయత్నం చేస్తున్నారు.

“ఆ సోఫాని అటు వైపు గోడ దగ్గరికి జరిపించి మిగతా సామాను బయట వేయిద్దాము. సరేనా?”

“సరే!”

“హేన్స్, ఈ బల్లలన్నీ ఇంకో గదిలోకి మార్చు. పని ఆవిడని పిలిచి ఈ కార్పెట్ అంతా బాగా దులిపించాలి.”

జోస్ కి పని వాళ్ళతో పనులు చేయించటమంటే భలే సరదా. వాళ్ళకీ ఆమె చెప్పినట్టు చేయటం ఇష్టమే. అంతా ఏదో పెద్ద నాటకంలో పాత్రలు ధరిస్తున్న భావన వస్తుంది జోస్ పనులు చెప్పటం చూస్తే.

“అలాగే అమ్మనీ, చిన్న అమ్మాయిగార్నీ నేను పిలుస్తున్నానని చెప్పి వెంటనే తీసుకురా!” మళ్ళీ పురమాయించింది జోస్. మెగ్ వైపు తిరిగింది.

“మెగ్! ఒక్క సారి పియానో సరిగ్గా వుందో లేదో చూడు. ఇవాళ మధ్యాహ్నం ఎవరైనా పాడమంటారేమో నన్ను. రా, ఒకసారి ఏదైనా పాట వాయించి చూద్దాం.”

పాం- ట-ట-ట-టీ-ట, పియానో పెద్దగా నోరిప్పింది. అమ్మా,  లారా అప్పుడే గదిలోకి అడుగుపెట్టారు. జోస్ పాడుతూనే వుంది.

“అమ్మా, నేను బాగా పాడుతున్నానా?” ఇంతలో మళ్ళీ సేడీ వచ్చింది.

“మళ్ళీ ఏమిటి సేడీ?”

“ఏం లేదమ్మగారూ! వంట మనిషికి సాండ్‌విచ్‌ల దగ్గర పెట్టే పేర్లున్న కాగితాల కట్ట లేదట. ఎక్కడుందో అడిగి రమ్మంది.”

“సాండ్‌విచ్‌ల పేర్లా? కాగితాలా? ఎక్కడ పెట్టానబ్బా?” శ్రీమతి షెరిడన్ మొహం చూడగానే పిల్లలు ఊహించారు, అమ్మకి వాటి సంగతే గుర్తు లేదని. “సేడీ! పది నిముషాల్లో నేనా పేర్ల కాగితాలు పంపిస్తాను. వంట మనిషిని కంగారుపడొద్దని చెప్పు,” సేడీ ని పంపి వేసింది లారా.

"లారా! నేనొక కవరు మీద ఆ పేర్లన్నీ రాసి వుంచాను. ఎక్కడ పెట్టానో మరిచిపోయాను. మళ్ళీ ఇంకొక మంచి కాగితం మీద రాద్దాం పద. మెగ్, ముందు నువ్వు తలచుట్టూ ఆ తువ్వాలు తీసి పారెయ్. జోస్, నువ్వెళ్ళి బట్టలు మార్చుకో. లేచి వెళ్తారా లేకపోతే మీ నాన్నతో చెప్పనా? అన్నట్టు జోస్, నువ్వు కొంచెం వంట మనిషి కంగారు పడుతుందేమో చూడు. మధ్యాహ్నం పార్టీ తలచుకుంటే నాకు వణుకొస్తూంది!"

భోజనాల గదిలో, గడియారం వెనక వాళ్ళకి పేర్లు రాసుకున్న కవరు దొరికింది. అది అక్కడికెలా వెళ్లిందో ఎవరికీ అర్థం కాలేదు.

"ఈ కొంటె పిల్లలెవరో తీసి అక్కడ పడేసి వుంటారు. సరే అన్ని సాండ్‌విచ్‌ల పేర్లు వున్నాయో లేదో చూడు. "

"సరే, పేర్లన్నీ చిన్న చిన్న కాగితాల మీద అందంగా రాద్దాం పద."

అన్నీ రాసేసారు మెల్లగా. అ లేబుళ్ళ కట్ట పట్టుకుని లారా వంటింట్లోకి పరిగెత్తింది.

వంటింట్లో జోస్ పొగడ్తలతో వంటావిడని ఆకాశానికెత్తేస్తుంది. నిజానికి వంటావిడ సౌమ్యురాలు. ఆవిడని చూసి అంత భయపడటానికేమీ లేదు.

"ఇంత అద్భుతమైన సాండ్‌విచ్‌లు నేనెక్కడా చూడలేదంటే నమ్మండి! ఎన్ని రకాలు చేసారు? పదిహేనా?"

"అవును అమ్మాయి గారు, పదిహేను రకాలు చేసాను."

"పదిహేను రకాల సాండ్‌విచ్‌లు. వామ్మో! ఎలా చేస్తారో ఎమో, అన్ని రకాలు."

వంటావిడ సంతోషాన్ని దాచుకొంటూ చిన్న చిరునవ్వుతో వంటిల్లంతా ఊడ్చి శుభ్రం చేసుకుంటోంది.. వున్నట్టుండి లోపలినించి సేడీ అరచింది, "గాడ్బర్ నించి మనిషి

వచ్చాడు!" అంటూ. అంటే మిఠాయిలొచ్చాయన్నమాట. గాడ్బర్ చేసే మిఠాయిలు ఊరంతా ప్రసిద్ధి. ఎవరూ అసలు ఇంట్లో మిఠాయిలే చేయరు.

"సేడీ! మిఠాయిలు లోపలికి తెచ్చి ఆ బల్ల మీద పెట్టు," వంటావిడ పురమాయించింది. సేడీ మిఠాయిలు లోపలికి తేవటానికెళ్ళింది. లారా, జోస్, నిజానికి తాము చాలా పెద్దయిపోయాం కాబట్టి మిఠాయిల గురించి పెద్దగా పట్టించుకోకూడదనుకొంటారు కానీ, ఆ మిఠాయిలు చూడగానే నోరూరింది వాళ్ళిద్దరికీ. వంటావిడ వాటిని అందంగా సర్ద సాగింది.

"ఇద్దరూ చెరొక మిఠాయి తీసుకుని తినండి. అమ్మకి చెప్పకపోయినా పర్వాలేదు," వంటావిడ ఇద్దరికీ మిఠాయిలిచ్చింది.

పొద్దున్నే మిఠాయిలెలా తింటాం, అనుకుంటూనే ఇద్దరూ చెరొకటి తినేసారు.

"పద, అలా వెనకనించి తోటలోకి వెళ్ళి షామియానాలు వేయటం ఎంత వరకొచ్చిందో చూద్దాం!" లేచి నడిచింది లారా. కానీ వెళ్ళటానికి వీల్లేకుండా తలుపు దగ్గర అడ్డు నిలబడ్డారు సేడీ, మిఠాయిల అబ్బాయీ, వంట మనిషీ! ఏదో గంభీరంగా మాట్లాడుకుంటున్నారు.

వంటావిడ "అయ్యో! పాపం!" అంటోంది. సేడీ ఆశ్చర్యం, భయం కలిసిపోయినట్టు చెంపలు నొక్కుకుంటూంది. ఒక్క మిఠాయిల అబ్బాయి మాత్రం సంతృప్తిగా సంఘటన వివరిస్తున్నాడు.

"ఏం జరిగింది?" పిల్లలు అడిగారు.

"పెద్ద ప్రమాదం! ఒకతను చనిపోయాడు కూడా!" వంట మనిషి చెప్పింది.

"చనిపోయాడా? ఎక్కడ? ఎలా? ఎప్పుడు?"

“బయటికెడితే చిన్న చిన్న ఇళ్ళు, గుడిసెల్లాటివి కనిపిస్తాయి చూడండి, అక్కడండీ అమ్మాయి గారు! మీకా గుడిసెలు తెలుసా?”

ఎందుకు తెలియదు. తెలుసు తనకి, అనుకుంది లారా.

“అక్కడ, స్కాట్ అనే గుఱ్రబ్బండి వాడుంటాడు. పొద్దున్న అతను ప్రమాదంలో పోయాడు.”

“పోయాడా? అయ్యో!”

“ఆ! అక్కడికక్కడే ప్రాణం పోయినట్టుంది! ఇక్కడికి నేనొస్తుంటే శవాన్ని ఇంటికి తీసికెళ్తున్నారు. పాపం, పెళ్ళాం, పిల్లలూ కూడ వున్నారతనికి.”

“జోస్, ఇలా రా!” అక్కని చేయి పట్టుకుని లాక్కెళ్ళింది లారా. లోపలి తలుపుకానుకుని నిలబడి,

“జోస్! ఇప్పుడెలా? ఇప్పుడీ విందు ఎలా ఆపుతాం” అంది ఆందోళనగా.

“విందు ఆపేయాలా? ఎందుకని?” ఆశ్చర్యంగా అడిగింది జోస్.

“అవును! విందు ఆపేయొద్దూ మనం?” లారా ఇంకా ఆశ్చర్యపోయింది.

“పిచ్చిదానివా ఏమిటి? మన విందు ఎందుకాపేయాలి? అసలు ఎవరంటారలా?”

“అది కాదు. మన ఇంటి దగ్గర ఇంట్లో ఎవరో పోయి ఏడుస్తూ వుంటే మనం విందు ఎలా చేసుకొంటాం?”

నిజానికి ఆ చిన్న చిన్న యిళ్ళు వీళ్ళ ఇంటికి అంత దగ్గరగా ఏం లేవు. వీళ్ళ వీధి చివరినించి మొదలై అలా సాగిపోతాయి. రెండు కాలనీలకీ మధ్య పెద్ద రోడ్డు కూడా వుంది. అసలా ఇళ్ళు చూస్తేనే మహా చిరాగ్గా వుంటుంది. మట్టి రంగు గోడలతో, చిన్న చిన్న యిళ్ళు! ఇంటి ముందర చిన్న చిన్న తోటల్లో ఎప్పుడు చూడూ కేబేజీ మొక్కలే వుంటాయి. గులాబీలో, అందమైన

పచ్చికలో వుండనే వుండవు. ఆ కేబేజీ మొక్కల మధ్య కోళ్ళు! అసలు వాళ్ళ ఇళ్ళల్లోంచి వచ్చే పొగ కూడా నిరుపేదలా అనిపిస్తుంది. షెరిడన్‌గారి ఇంటి పొగగొట్టంలోంచి వచ్చే అందమైన వెండి రంగు మబ్బుల్లాటి పొగలకీ, ఆ యిళ్ళల్లోంచి వచ్చే మురికి పొగకీ పోలికే లేదసలు.

ఆ కాలనీలో చాకలి వాళ్ళూ, చెప్పులు కుట్టే వాళ్ళూ, ఇంకా ఎవరెవరో వుంటారు. ఇళ్ళల్లో ఎక్కడ చూసినా పిల్లలు! షెరిడన్‌గారి పిల్లలని చిన్నతనంలో అటు వైపు వెళ్ళనిచ్చే వారే కాదు. అయితే, కొంచెం పెద్దయ్యాక లారా, లేరీ అప్పుడప్పుడూ ఆ కాలనీలో కుతూహలంగా నడిచే వాళ్ళు. చూడగానే అసహ్యమేసేది. కానీ జీవితం అన్నాక ఎన్నిటినో చూడాలి, ఎన్ని చోట్లకో వెళ్ళాలి మరి. అందుకే ఇద్దరూ వెళ్ళేవాళ్ళు.

"మన బాండు వాళ్ళు పెద్దగా పాటలు పాడుతుంటే స్కాట్ భార్యకెలా వుంటుందో ఊహించు."

జోస్ ఆశ్చర్యం కోపంలోకి దిగింది.

"లారా! ఎక్కడో ఎవరికో ప్రమాదం జరిగిన ప్రతీ సారీ నువ్వు పాటలూ,ఆటలూ, సరదాలూ మానుకున్నావంటే, ఇక నీకు జీవితంలో మిగిలేదేమీ వుండదు. నాక్కూడా ఆ కుటుంబాన్ని తలచుకుంటే జాలి వేస్తుంది. కానీ దానికి మన ప్రోగ్రాం ఎందుకు మానేయాలో అర్థం కావటం లేదు. మనం పార్టీ మానుకున్నంత మాత్రాన చనిపోయిన ఆ తాగుబోతు బ్రతికొస్తాడా?"

"తాగుబోతా? ఎవరు తాగుబోతు? అతను తాగుబోతని తెలుసా నీకు? " లారా కోపంగా లేచింది.

"అసలు నేను అమ్మతో మాట్లాడతానుండు."

"వెళ్ళు, వెళ్ళు! వెళ్ళి అమ్మేమంటుందో చూడు!"

"అమ్మా! నీతో కొంచెం మాట్లాడాలి," తల్లి గది తలుపు దగ్గర నిలబడి అడిగింది లారా.

“రా లారా? ఏమయింది? మొహం అలా వుందెందుకు?” శ్రీమతి షెరిడన్ అద్దం ముందు కూర్చుని కొత్తగా కొన్న టోపీని పెట్టుకుని చూసుకుంటూ అంది.

“అమ్మా ! బయట ఒకతను చనిపోయాడు.”

“ఎక్కడ? మన తోటలోనా?”

“కాదు! బయట, వీధిలో.”

“హమ్మయ్య! బ్రతికించావు.” నిట్టూర్చి శ్రీమతి షెరిడన్ తల మంచి టోపీని తీసి పట్టుకుంది.

“అదికాదమ్మా! అసలేమయిందంటే,” లారా గబగబా మిఠాయిల అబ్బాయి చెప్పిందంతా వివరించింది.

“నువ్వే చెప్పు, బయట పక్క ఇంట్లో ఎవరో పోయి వాళ్ళ ఇంట్లో వాళ్ళు ఏడుస్తుంటే మనం ఇక్కడ తోటలో పార్టీ ఎలా చేసుకుంటాం? మన పాటలూ, నవ్వులూ విని వాళ్ళు బాధ పడతారేమో. అసలిప్పుడేం చేద్దాం?” లారా గొంతు దుఃఖంతో పూడుకుపోయింది.

అచ్చం జోస్ లాగే తల్లి కూడా ఆశ్చర్యపోయింది. ఇంకా చెప్పాలంటే ఆమెకి నవ్వు కూడా వచ్చింది.

“పిచ్చి తల్లీ! మనం వినడం వల్లే మనకా సంగతి తెలిసింది. వినకపోయి వుంటే? తెలిసేది కాదు, అవునా? అప్పుడు మామూలుగానే పార్టీ అయి వుండేది. మనలని ఎవరు తప్పుపట్టగలిగేవారు? ఇప్పుడూ అంతే. మనం వినలేదనుకుని మామూలుగానే వుందాం. అసలా యిళ్ళల్లో ఎలా బ్రతుకుతున్నారో అన్నది నాకెప్పుడూ అర్థం కాదు, నిజానికి.”

తల్లి మాటలకెలా బదులు చెప్పాలో తెలియలేదు లారాకి. అక్కడే సోఫాలో కూలబడింది.

“అమ్మా! అంత మొరటుగా ఎలా వుండగలుగుతాం?” అంది ఆవేదనగా.

“బంగారూ! ఎంత అమాయకురాలివమ్మా!” తల్లి లేచి వచ్చి కుతురి పక్కనే కూర్చుంది. తన కొత్త టోపీని లారా తల మీద పెట్టిచూసింది.

“అబ్బ, యెంత బాగుంది ఈ టోపీ నీకు! అది నీకే, వుంచేసుకో! నాకంటే నీకే అది అందంగా వుంది. కావాలంటే అద్దంలో చూసుకో,” అద్దం యెత్తి పట్టుకుంది.

“అది కాదమ్మా, ఒక్క సారి.....”

తల్లికీ జోస్ లాగే కోపం వచ్చింది.

“లారా, చిన్న పిల్లలా ప్రవర్తించకు. అంతంత త్యాగాలేం చెయ్యక్కర్లేదు. అసలు ఎవరో ముక్కూ మొహం తెలియని వాళ్ళకోసం మన ఇంటికి వచ్చే అతిథుల్ని నిరాశ పరుస్తావా? నీ ఒక్క దాని పిచ్చితో అందరి సరదా పాడుచేయొద్దు.”

“నాకేమి అర్థం కావడం లేదు,” బిక్క మొహంతో లారా లేచి తల్లి గదిలోంచి వెళ్ళిపోయింది. తన గదిలోకెళ్ళి కూర్చుంది. ఉన్నట్టుండి అద్దం లో చూసుకుంది. అందమైన నల్లటి హేటూ, దానికి పొడుగాటి వెల్వెట్ రిబ్బనూ, బంగారు రంగు వుంగరాల జుట్టుతో, ఎవరీ అందగత్తె అనుకుంది ఒక్క క్షణం. ఇంకెవరు, తనే! నిజంగా అమ్మ చెప్పినట్టు ఆ టోపీ తనకెంతో బాగుంది.

అమ్మ అన్నట్టు తను అతిగా ఆలోచిస్తుందా? అంతలోనే సంపాదించే భర్తను పోగొట్టుకొని, పిల్లలతో ఒంటరైపోయిన దీనమైన స్త్రీ ముఖం మనసులో మెదలింది. అంతలోకే మళ్ళీ మామూలై పోయింది. ఇహ దాని గురించి పార్టీ అయ్యాకే ఆలోచిస్తాను, అని నిశ్చయించుకుంది లారా.

భోజనాలు ముగిసేసరికి మధ్యాహ్నం ఒంటి గంటయింది. రెండున్నరకల్లా అంతా తయారయి తోటలోకెళ్ళారు. టెన్నిస్ కోర్టులో ఆకు పచ్చ రంగు యూనిఫారాలలో బేండు మేళం వాయిద్యాలను శృతి చేసుకుంటున్నారు.

"నన్నడిగితే ఆ ఆకు పచ్చ రంగు బట్టల్లో వాళ్ళంతా పెద్ద కప్పల్లాగున్నారు. అసలు వాళ్ళ స్టేజీ స్విమ్మింగ్ పూలులో పెట్టి వుంటే సరిగ్గా వుండేది," కిట్టీ నవ్వుతూ అన్నాడు.

లేరీ బయట నించొచ్చి తన గదిలోకి వెళ్తున్నాడు, బట్టలు మార్చుకోవడానికి. అన్నని చూడగానే లారా కి చనిపోయిన స్కాట్ గుర్తొచ్చాడు. అతని వెంటే హాల్లోకి నడిచింది.

"లేరీ!"

వెనుదిరిగి చూసాడు లేరీ. చెల్లిని చూసి సన్నగా ఈల వేసి కళ్ళెగరేసాడు. "అబ్బో! యెవరబ్బా ఇంత అందగత్తె, మా ఇంట్లో?" నవ్వాడు. "లారా! నిజంగా ఇవాళ నీకా టోపీ చాలా బాగుంది."

లారా నవ్వి అక్కణ్ణించి వెళ్ళిపోయింది.

మధ్యాహ్నానికి విందు ఊపందుకొంది. పాటలూ, ఆటలూ, మాటలూ, నవ్వులూ- అంతా సంబరంగా వుంది. షెరిడన్‌గారి తోటలో వాలిన రంగు రంగుల పక్షుల్లా వున్నారందరూ. సంతోషంగా, చలాకిగా వుండే మనుష్యుల మధ్య వుండడం ఎంత సంతోషాన్నిస్తుంది! లారా ఆ రోజు పొగడ్తల్లో మునిగిపోయింది.

"లారా! ఇవాళ ఎంత అందంగా వున్నావో తెలుసా?"

"అసలా టోపీ నీకు బాగా నప్పింది.""

"స్పానిష్ అమ్మాయిలా వున్నావు. ఇంత అందంగా నిన్నెప్పుడూ చూడలేదు నేను."

లారా మొహం ఆనందంతో వెలిగిపోయింది. అయినా అందరినీ మెత్తగా నవ్వుతూ పలకరించింది.

“కొంచెం టీ తాగుతారా?” “మీ జూస్‌లో కొంచెం ఐస్ వేయనా?” “ఈ పళ్ళ ముక్కలు ఒక సారి రుచి చూడండి.”

మధ్యలో తండ్రి దగ్గరికి పరిగెత్తింది. “నాన్నా, ఒక్క సారి ఆ బేండు మేళం వాళ్ళేమైనా తింటారేమో, తాగటానికేమైనా కావాలేమో కనుక్కుంటావా?” అంటూ పురమాయించింది. మధ్యాహ్నం గడిచి సాయంత్రం అయేసరికి విరిసిన పూవు ముడుచుకున్నట్టయింది.

“భలే సరదాగా గడిపాం ఇవాళ!”, “చాలా బాగా జరిగింది పార్టీ!” అంటూ అతిథులంతా సెలవు పుచ్చుకున్నారు.

“అమ్మయ్య! అంతా సవ్యంగా జరిగిపోయింది.” నిట్టూర్చింది శ్రీమతి షెరిడన్.

“లారా! పార్టీ బాగా జరిగింది, కానీ  ఒళ్ళు హూనమైపోయింది. ఈ పిల్లలేమో పార్టీలు కావాలని ప్రాణాలు తోడుతారు. పద కొంచెం కాఫీ తాగుదాం లోపలికెళ్ళి. నువ్వెళ్ళి మిగతా అందరికీ వీడ్కోలు చెప్పి లోపలికి రా.”

అందరూ ఖాళీ అయిపోయిన షామియానా కింద కూలబడ్డారు అలసటగా.

“నాన్నా, ఒక్క సాండ్ విచ్ తింటావా? లేబుళ్ళ మీద ఈ పేర్లన్నీ నేనే రాసాను తెలుసా?”

“అబ్బో! అయితే ఇలా తే!” తండ్రి సాండ్ విచ్ అందుకొని కొరికాడు. “అన్నట్టు, ఇవాళ బయట ఒక పెద్ద ప్రమాదం జరిగింది తెలుసా?”

శ్రీమతి షెరిడన్ వెంటనే అందుకుంది. “ఆ ప్రమాదం గురంచి మాట్లాడకండి! ఇవాళ దాని వల్ల మన పార్టీ దాదాపు మానేసినంత పనయ్యింది. బయటెవరో మరణిస్తే మనం పార్టీ ఎలా చేసుకుంటామని లారా ఒకటే గోల,” నవ్వుతూ అంది.

“అబ్బ, ఏదో అన్నాను, వదిలెయ్యమ్మా!” సిగ్గుపడింది లారా.

“నిజంగానే చాలా బాధాకరమైన విషయం. పాపం అతనికి భార్యా పిల్లలూ కూడా వున్నారట.” షెరిడన్ గారు సాండ్ విచ్ కొరుకుతూ అన్నారు. ఉన్నట్టుండి అందరూ మౌనంగా వుండిపోయారు.

ఈయనకి ఎప్పుడేం మాట్లాడాలో తెలియదు, చిరాకు పడ్డారు శ్రీమతి షెరిడన్. వున్నట్టుండి ఆవిడకొక ఆలోచన వొచ్చింది.

“ఒక పనిచేద్దాం. చాలా వంట మిగిలిపోయింది. ఒక బుట్టలో పెట్టి మిగిలిన తినుబండారాలన్నీ వాళ్ళకి ఇద్దాం. పిల్లలు నాలుగురోజులు తింటారు.ఇప్పుడు వాళ్ళింట్లో వచ్చీ పోయే జనం కూడా వుంటారు. అందరూ తినడానికి పనికొస్తుంది. లారా! వెళ్ళి ఆ పెద్ద బుట్ట పట్టుకురా!”

“అమ్మా! నిజంగా అదంత మంచి పని అంటావా?”

లారాకి మళ్ళీ విచిత్రంగా అనిపించింది. తను ఒక్కర్తీ వేరేగా ఎందుకాలోచిస్తుంది? ఇంట్లో విందులో మిగిలిపోయిన తిండి ఇస్తే, అసలే బాధల్లో వున్నవాళ్ళు ఏమనుకుంటారు?

“ఎందుకు బాగుండదు? ఎంత వింతగా మాట్లాడతావు లారా నువ్వు! ఇందాకేగా వాళ్ళ మీద జాలితో కరిగిపోయావు? అంతలోకే ఏమొచ్చింది?” తల్లి విసుగ్గా అంది.

లారా పరిగెత్తుకుని వెళ్ళి బుట్టతో సహా తిరిగొచ్చింది. తల్లి బుట్టంతా రకరకాల తినుబండారాలతో నింపింది.

"నువ్వే తీసుకెళ్ళు లారా! వెళ్ళేటప్పుడు ఆ లిల్లీ పూలు కూడా తీసుకెళ్ళు. పాపం, పేదవాళ్ళకి లిల్లీ పూలు బాగా నచ్చుతాయి."

"వద్దు, ఆ పూల కాడలు నీ గౌనంతా పాడు చేస్తాయి," జోస్ హెచ్చరించింది.

"అదీ నిజమేలే. పూలేమీ వొద్దు. వుత్తి బుట్ట మాత్రం తీసుకెళ్ళు లారా. అన్నట్టు లారా, అక్కడ-" ఆగిపోయింది అమ్మ.

"ఏమిటమ్మా?"

తటపటాయించింది తల్లి. "ఏమీ లేదులే, వెళ్ళు. తొందరగా వొచ్చేయి."

తోట దాటి లారా బయటికొచ్చేసరికి చిరు చీకట్లు కమ్ముకుంటున్నాయి. కొంచెం కిందికి, వీధి చివరగా వున్నాయి ఆ చిన్న ఇళ్ళు. మధ్యాహ్నం విందు హడావిడి తర్వాత అంతా నిశ్శబ్దంగా వున్నట్టనిపించింది లారాకి. వున్నట్టుండి తను ఎక్కడికి వెళ్తోందో గుర్తొచ్చిందామెకి. నిజానికి విందులో మాటలూ, హాస్యాలూ, గిన్నెలూ, పళ్ళేల చప్పుళ్ళూ, నవ్వులూ, పచ్చిక వాసనా,అన్నీ కలిపి ఆమె మనసులో ఇంక వేటికీ చోటూ లేకుండా చేసాయి. ఎంత విచిత్రం. ఆకాశం వంక చుసింది. "బలే బాగా జరిగింది పార్టీ!" అనుకుని మళ్ళీ ముందుకెళ్ళింది.

విశాలమైన రోడ్డు కొంచెం ఇరుకైంది. వాళ్ళ పెద్ద వీధి అంతమై ఒక చిన్న సందు మొదలైంది. ఆడవాళ్ళు షాల్ కప్పుకునీ, మగవాళ్ళు టోపీలు పెట్టుకునీ నడుచుకుంటూ పోతున్నారు. ఆ ఇళ్ళనించి చప్పుళ్ళూ వినొస్తున్నాయి. అక్కడక్కడా సన్నని వెల్తురు. లారాకి ఆ వీధిలో తన ఖరీదైన గౌను చూసుకొని కొంచెం సిగ్గనిపించింది. ఈ గౌను కనిపించకుండా పైన ఒక కోటైనా తొడుక్కోని రావాల్సింది, అనుకుంది. దానికి తోడు పెద్ద సిల్కు రిబ్బను తో వున్న అందమైన తన టోపీ. అందరూ తననే వింతగా చూస్తున్నారేమో. అసలు ఇలా రావడమే తప్పేమో. పోనీ తిరిగి ఇంటికెళితే?

అంతలో ఆ ఇల్లు వచ్చేసింది. ఇక ఇప్పుడు వెనుదిరిగినా బాగుండదు. ఇదే ఇల్లు అయివుండాలి, అనుకోని ఆగింది లారా . బయట చిన్న గుంపు వుంది. లోపల చీకటిగా వుంది. గేటు పక్కనే ఒక ముసలావిడ కుర్చీలో కూర్చొనుంది. లారా దగ్గరకొచ్చేసరికి అందరూ మాటలాపేసారు. గుంపు కొంచెం పక్కకి జరిగి ఆమెకి చోటిచ్చారు.

లారాకి చాలా కంగారుగా వుంది. సిల్కు రిబ్బనుని పక్కకి జరుపుకుంటూ, పక్కనే వున్న ఆడమనిషితో, “స్కాట్ గారిల్లు ఇదేనా?” అని అడిగింది. ఆ మనిషి వింతగా నవ్వుతూ, “ఇదేనమ్మాయ్!” అంది.

త్వరగా ఈ బుట్ట ఇచ్చేసి ఇక్కణ్ణించి వెళ్ళిపోవాలి. భయంభయంగా దేవుణ్ణి తలచుకుంటూ లారా తలుపు దగ్గరికెళ్ళి తలుపు తట్టింది. తలుపు తెరుచుకుంది. నల్ల బట్టలతో దిగాలుగా వున్న స్త్రీ తొంగి చూసింది.

లారా తడబాటుతో అడిగింది, “స్కాట్ గారి భార్య మీరేనా?”

“లోపలికి రా అమ్మాయ్!” ఆవిడ వెనుదిరిగి ఇంట్లోకి వెళ్ళిపోయింది.

“లేదు, లేదు. నేను లోపలికి రాను. అమ్మ ఈ బుట్ట ఆవిడకివ్వమంది.”

ఆవిడ విననట్టే లోపలికి వెళ్ళి, ఇంకో తలుపు దగ్గర ఆగి, “ఇలా లోపలికి రా అమ్మాయ్,” అంది. చేసేదేమీ లేక లారా లోపలికి అడుగుపెట్టింది. లోపల తనొచ్చిన గది వంటిల్లులా వుంది. చిన్న దీపం పొగచూరి వెలుగుతూంది. పక్కనే ఇంకొకావిడ కూర్చునుంది.

“ఎమిలీ! నీకొరకెవరో ఒక అమ్మాయి వచ్చింది,” చెప్పింది తలుపు తెరిచిన ఆవిడ. లారా వైపు తిరిగింది, “ఎమిలీ చెల్లెల్నండీ నేను! తను ఎవరితోనూ ఎక్కువగా మాట్లాడలేకపోతుంది. మీరేమీ అనుకోవద్దండీ!”

“అయ్యొయ్యో! ఆవిడని చిరాకు పెట్టకండి. నేను వెళ్తున్నాను.” లారా కంగారుగా అంది.

ఇంతలో కూర్చున్నావిడ తిరిగి లారా వైపు అయోమయంగా చూసింది. ఆమె మొహమూ, కళ్ళు ఎర్రబడి, వాచి, చాలా అసహ్యంగా వుంది. ఆమెకేమీ అర్థమవుతున్నట్టు లెదు. లారా ఎవరు? తమ ఇంటికెందుకొచ్చింది? ఆమెకేమీ బోధపడుతున్నట్టులేదు.

"పోనీలే ఎమిలీ! నువ్వేమీ మాట్లాడకు. నేను చూసుకుంటాను," ఎమిలీ చెల్లెలంది. ఆమె మొహం కూడా ఏడ్చి ఏడ్చి ఉబ్బి వుంది.

"ఆమెని క్షమించమ్మా దయ చేసి," ఇబ్బందిగా నవ్వుతూ లారాతో అంది. లారాకి అక్కణ్ణించి బయట పడటం తప్ప వేరే ఇంకే ఆలోచనలూ లేవు. మళ్ళీ తలుపు కేసి నడిచింది. ఇంకొక తెరిచి వున్న తలుపులోంచి వెళ్ళింది. అయితే ఆ తలుపు బయటికెళ్ళలేదు, కానీ ఇంకో గదిలోకి దారితీసింది. ఆమెకి ఆ గదిలోనే మృతుడి శవం వుందన్న సంగతి తెలిసేసరికే ఆలస్యమయింది.

"ఒక్క సారి శవాన్ని చూస్తావా అమ్మాయ్?" ఎమిలి చెల్లెలడిగింది. లారా భయంతో కొయ్యబారిపోయింది. "భయపడేందుకేమీ లేదమ్మాయ్, అలా పడుకుని నిద్ర పోతున్నట్టున్నాడు. రా చూద్దువు గాని." లారా తొంగిచూసింది.

పేటికలో పడుకుని వున్నాడొక యువకుడు. హాయిగా కష్టాలనించీ, సమస్యలనించీ, దూరంగా, శాంతిగా, కలలు కంటున్నట్టు- కళ్ళు మూసుకుని వున్నాడు. కాని ఆ కళ్ళు మరిక తెరుచుకోవు. ఇంకే కలలూ కనవు. విందులూ, మిగిలిపోయిన తినుబండారాలూ, అందమైన గౌనులూ, ఖరీదైన టోపీలూ వేటితోనూ అతనికి పనిలేదు. అన్నిటినుంచీ దూరంగా వెళ్ళిపోయాడు. తామంతా తోటలో పాటలు పాడుతూ, నవ్వుతూ, తుళ్ళుతూ, కేరింతలు కొడుతున్నప్పుడూ, అతను ఇలాగే వున్నాడు, శాంతిగా, సంతోషంగా. లారాకి ఏమనాలో అర్థం కాలేదు. "నా టోపీ చాలా అసహ్యంగా వుంది, నన్ను క్షమించండి," అంది అసందర్భంగా. అంతే, అక్కణ్ణించి

ఒక్క పరుగున ఇంటి బయటికొచ్చి పడింది. గుంపుని దాటుకుని గబగబా సందులోంచి నడిచింది. సందు చివర లేరీ ఎదురయ్యాడు.

"లారా? నువ్వేనా?"

"నేనే, లేరీ!"

"అమ్మయ్య! నీకోసం కంగారు పడి అమ్మ నన్ను పంపింది. ఏమయింది లారా? భయపడ్డావా?"

"అవును లేరీ!" అన్న చేయి గట్టిగా పట్టుకుంది లారా.

"ఏడుస్తున్నావా? ఏమయింది లారా?"

ఏమీ లేదన్నట్టు తల తిప్పింది లారా.

"ఏడవకు లారా! ఏమయింది? భయపడ్డావా?" అనునయంగా అడిగాడు అన్న.

"భయపడలేదు కానీ," వెక్కుతూంది లారా.

"లేరీ, అసలు జీవితం........" ఏమనాలో తోచలేదు. జీవితమంటే ఏమిటో ఆమె చెప్పలేకపోయింది. అన్నకి అర్థమైంది.

"అవును, కదా?" అన్నాడు.

(మూలం: The Garden Party – Katherine Mansfield)

******************

*రచయిత్రి పరిచయం: కేథరిన్ మేన్స్‌ఫీల్డ్ (1888-1923) న్యూజీలాండ్‌కి చెందిన రచయిత్రి. న్యూజీలాండ్‌లో పుట్టి ముప్ఫై అయిదేళ్ళకే ఇంగ్లండులో మరణించారు ఆవిడ. రచయిత్రిగానూ, వ్యక్తిగతంగానూ చాలా వివాదాస్పదమైన జీవితం ఆవిడది. ఆవిడని*

అమితంగా ప్రేమించిన వర్జీనియా వూల్ఫ్, ఇడా బేకర్ లాటి వాళ్ళూ వున్నారు, విపరీతంగా ద్వేషించిన డి.హెచ్. లారెన్స్ లాటి వాళ్ళూ వున్నారు. "జీవితానికీ వృత్తికీ మధ్య విభజన రేఖ వుండనే కూడదని" నమ్మిన ఈవిడ జీవితం కూడా ఆవిడ రచనల్లానే వుంటుంది.

ధైర్యంగా, నిర్భయంగా, నిజాయితీగా, ఎవరికీ ఏ సంజాయిషీలూ ఇవ్వకుండా, కొంచెం తన తోటి వారికి భిన్నంగా, చాలా ఆసక్తికరమైన స్త్రీ, అంతకంటే ఆసక్తికరమైన రచనలు మేన్స్‌ఫీల్డ్‌వి.

న్యూజీలాండ్‌లో వెలింగ్టన్ లో పుట్టిన కేథరిన్ పదేళ్ళకే స్కూల్ మేగజీన్ కోసం రాసే వారు. సంపన్నుల కుటుంబం వాళ్ళది. తండ్రి బేంకరు. 1903 నించి 1906 వరకు లండన్ లో చదువుకుని న్యూజీలాండ్ తిరిగ్ వెళ్ళారు. అయితే అక్కడ రెండేళ్ళకంటే ఎక్కువ వుండలేక మళ్ళీ లండన్ తిరిగ్ వెళ్ళి జీవితాంతం అక్కడే వున్నారు. స్త్రీ-పురుషులతో ఆమె లైంగిక సంబంధాలు వివాదాస్పదం. 1918 లో జాన్ మిడిల్టన్ మరేని వివాహమాడారు. వాళ్ళిద్దరూ 1911 నించే సహజీవనం మొదలు పెట్టారు. అయితే ఆమె అంతకు ముందే వివాహం చేసుకున్న బౌడెన్ తో చట్ట రీత్యా విడాకులు తీసుకోకపోవడం వల్ల వీళ్ళిద్దరూ ఆగాల్సి వచ్చింది. బ్రతుకంతా రకరకాల వ్యక్తులతో సంఘర్షణలోనూ, గర్భ స్రావాలతోనూ, అనారోగ్యంతోనూ, ఆర్థిక ఇబ్బందులతోనూ బాధపడింది కేథరీన్.

తను స్వయంగా చెహోవ్‌ని అభిమానించినా, ఆవిడ కథనం చాలా మంది ఇతర రచయితలని ప్రభావితం చేసింది. కేథరిన్ బ్రతుకే ఒక విచిత్రమైన కథలాగుంటుంది.

ఆమె శైలిలో నాకు చాలా నచ్చేది, కొంచెం స్పష్టాస్పష్టమైన పాత్ర చిత్రీకరణ. అంటే ప్రధాన పాత్రల గురించి కథ ఏమీ చెప్పదు. వాళ్ళ వయసు కానీ, సాంఘిక హోదా కానీ, ఇతర పాత్రలతో వారికుండే సంబంధ బాంధవ్యాలు కానీ ఏ వివరాలూ కథలో వుండవు. అవి మనం

అర్థం చేసుకోవాలంతే. అంతే కాదు ప్రధాన పాత్రలు తమ చుట్టూ వుండే వారికంటే కొంచెం భిన్నంగా వుంటాయి. అందుకే చాలా సార్లు ఆవిడ ప్రధాన పాత్రలు ఆవిడలాగే వుంటాయి.

# పుకారు

(మార్చి26, 2013 , సారంగ వార పత్రిక)

( ఆంటోన్ చెహోవ్)

అహినీవ్ గారు, అదే, స్కూల్లో మాస్టారు గారు, తన కూతురి వివాహం జరిపిస్తున్నారు. వరుడు హిస్టరీ జాగ్రఫీలు బోధించే స్కూలు మాస్టారు. పెళ్ళి సంబరాలతో ఇల్లంతా గగ్గోలుగా వుంది. హాల్లో పాటలు, ఆటలు, వాయిద్యాలూ అబ్బో, చెప్పలేని హడావిడి. మధ్యలో పానీయాలూ, తినుబండారాలూ సరఫరా చేస్తూ తెల్లని టైలు కట్టుకున్న బట్లర్లు. ఎడతెగని కబుర్ల జోరు. పక్క పక్కనే కూర్చుని లెక్కల మాస్టారూ, ఫ్రెంచి మాస్టారూ, టాక్సు అధికారీ ఒకరికొకరు అడ్డం వస్తూ మాట్లాడుకుంటున్నారు. వాళ్ళ మాటల్లో సజీవ సమాధుల దగ్గర్నించీ, ఆధ్యాత్మిక విషయాలవరకూ అన్ని సంగతులూ దొర్లి పోతున్నాయి.

ఆ మాట కొస్తే, వాళ్ళెవరికీ ఆధ్యాత్మికత మీద పెద్ద నమ్మకం లేదు కానీ, మనిషి మేధస్సుకి అందని విషయాలూ వుండి వుండవచ్చని తప్పక ఒప్పుకుంటారు. పక్క గదిలో సాహిత్యాన్ని బోధించే మాస్టారు ఒక సెంట్రీ తన తుపాకీతో చుట్టూ వున్నవాళ్ళని కాల్చి పారేయడంలో తప్పేమీ లేదని గట్టిగా వాదిస్తున్నారు. వినేవాళ్ళకి కొంచెం భయం వేసినా, ఆయన వాగ్ధాటికి తాళలేక ఒప్పేసుకుంటున్నారు. లోపలికి రాలేక బయటే నిలబడ్డవాళ్ళు కుతూహలంగా లోపలికి చూస్తున్నారు. గంట మధ్య రాత్రి పన్నెండు కొట్టేసరికి అహినీవ్ గారికి ఇంట్లో విందుకి ఏర్పాట్లు ఎలా సాగుతున్నాయోనన్న అనుమానం వచ్చింది. వంటింట్లోకి దారి తీసారు.

వంటిల్లంతా సామాన్లతోనూ, తినుబండారాల వాసనలతోనూ నిండి పోయి వుంది. రెండు పెద్ద బల్లలమీద రకరకాల పానీయాలూ, వంటకాలూ అందంగా పేర్చబడ్డాయి. వంటమనిషి మార్ఫా, ఎర్రబడిన మొహంతో, పీపాలాటి శరీరంతో హడావిడిగా బల్లల మధ్య తిరుగుతోంది.

అహినీవ్ ఉత్సాహంగా, "మార్ఫా! మనం తెచ్చిన చేపని వండావా? ఏదీ చూపించు. వంటింటి వాసనలు భలే నోరూరిస్తున్నాయి," అన్నాడు. మార్ఫా పక్కనే ఇంకో బల్ల దగ్గరకెళ్ళి పరచి వున్న పేపరు మూతని జరిపింది. మూత కింద ఒక పెద్ద డేగిశా నిండుకూ పెద్ద చేప వండి వుంది. రకరకాలైన మసాల దినుసులతోనూ, జెల్లీలతోనూ, ఆలివ్ పళ్ళూ, కేరట్ ముక్కల తోనూ అలంకరించి వుందా వంటకం. దాన్ని చూడగానే సంతోషంతో అహినీవ్ కళ్ళు పెద్దవైనాయి. గిన్నె మీదికి వంగి వంటకాన్నించి వచ్చే సువాసనని బలంగా ఆఘ్రాణించి, పెదాలని గట్టిగా చప్పరించాడు.

"ఆ... ఎవరు లోపల ముద్దులు పెట్టుకుంటున్నారు? లోపల నువ్వేనా మార్ఫా?"

తలుపు దగ్గర గొంతు వినిపించి తిరిగి చూసాడు అహినీవ్. స్కూల్లో చిన్నా చితకా పనులు చేసే వాంకిన్ తలుపు దగ్గర నిలబడి లోపలికి తొంగి చూస్తున్నాడు.

"ఎవరంటూంటే? అహినీవ్, మీరా? ఈ వయసులో ఇదేం బుద్ధి తాతగారూ? ఆ?" రెట్టించాడు.

"ముద్దా? నేను ఎవరినీ ముద్దు పెట్టుకోలేదు," అహినీవ్ కంగారు పడ్డాడు. "నేను ముద్దు పెట్టుకోవటం ఏంట్రా బుద్ధిలేని గాడిదా? చేప కూర వాసనకి నోరూరి పెదాలు చప్పరించానంతే."

"చాల్చాల్లే, ఇంకెక్కడైనా చెప్పు ఇలాటి కథలు, నాక్కాదు." నవ్వుకుంటూ వెళ్ళిపోయాడు వాంకిన్. అహినీవ్ మొహం ఎర్ర బడింది.

"ఇదెక్కడి గొడవరా బాబూ! ఈ సన్నాసి ఇప్పుడు ఊళ్ళో అందరికీ ఉన్నవీ లేనివీ కల్పించి చెప్తాడేమో ఖర్మ! ఎంత పని జరిగిందిరా దేవుడా!"

మెల్లిగా అడుగులో అడుగేసుకుంటూ అహినీవ్ ముందు హాల్లో కొచ్చాడు. వాంకిన్ కోసం చుట్టూ పరికించి చూసాడు. హాల్లోనే పియానో పక్కన నిలబడి వున్నాడు వాంకిన్. పియానో మీదుగా వంగి, అక్కడకూర్చున్న ఇన్స్పెక్టరుగారి మరదలితో కొంటెగా నవ్వుతూ ఏదో

చెప్తున్నాడు. “నాకు తెలుసు, నాగురించే చెప్తున్నాడు. దరిద్రుడు! ఆ పిల్ల నమ్మేస్తోంది.బాబోయ్, నవ్వుతున్నారిద్దరూ! ఇప్పుడేం చేయాలి? ఏదైనా చేసి ఆ వెధవని ఆపాలి. ఇంకా పుకార్లు పుట్టిస్తాడు లేకపోతే.! వీల్లేదు. నేనే ముందు అందరితో వాడి మాటలు అబద్ధాలని చెప్పేస్తాను.” అహినీవ్ తల గోక్కున్నాడు.

సిగ్గుతో మొహం ఎర్రబడుతూండగా ఫ్రెంచి మాస్టారు దగ్గరకెళ్ళాడు. “ఇప్పుడే వంటింట్లో కెళ్ళి వస్తున్నా. వంటెలా సాగుతూందో చూద్దామని. లోపల చేపల కూర చేయడం అయిపోయింది. ఎంత పెద్ద చేపనుకున్నావు? సుమారు గజంన్నర పొడుగుంటుంది. హ! హ! హ! అన్నట్టు ఒక విచిత్రం చెప్పాలి. ఇందాక వంటింట్లో, అదే, పెద్ద చేపని చూడటానికి వెళ్ళినప్పుడోయ్! ఆ చేప కూరను చూసి నోట్లో నీరూరిందనుకో! ఆహా, అని పెదవి చప్పరించాను. ఆ క్షణమే ఈ వాంకిన్ లోపలికొచ్చాడు. వొచ్చి నన్నంటాడూ, హ, హ, హ, ఏం చెప్పేది! నన్నంటాడూ, “మార్ఫాని ముద్దు పెట్టుకున్నావా?” అని! నేను! మార్ఫాని! ముద్దు! బుద్ధి లేని పక్షి కాకపోతే, ఏమిటా మాటలు? అదీ మార్ఫాని! వంట మనిషిని! దాన్ని ముద్దు పెట్టుకుంటే జంతువుని ముద్దు పెట్టుకున్నట్టే కాదూ? ముద్దట ముద్దు! తెలివి తక్కువ వెధవ!”

“ఎవరినీ తెలివి తక్కువ వెధవ అంటున్నారూ?” లెక్కల మాస్టారు దగ్గరకొచ్చాడు. “ఇంకెవడండీ? అదిగో అక్కడే నిలబడి వున్నాడు  చూడండీ, ఇకిలిస్తూ, వాంకిన్! ఇందాక వంటింట్లో…” మళ్ళీ కథంతా చెప్పాడు. “నేను మార్ఫాని ముద్దు పెట్టుకోవటమేమిటండీ? వాడి తెలివి తక్కువ మాటలకి నాకైతే నవ్వాగటం లేదు. అసలు నన్నడిగితే..”

ఆయన వెనుదిరిగేసరికి టాక్స్ ఇన్స్పెక్టరు నిలబడి వున్నాడు. “అబ్బే ఏం లేదు! వాంకిన్ గురించే మాట్లాడుకుంటూన్నాం. భలే విచిత్రమైన వాడు లెండి! ఇందాకేమయిందనుకున్నారు వంటింట్లో? నేను మార్ఫా పక్కన నిలబడి వున్నా. బాగా తాగినట్టున్నాడు, లోపలికొచ్చి, “మార్ఫాని ఎందుకు ముద్దు పెట్టుకుంటున్నావ్?” అని అడిగాడు. నేను! మార్ఫాని! ముద్దు! ఒరి దరిద్రుడా! మార్ఫాని నేనెందుకు ముద్దు

పెట్టుకుంటానురా? నాకు ఇంట్లో పెళ్ళాం లేదా?" అని కడిగేసాను కాని నాకు భలే నవ్వొచ్చింది..."

"ఎవరబ్బా అంత నవ్వించింది?" అక్కడికి అప్పుడే వచ్చిన ఇంకొక మాస్టారు అడిగారు. "ఇంకెవరు? మన వాంకిన్! ఇందాక వంటింట్లో...." ఒక్క అర గంటసేపట్లో ఆ వార్త దాదాపు వచ్చిన బంధువులందరికీ తెలిసిపోయింది. అహినీవ్ సంబరపడ్డాడు. "ఇప్పుడు చెప్పుకోరా, ఎవరితో చెప్పుకుంటావో! అసలు నిన్ను ఎవరైనా నమ్ముతారేమో చూస్కో! నువ్వు కథ మొదలు పెట్టగానే, అందరూ, "నోర్ముయ్యవోయ్! అసలేం జరిగిందో మాకంతా తెలుసు" అని నీ నోరు మూయించకపోతే నన్నడుగు!" అనుకున్నాడు గర్వంగా. అతని సంతోషానికి మేర లేకపోయింది. ఆ సంతోషంలో అనుకున్నదానికంటే నాలుగు గ్లాసులు ఎక్కువే తాగేడు. పెళ్ళి విందు ముగిసింతర్వాత ఎక్కడి వాళ్ళనక్కడికి పంపించి అలిసి పోయి నిద్ర పోయాడు అహినీవ్. మర్నాటినించీ ఆ సంగతే మర్చిపోయాడు.

అయితే అంతా మనం అనుకున్నట్టే జరగదు కదా! సరిగ్గా వారం గడిచేసరికి, అహినీవ్ స్కూల్లో టీచర్ల రూములో వుండగా హెడ్ మాస్టారు పక్కకి పిలిచారు. "చూడు అహినీవ్! ఇలా మాట్లాడుతున్నందుకు నన్ను మన్నించు. ఇది నాకవసరం లేని విషయం నిజం చెప్పాలంటే. కానీ, ఒక స్నేహితునిగా నిన్ను హెచ్చరించడం నా బాధ్యత. నువ్వు వంట మనిషి వలలో పడిపోయావని ఊరంతా చెప్పుకుంటున్నారు. నువ్వు ఆమెను ప్రేమిస్తావో, ముద్దులే పెట్టుకుంటావో నీ ఇష్టం. కానీ, కనీసం అందరూ చూస్తూండగా వద్దు. నువ్వు స్కూల్ మాస్టారువన్న విషయం మరిచిపోకూడదు!" అహినీవ్ కి స్పృహ తప్పినంత పనైంది. మరుగుతున్న నీళ్ళు మొహం మీద పడ్డ మనిషిలా ఇంట్లోకి అడుగుపెట్టాడు. అసలు నడుస్తూంటే వీధుల్లో అందరూ తననే గుచ్చి గుచ్చి చూస్తున్నట్టనిపించింది అతనికి.

"ఇవాళెందుకో తిండే తినడంలేదు. మీ ధ్యాసంతా ఎక్కడుందో మరి?" భార్య మాటలతో ఈ లోకంలోకొచ్చి పడ్డాడు అహినీవ్. "అంత ఆలోచన దేని గురించో? మీ ప్రియురాలు మార్ఫా గురించే గా? సిగ్గుండాలి! ఇంకా నయం, పాపం నా స్నేహితులు నా కళ్ళు తెరిపించేరు.

లేకపోతే ఇంకా ఎన్నాళ్ళు సాగేదో ఈ వ్యవహారం!" భోజనం మీది నించి లేచి అహినీవ్ కలలోని మనిషిలా నడుస్తూ వాంకిన్ ఇల్లు చేరుకున్నాడు.

వాంకిన్ ఇంట్లోనే వున్నాడు. "నీచుడా! నీకు నేనేం ద్రోహం చేసానురా? ఊరందరి ముందరా నన్ను అవమానాల పాలు చేస్తావా? ఎందుకిలా నా గురించి పుకారు లేపావు?"వాంకిన్ ని పట్టుకుని దులిపాడు అహినీవ్.

వాంకిన్ తెల్లబోయాడు. "పుకారా? ఏం పుకారు? అసలునువ్వు దేని గురించి మాట్లాడుతున్నావో నాకు తెలియడం లేదు."

"నా గురించీ మార్ఫా గురించీ పుకార్లు లేపుతున్నదెవరు? నువ్వు కాదా?" కోపంగా అరిచాడు అహినీవ్. వాంకిన్ గుడ్లు మిటకరించి నోరు తెరిచాడు ఆశ్చర్యంగా! మెళ్ళో శిలువని చేతితో పట్టుకుని, గంభీరంగా, "భగవంతుని తోడు! నేనారోజు గురించి ఒక్క మాట కూడా ఎవరితోనూ అనలేదు. ఈ మాట అబద్ధమైతే నేను కలరా సోకి చస్తాను," అన్నాడు.

అహినీవ్ కి అతను నిజమే చెప్తున్నాడనిపించింది. "నువ్వు కాకపోతే ఇంకెవరు?" అహినీవ్ ఆ రోజు జరిగిందంతా జ్ఞాపకం తెచ్చుకున్నాడు.

ఎవరై వుంటారబ్బా! ఎంత ఆలోచించినా అర్థం కాలేదతనికి.

(మూలం: ఆంటొన్ చెహోవ్ The Rumour)

**********

*రచయిత పరిచయం : రష్యాలో పుట్టి నలభై నాలుగేళ్ళ చిన్న వయసులోనే గతించిన ఆంటొన్ చెహోవ్ నాటక రచయితగా కంటే కథా రచయితగా ఎక్కువ పేరుపొందాడు. వృత్తి రీత్యా వైద్యుడే అయినా, పత్రికా విలేఖరిగా పనిచేస్తూ ఎన్నో కథలనీ నాటకాలనీ రచించారు.*

ముందుగా కథలని కేవలం డబ్బు సంపాదన కొరకే ప్రారంభించినా, కొద్ది కాలంలోనే కథా రచనని ఒక అద్భుతమైన కళగా మార్చిన అక్షర శిల్పి ఆయన.

ఆరుగురు పిల్లల్లో ఒకడైన చెహోవ్ 1860 లో దక్షిణ రష్యాలో జన్మించారు. ఆయన తండ్రి పావెల్ అక్కడ ఒక చిన్న దుకాణదారు. పిల్లలని అతి తీవ్రంగా దండించే పావెల్ తరువాత చెహోవ్ చాలా కథల్లో చోటు చేసుకున్నారు. చెహోవ్ తల్లి యెవ్జెనియా అతన్ని చిన్నప్పుడే కథల ప్రపంచానికి పరిచయం చేసింది. ఆయన తన బాల్యాన్ని ఖైదుతో పోల్చారు. చెహోవ్ కి పదహారేళ్ళప్పుడు వాళ్ళ కుటుంబం ఆర్ధిక కారణాల వల్ల మాస్కోకి తరలి వెళ్ళింది. దుర్భరమైన దారిద్ర్యాన్ని అనుభవిస్తూ, చెహోవ్ ఉన్నదంతా అమ్మి చదువుకున్నారు. మెడికల్ కాలేజి లో విద్యార్థిగావున్నప్పుడే ఆయన అడపా దడపా కథలు రాస్తూ పేరు తెచ్చుకున్నారు. మొదట్లో ఆయన ఎక్కువగా హాస్య రస భరితమైన కథలు రాసేవారు. పాతికేళ్ళ వయసులోనే టీ.బీ. వాత పడ్డ చెహోవ్ నలభై నాలుగేళ్ళ వయసులో మరణించారు. బెర్నార్డ్ షా, సోమర్సెట్ మాం, వర్జీనియా వుల్ఫ్, బేట్స్ మొదలైన కథకులందరూ తాము చెహోవ్ వల్ల ప్రభావితులైనట్టు ఒప్పుకున్నారు.

ఇరవై ఆరేళ్ళ వయసులో మొదటగా ఒక కథా సంకలనాన్ని ప్రచురించిన చెహోవ్ ఇరవై ఎనిమిదేళ్ళ వయసులో పుష్కిన్ బహుమతిని గెలుచుకున్నారు. ఆ తరువాత పదేళ్ళ వరకూ ఆయన లెక్క లేనన్ని కథలు రాసి రష్యన్ సాహిత్యంలో మరచిపోలేని ప్రభావాన్ని చూపారు. ఆయన రాసిన నాటకాలు స్టేజిపై మొదట్లో విఫలమైనా, తరువాత చాలా ప్రజాదరణ పొందాయి. "అంకుల్ వాన్యా", "ది త్రీ సిస్టర్స్", "ది చెర్రీ ఆర్చర్డ్" మూడూ ఆయన రాసిన నాటకాల్లోకెల్లా గొప్పవని పేరు పొందినవి. అయినా ఆయనని ప్రజలు కథా రచయితగానే ఎక్కువ ప్రేమించారు.

చెహోవ్ కథల్లో సాధారణంగా ఒకే ఒక్క సంఘటన వుంటుంది. ఆ సంఘటనలో వుండే వ్యక్తులు చాలా వరకు కేవలం ఆ సంఘటన వల్లే ఆ ప్రదేశంలో కలుస్తారు. రచయిత ఆ సంఘటన గురించి కానీ వ్యక్తుల గురించి కానీ ఎక్కువ వర్ణనలూ వివరణలూ ఇవ్వరు. కథ

నిడివి నాలుగైదు పేజీలకు మించదు. కానీ ఆ నాలుగైదు పేజీల్లోని ఆ చిన్న సంఘటనలోనే ఆ వ్యక్తుల గురించి, వాళ్ళ మనస్తత్వాల గురించీ, వాళ్ళ సాంఘిక పరిస్థితుల గురించీ, వాళ్ళల్లో అంతర్లీనంగా వుండే సంబంధాల గురించీ, ఆ సంబంధాల వెనుక వుండే సాంఘిక, ఆర్థిక, రాజకీయ శక్తుల గురించీ అంతా మనకు అర్థమై పోతుంది, ఒక్క మాటలో చెప్పాలంటే ఒక తడి గుడ్డని పిండి నీళ్లు తీసినట్టు ఆ ఒక్క సంఘటననించీ ఎంతో అవగాహన వెలికి తీస్తారు చేహోవ్. చాలా కథలకి అసలు క్లైమాక్స్ అన్నదే వుండదు. చాలా విషయాలను పాఠకుల ఊహకే వదిలేస్తూ, *subtlety* అనే మాటకు అర్థాన్నిస్తారు చెహోవ్.

# పై గదిలో ప్రేమికుడు

(మే 2013 ఈమాట)

(మూలం: పి జి వొడ్ హవుజ్)

శ్రీదేవి చిర్రెత్తిపోవడం అనేది మూడంచెల్లో జరిగింది. తను రాసుకుంటున్న పాటలో లీనమై వుండడం వల్ల ఆమెకి ఆ చప్పుడు ముందు లీలగా వినిపించింది. విని కొంచెం చిరాకు లాంటిది కలిగింది. కొంచెం సేపటి తర్వాత తన ఏకాగ్రతకి భంగం కలిగేసరికి కోపం మొదలైంది. ఇంకొంచెం సేపటి తర్వాత ఆ చప్పుడు తాను రాస్తూ పాడుకొంటున్న పాటని వెక్కిరిస్తున్నట్టనిపించి అవమానంలోకి దారి తీసింది.

పై గదిలో వుండే వెధవన్నర వెధవకి తాను వయొలీన్ మీద వాయిస్తున్న పాట నచ్చక అలా బూట్లతో తప్పుడు తాళం వేస్తూ గొడవ పెడుతున్నాడన్నమాట. కోపంతో పళ్ళు పట పటా కొరికి లేచింది శ్రీదేవి. వాడికి బుద్ధి చెప్పకుండా వదిలేది లేదు. ఆవేశంతో ఆమె చెంపలు ఎర్రబడ్డాయి, కళ్ళు నిప్పులు కక్కాయి. తన గదిలోంచి బయటికి వచ్చి మెట్లెక్కింది. ఆ క్షణంలో ఆమెని చూసిన వారెవ్వరైనా, ఆ పై గదిలో వున్న అమాయకుడి మీద జాలి పడక మానరు. తన మీదికి రాబోతున్న సుడిగాలి గురించి తెలియదు పాపం, అని నిట్టూర్చక మానరు! శ్రీదేవి తలుపు గట్టిగా తట్టింది.

"యస్! కమిన్," లోపల్నుండి కొంచెం ప్రసన్నంగా మగ గొంతు వినిపించింది. గొంతు ఎంత బాగుండీ ఏం లాభం, సంగీతాన్ని అవమానించే మూర్ఖుడికి!

శ్రీదేవి లోపలికి అడుగేసింది. లోపల ఒక చిన్న గది, ఒక పెయింటరు తన కోసం తయారు చేసుకున్న స్టూడియోలా వుంది. గది శుభ్రంగానే వున్నా నిరాడంబరంగా వుంది. గది మధ్యలో బొమ్మలేసుకోవడానికి కాన్వాస్ బిగించిన ఈసెల్ వుంది. ఈసెల్ పైనుంచి సిగరెట్టు పొగ తేలుతోంది. ఈసెల్ కింది నించి జీన్స్ పేంట్ కాళ్ళు కనిపిస్తున్నాయి. బూట్లు తొడుక్కున్న ఆ కాళ్ళు నిరంతరంగా నేల మీద రకరకాలుగా తాళం వేస్తూనే వున్నాయి.

“ఒక్క క్షణం ఇటు చూస్తారా?” శ్రీదేవి మర్యాదగానే అడిగింది.

“వొద్దండీ! ఇప్పుడు నాకే మోడల్స్ తోనూ పని లేదు.” ఈసెల్ వెనకనించి ఆ మూర్ఖుడి గొంతు వినొచ్చింది. “మీ అడ్రసు అక్కడ ఆ కాగితం మీద రాసి పెట్టి వెళ్ళండి, అవసరం అయితే నేనే కబురు చేస్తాను.”

“నేను మోడల్‌ని కాను!” శ్రీదేవి కఠినంగా అంది.

ఆ మాటతో ఆ గొంతు తాలూకు మొహం ఈసెల్ వెనకనించి బయటికొచ్చింది. నోట్లో వున్న సిగరెట్టుని యాష్ ట్రేలో పెట్టి కుర్చీలోంచి లేచాడు.

“అలాగా? ముందిలా కూర్చోండి. ఎవరు మీరు? ఏం పని మీద వచ్చారు?” మర్యాదగా అన్నాడు.

దేవుడు ఎంత అపాత్ర దానం చేస్తాడో కొన్నిసార్లు! ఆ దౌర్భాగ్యుడి గొంతే కాదు, మొహం కూడా బాగానే వుంది. అన్నిటికంటే అడ్డదిడ్డంగా వున్న ఆ వొత్తైన జుట్టు, అనుకుంది శ్రీదేవి. కోపంగా వున్నా నిజాలు ఒప్పుకుంటుంది తను మరి!

“మిమ్మల్ని డిస్టర్బ్ చేసినందుకు క్షమించాలి. మీకు నా పాట నచ్చినట్టు లేదు.” కోపాన్నీ, మర్యాదనీ, వెటకారాన్ని సమపాళ్ళలో మేళవించి అంది. ఆమె వెటకారం అతనికేమీ అర్థమయినట్టు లేదు. అయోమయంగా చూశాడు. ఇహ ఇతనితో సూటిగా చెప్పాల్సిందే!

“నేను కింద పోర్షన్లో అద్దెకుంటాను. బహుశ నా పాటా, నా వయోలీన్ నచ్చక కాబోలు బూట్లతో తాళం వేస్తూ గొడవ చేస్తున్నారు!”

“అదేం లేదే! మీ పాట బాగానే వుంది.” ఇంకా అయోమయంగానే అన్నాడు.

“మరయితే ఆ బూట్లతో నేల మీద చప్పుడు చేస్తారెందుకు? చాలా చిరాగ్గా వుంది!”

శ్రీదేవి కోపంగా అని వెళ్ళడానికి వెనుదిరిగింది. మళ్ళీ ఆగి, “పైగా మీరలా బూట్లతో తడుతూ వుంటే నా నెత్తిన కప్పు కూలుతుందేమోననే భయం కూడా! వస్తా!” అంటూ వెళ్ళబోయింది. అప్పటికి ఆ అందగాడు తేరుకున్నాడు.

“ఆగండాగండి! అప్పుడే వెళ్ళకండి.”

ఆగి అతని వైపు చూసింది. స్నేహంగా, అందంగా చిరునవ్వు నవ్వుతున్నాడు. “మీరెందుకో కోపంగా వున్నారు. నిజానికి నాకు సంగీతమంటే చాలా ఇష్టం. కానీ, మీరు పాడే పాట ఏదో నాకు తెలియలేదు. ఊరికే వాయిస్తున్నారనుకొన్నాను. ఏదో ఆలోచనలో యధాలాపంగా బూట్లతో నేలను తడుతున్నాను. మిమ్మల్ని డిస్టర్బ్ చేయాలని కాదు.”

“ఒక కొత్త పాటకి వరస కడుతున్నాను. ఇంకా సరిగ్గా రావటం లేదు,” ముక్తసరిగా అన్నా, ఆమె గొంతులో కోపం తగ్గింది.

“అమ్మో! మీరు పాటలకి వరసలు కడతారా?”

“ఒకటి రెండు పాటలు రాసి వరసలు కట్టాను!”

“యెంత అదృష్టవంతులో! నాకు అసలు అలా కళల్లో ప్రవేశం వున్నవాళ్ళంటే చాలా గౌరవం.”

“మీరు కూడా కళాకారుడిలానే వున్నారే. ఏదో పెయింట్ చేస్తున్నట్టున్నారు?”

చిరునవ్వుతోనే తల అడ్డంగా తిప్పాడతను. “నా బొంద! ఈ పెయింటింగు మానేసి గోడలకి సున్నం వేసుకోడానికి పనికొస్తానేమో నేను! ” అతని మాటల్లో నిరాశేమీ లేదు.

“ఏదీ, నన్నూ చూడనీండి!” ఈసెల్ వైపు నడిచింది.

“నా మాట విని మీరటు వెళ్ళొద్దు. ఆ పెయింటింగు చూస్తే జడుసుకుంటారేమో!”

అతని మాటలు పట్టించుకోకుండా ఈసెల్ మీదున్న బొమ్మని చూసింది. నిజాయితీగా చెప్పాలంటే ఆ బొమ్మ ఘోరంగా వుంది. ఒక చిన్న పాప ఇంకొక చిన్న పిల్లి కూనని పట్టుకుని వుందా చిత్రంలో. ఆమెకేమనాలో తోచలేదు.

“నేను చెప్పలే మీరు జడుసుకుంటారని? దాని పేరేమిటో తెలుసా? పిల్లి-పిల్ల! పేరు బాగుంది కదూ? వినగానే చూసే వాళ్ళకి బొమ్మలో సంగతేంటో తెలిసిపోతుంది. అన్నట్టు, ఆ కుడి వైపున వున్నది పిల్లి కూన! మళ్ళీ మీరు పొరపడతారేమో, వద్దని చెప్తున్నా, అంతే!”

శ్రీదేవికి బొమ్మల మీద వుండే అభిప్రాయాలు బొమ్మల కన్నా వాటిని గీసిన వాళ్ళపై తన అభిప్రాయాల మీద ఆధారపడి వుంటాయి. అందులోనూ ఆ అందగాడు తన సంగీతాన్ని కూడా మెచ్చుకున్నాడాయె!

“చాలా అద్భుతంగా వుందీ బొమ్మ!”

సంతోషం కంటే ఆశ్చర్యం ఎక్కువ కనిపించిందతని మొహంలో. “నిజంగానా? హమ్మయ్య, ప్రపంచంలో ఒక్కరికైనా నా బొమ్మ నచ్చింది. ఇహ నేను హాయిగా చచ్చి పోతాను. అయితే ముందు కిందికొచ్చి మీ పాట మొత్తం విన్నాకనే అనుకోండి!”

“వొద్దులేండి! చిరాకుతో నేల మీద బూట్లతో తప్పు తాళం వేస్తారు.”

“అసలు నేనిక ఈ జన్మలో నేలమీద బూట్లతో తాళం వేయదల్చుకోలేదు,” అన్నాడు గంభీరంగా. అందంగా నవ్వింది శ్రీదేవి.

కళాకారుల్లో స్నేహాలు తొందరగా పెరుగుతాయి. గంట సేపట్లో అతని పేరు సి.జీవి అనీ, ఈ పెయింటింగు అతనికి బ్రతుకుతెరువేమీ కాదనీ, ఎక్కడో చిన్న వుద్యోగం లాటిది చేస్తున్నాడనీ తెలుసుకుంది. మాట్లాడుతున్నకొద్దీ అతనామెకి నచ్చసాగాడు. తన బొమ్మలు అంత ఘోరంగా వున్నందుకు అతనేమీ పెద్ద నొచ్చుకున్నట్టు లేదు. అది ఆమెకి వింతగా అనిపించినా, నచ్చింది.

అదే భవనంలో ఇంకో పోర్షనులో వుండే మోహన్‌కి ఎంత విభిన్నంగా వుందీతని ధోరణి, అనుకుందామె. మోహన్ ఒక్క చిత్రాన్ని కూడా అమ్ముకోలేని విఫల కళాకారుడు. అప్పుడప్పుడూ శ్రీదేవి గదిలోకొచ్చి ఒక కప్పు కాఫీ తాగి, తన నిరాశా, నిస్పృహలని గుమ్మరించి వెళ్తూంటాడు. అయితే మోహన్ అభిప్రాయం ప్రకారం, తానొక అద్భుతమైన కళాకారుడు. పాడు నికృష్ట ప్రపంచం అతన్నీ, అతని కళనీ అర్థం చేసుకోలేక వ్యర్థం చేస్తుంది. ప్రజలకసలు ఏ మాత్రం కళా హృదయం లేదని మోహన్ గాఢ నమ్మిక. అందుకు నేరుగా వ్యతిరేకంగా వుంది జీవి అభిప్రాయం. శ్రీదేవికి అతని స్పోర్టివ్ నెస్సూ, నిజాయితీ చాలా నచ్చేయి.

నిజానికి శ్రీదేవికి కొంచెం అహంకారం ఎక్కువ. ప్రాణాలు పోయే పరిస్థితిలో కూడా ఆమెకి తన బాధలు ఇతరులతో పంచుకోవడం ఇష్టం వుండదు. అందుకే ఆమెకి ఊరికే తన సానుభూతి కోసం ఏడ్చే మగవాళ్ళంటే మంట. కానీ ఇవాళ మొదటిసారి ఆమె జీవితో తన కష్టాల గురించి కొంచెం చెప్పుకుంది. బహుశా ఆ వొత్తైన జుట్టు వల్లో ఏమో, అతను చాలా నమ్మ దగ్గ వ్యక్తిలా అనిపించాడు. తాను రాసి వరస కట్టే పాటలని ఎవరూ కొనకపోవడంతో నానాటికీ దిగజారుతున్న తన ఆర్థిక పరిస్థితీ, డబ్బు కోసం ఇబ్బంది పెట్టే ఆమె విద్యార్థులూ, అన్నిటి గురించీ చెప్పుకుంది.

“నువ్వప్పుడే రెండు మూడు పాటలు రాసేవు కదా? ఇంకా నీ కొత్త పాటలకోసం ఎవరూ అడగటం లేదా?” అనునయంగా అడిగాడు జీవి. అంతలోనే, వాళ్ళు మీరులోంచి నువ్వులోకి మారిపోయారు.

“లేదు. ఆ మూడు పాటలే అమ్ముడయాయి, అంతే! కొత్త పాటల కోసం ఏ మ్యూజిక్ కంపెనీ కానీ, సినిమా వాళ్ళు కానీ అడగటమే లేదు.”

“ఎందుకని?”

“ఎందుకంటే నేను రాసిన మూడు పాటలూ ఒకాయన పాడతానని హక్కులు కొనుక్కున్నాడు, కానీ వాటిని ఎక్కడా పాడటం లేదు. అప్పుడు నా పాటల గురించి జనాలకి ఎలా తెలుస్తుంది? ఎంత మంది మ్యూజిక్ కంపెనీ వాళ్ళు అలా ఆశ పెట్టి మోసం చేస్తారో తెలుసా? ”

“అలా నిన్ను మోసం చేసిన వాళ్ళందరి పేర్లూ ఇటు పారేయ్. రేప్పొద్దున్న అందర్నీ వరసబెట్టి కాల్చి పారేస్తాను.”

గలగలా నవ్విందామె. “అదేం వొద్దులే. ఇలాగే రాస్తూ పాడుతూ వుంటాను. ఎవరైనా ఒక మంచి గాయకుడో, మ్యూజిక కంపెనీనో నా పాటలొకటి రెండు కొనుక్కుని బయట ఎక్కడేనా పాడి వాటిని పాప్యులర్ చేస్తే చాలు. ఇహ నాకడ్డే వుండదు.”

“అలా అయితే చాలా సంతోషం. అంత వరకూ నీకెప్పుడు దిగులుగా అనిపించినా పైన నా గదిలోకొచ్చి ఒక కప్పు కాఫీ తాగి వెళ్ళు, సరేనా? లేదా అదిగో ఆ మూలనుంది చూడు పెద్ద కఱ్ఱ, దానితో నీ సీలింగు మీద నాలుగు బాదు. వచ్చి నీ గోడు వింటా, సరేనా?” స్నేహపూర్వకంగా అన్నాడు.

“ఆ మాటనేముందు బాగా ఆలోచించుకో! మళ్ళీ బాధ పడతావేమో!” అల్లరిగా అంది శ్రీదేవి.

“అదెప్పటికీ కాదు. బూట్ల చప్పుడయ్యే గది తలుపులు నీకోసం ఎప్పుడూ తెరిచే వుంటాయి.”

“బూట్ల చప్పుడా? ఎక్కడ? ఎప్పుడు? నేను వినలేదే!”

“ఆ చెయ్యి ఇటిస్తావా కొంచెం? ఒకసారి కళ్ళకద్దుకుంటాను.”

**************

ఒక రోజు తన విద్యార్థులతో మరీ విసుగెత్తి జీవితో కబుర్లు చెప్పుకోవడానికి పైకెళ్ళింది శ్రీదేవి.

అక్కడ ఈసెల్ ముందు గంభీరంగా నిలబడి వున్నాడు మోహన్. చేతులు కట్టుకుని జీవి వేసిన బొమ్మ వైపు సుదీర్ఘంగా చూస్తున్నాడు. అతన్ని చూస్తేనే చిరాకు శ్రీదేవికి. అందరికంటే తనేదో మేధావిననుకునే అతని అహంభావం, మిగతా వాళ్ళందర్నీ చిన్న చూపు చూసే అతని అతి తెలివీ, ఏది చూసినా చిరాకే ఆమెకి.

“బాగున్నావా అమ్మాయ్?”

“ఎవర్రా నీకు అమ్మాయ్? శ్రీదేవీ, అని మర్యాదగా పిలవలేవూ? చవట!” మనసులో తిట్టుకుంటూ పైకి మర్యాదగా నవ్వింది.

“రా, రా శ్రీదేవీ! మోహన్ గారు నన్నూ, నా బొమ్మనీ చీల్చి చెండాడుతున్నారు. రాకపోయి వుంటే నా మర్డరు మిస్సయివుండేవారు.” జీవి ధోరణిలో మార్పేమీ లేదు.

“అలా ఉడుక్కోకోయ్ జీవీ! నేను కేవలం ఈ బొమ్మలో వున్న లోపాలు ఎత్తి చూపుతున్నానంతే. నా మాటలు నిన్ను నొప్పిస్తే దానికి నేను బాధ్యుణ్ణి కాను,” దర్పంగా అన్నాడు మోహన్.

“అయ్యయ్యో! మీరు చెప్పేది నా మంచికేనని నాకు బాగా తెలుసండి. మీరు కానివ్వండి.”

అలానే కానిచ్చేడు మోహన్. “ఒక్క మాటలో చెప్పాలంటే, ఈ బొమ్మలో అసలు జీవం లేదు. ఆ పిల్లిలో కానీ, ఈ పిల్లలో కానీ, ఎక్కడైనా జీవకళ వుందా చెప్పు?” మాట్లాడుతూనే ఒకడుగు వెనక్కి వేశాడు. చేతుల్ని ఫ్రేములా వుంచి దాన్లోంచి ఆ చిత్రాన్ని చూస్తూ,

“ఆ పిల్లి! ఊ... ఆ పిల్లీ – ఆ... ఏం చెప్పమంటావు ఆ పిల్లి గురించి? దాన్లో అసలు...”

“నాకా పిల్లి చాలా నచ్చింది! భలే ముద్దుగా వుందా బుజ్జి కూన.” వున్నట్టుండి అంది శ్రీదేవి.

ఎప్పుడూ ఆమె ముక్కు మీద వుండే కోపం మెల్లిగా కళ్ళల్లోకి ఎక్కుతోంది. మోహన్ చెత్త వ్యాఖ్యల్ని అంత సరదాగా నవ్వుతూ తీసుకుంటున్న జీవిని చూసినా ఆమెకి కోపంగా వుంది.

“ఏమైతే యేం? మీరిద్దరూ అది పిల్లి అని గుర్తుపట్టటమే నాకన్నిటికన్నా నచ్చింది,” ఎప్పట్లానే తనదైన చిరునవ్వుతో అన్నాడు జీవి.

“నాకు తెల్సు జీవీ! నా విమర్శతో నువ్వు చాలా నిరుత్సాహపడుతున్నట్టున్నావు! నీ బొమ్మ మరీ అంత చెత్తగా ఏం లేదు లేవోయ్! ఇంకొంచెం కష్టపడితే ఎప్పటికైనా నువ్వూ మంచి బొమ్మలు వేయగలవు!”

శ్రీదేవి కళ్ళల్లోకి ఒక ప్రమాదకరమైన మెరుపు వచ్చింది. ఇహ వీడ్ని వదిలేది లేదనుకుంది. చాలా మెత్తగా నవ్వుతూ, “అవును జీవీ! మోహన్ గారు ఎంతో కష్టపడి ఇంత పైకొచ్చారు. ఆయన బొమ్మలు నువ్వు చూసే వుంటావు!”

“నేనా? మోహన్ గారి బొమ్మలా? చూడలేదే!”

“చూడకపోవటమేమిటి? పత్రికల్లో అన్నీ ఆయన వేసిన బొమ్మలే కదా!” శ్రీదేవి ఇంకా మెత్తగా నవ్వుతూనే వుంది.

మోహన్ వంక ఆరాధనగా చూశాడు జీవి. అయితే ఎందుకో మరి మోహన్ మొహం ఎర్రబడి వుంది, ఇబ్బందిగా. దాన్ని ఆయనకి సహజంగా వుండే వినయంగా అర్థం చేసుకున్నాడు జీవి.

"పత్రికల్లో ప్రకటనల పేజీలుంటాయి చూడు. ఆ బొమ్మలన్నీ ఆయనవే. ఆ బూట్ల కంపెనీ ప్రకటనలో బూట్లూ, ఫర్నీచర్ కొట్టు ప్రకటనలో సోఫా సెట్టూ ఎవరు వేశారనుకున్నావు? మోహన్ గారే! స్టిల్ లైఫ్ బొమ్మలు భలే వేస్తారులే!" చురకత్తిలాటి నవ్వుతో నిర్దాక్షిణ్యంగా చెప్తోంది శ్రీదేవి.

మోహన్ మొహం మాడి పోయింది. ఒకలాటి భయంకరమైన నిశ్శబ్దం అలముకుంది గదిలో. జీవి ఉత్కంఠతతో చూస్తున్నాడు, ఈ వాగ్యుద్ధంలో గెలుపెవరిదా, అని!

ఆఖరికి మోహన్ తేరుకున్నాడు. కోపం గొంతు నిండా పొంగి పొర్లుతూండగా, "అమ్మాయ్! నేను డబ్బు కోసం వేసే కొన్ని మామూలు చిత్రాలే చూసినట్టున్నావు. నేను అవే కాక కళాత్మకమైన బొమ్మలు బోలెడు వేశాను."

"అవునా? అవెవరు కొన్నారబ్బా? ఆ... గుర్తొచ్చింది! ఎనిమిది నెలల కింద ఒక బొమ్మ వంద రూపాయలిచ్చి ఎవరో కొన్నట్టున్నారు, కదూ! అంతకు ముందర, దాదాపు సంవత్సరం క్రితం ఒక చిత్రం ఇంకెవరో..."

ఆమె మాట మధ్యలోనే మోహన్ కోపంగా లేచి వెళ్ళిపోయాడు. జీవికి అతన్ని చూస్తే జాలేసింది.

"ఆ మనిషిని మరీ అంతగా చావగొట్టాలా! పెద్దాయన, ఏదో అన్నాడే అనుకో!"

ఉన్నట్టుండి ఆమె కళ్ళల్లో నీళ్ళు చూసి జేబులోంచి రుమాలు తీసి ఇచ్చాడు. "ఏమయింది? ఊరికే నవ్వులాటకన్నాను, అంతదానికే ఇంతలా ఏడవాలా.."

"ఛీ! నా అంత నీచురాలు ఎవరైనా వుంటారా?"

"అంతదానికేనా? చాల్లే!"

"మనందరవీ ఒక్క లాటి కష్టాలే కదా? నేను నా పాటలు ఎవరూ కొనక ఎలా బాధ పడుతున్నానో, అతనూ తన బొమ్మలు అమ్ముడవక అలాగే బాధ పడుతున్నాడు కదా? అతన్ని అవమానించే హక్కు నాకెక్కడిది?"

వెక్కిళ్ళు పెడుతూంది శ్రీదేవి. కొంచెం సేపటికి తేరుకుంది. మొహం తుడుచుకొని జీవి వైపు చూసి సన్నగా నవ్వింది.

"సారీ! ఊరికే వచ్చి నీ మూడ్ పాడు చేశాను కదూ! నాకంటే అసహ్యమైన జంతువుంటుందా?"

"వుంది! ఇదిగో, నా బొమ్మలో ఈ పిల్లి! ఇందాక మోహన్ కూడా అదే మాటన్నారు కదా? అది సరే, నాకొక విషయం అర్థం కావడం లేదు."

"ఏమిటి?"

"నేనింకా మోహన్ గారు చేయి తిరిగిన కళాకారులనీ, జనమంతా ఆయన గీసిన చిత్రాలు కొనడానికి బారులు తీరి నిలబడ్డారనీ అనుకున్నాను. అందుకే ఆయన ఇక్కడికొచ్చి నా బొమ్మని చెడామడా తిడుతూంటే, అంతటి మేధావి నా బొమ్మ గురించి అభిప్రాయం చెప్పటమే నా అదృష్టమని మురిసిపోయాను కూడా! మరి నువ్వేమో..."

"అదేం లేదు, పాపం. అతనూ మన గూటి పక్షే. ఒక్కరూ తన చిత్రాలు కొనక, ఇలా ప్రకటనల కోసం బొమ్మలు గీసి డబ్బు సంపాదిస్తూంటాడు. నేనేమో అలాటి ఆయనని పట్టుకొని... నా పాపానికి నిష్కృతి లేదు," మళ్ళీ గొల్లుమంది శ్రీదేవి.

"మళ్ళీ మొదలు పెట్టొద్దు, ప్లీజ్!"

శ్రీదేవి లేచింది. “వెళ్ళి క్షమాపణలైనా చెప్తాను. అతనంటే నాకేమాత్రం ఇష్టం వుండదనుకో. అయినా నేను చేసింది తప్పేగా? తప్పదు మరి! వస్తా.” బయటికెళ్ళింది.

సి.జీవి లేచి సిగరెట్టు ముట్టించాడు. కిటికీలోంచి బయటికి చూస్తూ దీర్ఘాలోచనలో పడ్డాడు.

జీవితంలో వీలైనంతవరకూ క్షమాపణలు చెప్పకుండా ఉండడానికే ప్రయత్నించాలి. ఎప్పుడైనా విధిలేక చెప్పాల్సి వస్తే, అందుకు అర్హులైన వారికే చెప్పాలి. ఏదో పొరపాటు చేసాం కదా అని ఎవరికి పడితే వారికి చెప్పకూడదు! అందులో మోహన్ లాటి వారికి అసలే చెప్పకూడదు. అలాటి వారికి క్షమాపణ చెప్తే, పెద్ద మనసుతో హుందాగా క్షమించేయకుండా, చిన్న పొరపాటుని పదే పదే ఎత్తి చూపి, పుండు మీద కారం జల్లినట్టు మాట్లాడి, ‘ఇతనికి క్షమాపణ చెప్పటం కాకుండా, చెంప పగలగొట్టాల్సిందేమో,’ అని అనుకునే పరిస్థితికి మనల్ని దిగజారుస్తారు.

ఇప్పుడూ అదే జరిగింది. ఈ పొరపాటు వల్ల ఇహ ముందు తనేం మాట్లాడినా, ఏం చేసినా శ్రీదేవి నోరెత్తకుండా పడుండాల్సిందే తప్ప, నోరెత్తకూడదని అన్యాపదేశంగా ఆమెకి సూచించి పంపేశాడు. మళ్ళీ ఎప్పట్లాగే జీవి గదికి పోవడాలూ, అడగకున్నా సలహాలు ఇచ్చేయడాలూ యథేచ్ఛగా సాగుతున్నాయి. జీవి పద్ధతి మాత్రం ఏమీ మారలేదు. ఎప్పట్లాగే, చిరునవ్వుతో అతను మోహన్ తన బొమ్మలమీద చేసే వ్యాఖ్యానాలని స్వీకరిస్తున్నాడు. అతనితో ఏకీభవిస్తున్నాడు కూడా. అతని స్థితప్రజ్ఞత చూస్తున్నకొద్దీ శ్రీదేవికి అతను ఇంకా నచ్చుతున్నాడు.

ఈ మధ్య మోహన్ ఉపన్యాసాల్లో దర్పం పెరిగింది. ఎందుకంటే, ఇన్ని సంవత్సరాల తర్వాత అతని చిత్రాలు అమ్ముడవుతున్నాయి. రెండు వారాల్లో మూడు బొమ్మలు అమ్ముడు పోయేసరికి అతని ఏజెంటు కూడ ఆశ్చర్యం పట్టలేకపోయాడు. సూర్యరశ్మికి కమలాలు విచ్చుకున్నట్టు, ఈ శుభ పరిణామాలతో అతనిలోని విమర్శకుడు విచ్చుకున్నాడు. ఈ మధ్యనే

ఒక డబ్బున్న మారాజు తన బొమ్మని రెండువేలకి కొన్నాడని తెలియగానే, మోహన్‌కి డబ్బున్న వాళ్ళ మీద ఇదివరకున్న అభిప్రాయాలు సమూలంగా తుడిచిపెట్టుకు పోయాయి.

“నాకైతే ఇది డబ్బున్న వాళ్ళల్లో కళల గురించి సరైన అవగాహన పెరుగుతున్న శుభోదయానికి నాందిలా అనిపిస్తుంది,” అని ప్రకటించాడు, శ్రీదేవి, జీవిల ముందర, గంభీరంగా!

జీవి కూడా మొత్తానికి పిల్లి-పిల్ల చిత్రాన్ని పూర్తి చేసి ఒక పెద్ద గాలరీలో ఇచ్చాడు, దీంతో మీ ఇష్టం వచ్చినట్టు చేసుకోండని. మోహన్ రికమెండేష లెటర్ రాసిచ్చాడు కదా! అందుకని వాళ్ళూ తీసుకున్నారు. తన బొమ్మలు బాగనే అమ్ముడవుతూండడంతో మోహన్ ప్రకటనలకి వేసే బొమ్మలు తగ్గించుకున్నాడు. దాంతో తీరిక చిక్కి జీవి గదిలో ఎక్కువగా ఉపన్యాసాలు ఇవ్వసాగాడు.

“నీ బొమ్మని కూడ ఎవరైనా కొంటే కానీ ఆయన నోటికి తాళం పడదు.” వాపోయింది జీవి దగ్గర శ్రీదేవి.

“నా పనైతే నేను చేశానుగా! ఆ సంగతొదిలేయ్. అది సరే కానీ, నువ్వు ఆ మధ్య రాసిన పాటేమైంది?”

“అదా! అమీన్-సయానీ అనే మ్యూజిక్ కంపెనీ తీసుకుందిలే!” నిర్లిప్తంగా అంది శ్రీదేవి.

“మరి అలా మొహం వేలాడేసుకున్నావెందుకు? ఇహ చూడు నీ పాట ఢంకా బజాయించేస్తుంది.”

“కానీ కిందటిసారి సయానీని కలిసినప్పుడు ఏమంత ఉత్సాహంగా లేడు.”

“ఆ సయానీదంతా ఆంజనేయుడి తంతు. తన గొప్ప తనకే తెలిసి చావదు! కొంచెం టైమివ్వు ఆయనకి!”

“కొంచెమేం ఖర్మ, ఎక్కువే తీసుకోమను. పాట నలుగురి నోళ్ళలో నానితే చాలు.”

ఆశ్చర్యకరంగా ఆ పాట హిట్టయింది! ఆ రికార్డు ఎక్కువగా అమ్ముడవడమే కాక, సయానీకి ఆ పాట కోసమే ఎక్కళ్ళేనన్ని ఫోన్ కాల్సూ, అభినందనలూ అందసాగేయి. శ్రీదేవి డబ్బు ఇబ్బందులూ మాయమైపోయాయి. ఈ సంతోషంలో జీవి చిత్రం కూడా ఎవరైనా కొంటే బాగుండని ఎంతో ఆశ పడింది శ్రీదేవి. ఆ చిత్రం అమ్ముడు పోకపోగా, మోహన్ ఉపన్యాసాలూ, విమర్శలూ, సలహాలూ భరించలేని స్థాయికి చేరుకున్నాయి. ఇప్పుడు జీవి గదిలో మోహన్ అలికిడి వినిపిస్తే కిందికి జారుకుంటుంది శ్రీదేవి.

****************

ఒకరోజు మధ్యాహ్నం శ్రీదేవి గదిలో పని చూసుకొంటోంది. ఉన్నట్టుండి వరండాలో పబ్లిక్ ఫోన్ మోగిన చప్పుడు. అన్ని అపార్ట్‌మెంట్లకీ అదొక్కటే దిక్కు. అది ఇంకా మోగుతూనే వుంది. పాపం, ఏదైనా ముఖ్యమైన పనేమో.

“హల్లో! జీవి గారున్నారా?” అడిగిందొక బొంగురు గొంతు.

“లేరండీ! బయటికెళ్ళినట్టున్నారు. ఏదైనా మెసేజీ ఇస్తే ఆయనకిస్తాను.”

“అవునాండీ! పాండు ఫోన్ చేశాడని చెప్పండి. రోజూ పోస్ట్‌లో వస్తున్న ఆ కేసెట్లని ఏం చెయ్యమంటారని అడుగుతున్నానని కొంచెం చెప్పండి, ప్లీజ్!”

“కేసెట్లా?”

పాపం పాండు గారికి తన బాధ పంచుకోవటానికి ఎవరైనా పర్వాలేదు లాగుంది. ఆయన గోడు వింటే చాలు! అందుకే ఆగకుండా చెప్పుకుపోయాడు. "అవునండీ కేసెట్లు! పాటలు వింటాం చూడండి, రికార్డెడ్ కేసెట్లు అవి! ఒక్కటే పాటల కేసెట్టు వందల్లో కొన్నాడు. పోయిన నెలలో పోస్టులో పెద్ద పెద్ద పెయింటింగులు వచ్చాయి. నాలుగో ఐదో! ఎంత ఛండాలంగా వున్నాయనుకున్నారు? పగలు చూస్తే రాత్రి పీడకలలొస్తాయి! ఇంటి నిండా దిష్టి బొమ్మల్లా, ఇదేంటయ్యా మగడా అంటే, అవో గదిలో పడెయ్యవోయ్, నువ్వేం వాటి వంక చూడకూ అన్నాడు. సరేలే అని ఊర్కుంటే ఇప్పుడీ కేసెట్లు! అడుగెయ్యడానికి చోటు లేదు ఇంట్లో. నన్ను ప్రశాంతంగా రాసుకోనీకుండా ఏమిటండీ ఇది!"

పాండు కనక శ్రీదేవి మొహంలో మారుతున్న రంగులు చూసి వుంటే వెంటనే మాటలు ఆపేవాడే. కానీ చూడలేడు. కడుపులో వున్నదంతా కక్కేశాడు పాండు ఫోన్లో!

"పాటల కేసెట్టు ఏ కంపెనీది?"

"అదే నండీ, ఏదో తురక పేరు, ఈదీ అమీన్ లాటిది"

"అమీన్ సయానీ?"

"ఆ... అద్దీ! సరిగ్గా చెప్పారు. మరి ఆయనకి చెప్తారు కదా?..."

శ్రీదేవి ఫోన్ పెట్టేసింది.

గంటయింతర్వాత జీవి కూనిరాగం తీస్తూ మెట్లెక్కుతున్నాడు.

"ఒక సారిలా వస్తారా?" శ్రీదేవి గుమ్మంలోనించి పిలిచింది.

"తప్పకుండా! ఏమిటి సంగతి? మీ కాసెట్లు ఇంకా అమ్ముడవుతున్నాయా?"

"ఏమో, ఇంకా తెలియదు చిరంజీవి గారూ!"

ఒక్క క్షణం తడబడ్డాడు జీవి. అంతలోనే తేరుకున్నాడు.

"ఓ, నా పేరు తెలిసిపోయిందన్నమాట."

"పేరే ఏం ఖర్మ, ఊరూ, ఉద్యోగం, మొత్తం మీ జాతకమే తెలుసుకున్నాను."

ఏమనాలో తోచలేదు జీవికి.

"మీ పేరు చిరంజీవి. విశాఖపట్నంలోని కోటీశ్వరులలో మీరొకరు."

"అది నా తప్పు కాదు! అది వంశపారంపర్యమైన జబ్బు. మా నాన్నా, మా తాతా, అంతా కోటీశ్వరులే. కోట్లు సంపాదించడం వాళ్ళ హాబీ!" సీరియస్ గానే అన్నాడు.

"అవును! ఆ కోట్లు ఉపయోగించి మాలాటి అమాయకులని మభ్య పెట్టడం మీ హాబీ కావొచ్చు!"

మళ్ళీ ఏమనాలో తోచలేదు జీవికి. శ్రీదేవే మళ్ళీ అందుకుంది, అతని మొహంలోకి సూటిగా చూస్తూ.

"అవునా కాదా? డబ్బుంది కదా అని మా లాటి తెలివి తక్కువ వాళ్ళకి జాలిగా బిస్కత్తులు పడేస్తూ వుంటారన్నమాట. పాపం, మోహన్, తన బొమ్మలు నిజంగానే ఎవరికో నచ్చి కొనుక్కుంటున్నారనుకొని సంబరపడుతున్నాడు. ఎప్పటికైనా నిజం తెలిస్తే ఆయన అసలు బొమ్మలు గీయగలరా? విసుగొచ్చి మీరు బొమ్మలు కొనడం మానేసినప్పుడు..."

తేలిగ్గా నిట్టూర్చాడు జీవి. “ఓస్! అదీ ఒక సమస్యేనా? ఆయన ఎన్ని బొమ్మలు వేస్తే అన్ని నేనే కొంటాను. ఆయనకసలు నిజం తెలిసే పరిస్థితే రాదు. ఆయన భవిష్యత్తుకేమీ ఢోకా లేదు.”

“ఓహో! అలాగా? మరి నా భవిష్యత్తు కూడా ప్లాన్ చేశారా?” వెటకారంగా అంది శ్రీదేవి.

“నీ భవిష్యత్తా? అదెలాగూ నా చేతిలోనే వుంది. ఎందుకంటే నువ్వు నన్నే పెళ్ళాడతావు గనక.”

శ్రీదేవి నిర్ఘాంతపోయింది.

“నిన్నా? నేనా? పెళ్ళా? నీ గురించి ఇంత తెలిశాకా?”

“నీ అభ్యంతరం ఏంటో నాకు బాగా తెలుసు. పెళ్ళాడితే మన ఇంటి నిండా మోహన్ గీసిన బొమ్మలుంటాయనే కదా? నేనా విషయం ఎప్పుడో ఆలోచించాను. అవన్నీ అటక మీద దాచేద్దాం. నర మానవుడికెవ్వరికీ ఆ బొమ్మలు చూసే అగత్యం పట్టదు!”

శ్రీదేవి గొంతు పెగల్చుకుని ఏదో చెప్పబోయింది. ఆమెని ఆపేడు జీవి.

“ఆగు! నేను నీతో ఎప్పట్నించో నా జీవిత చరిత్ర చెప్పాలని అనుకుంటూన్నను. నాకసలు నా జీవిత చరిత్ర చెప్పడమంటే చచ్చేంత ఇష్టం. వినేవాళ్ళకంత ఇష్టం వుండదు కానీ!”

“నీ బోడి జీవిత చరిత్ర మీద నాకేం ఇంట్రస్టూ లేదు.”

“వినకుండానే ఇంట్రస్టు లేదంటే ఎలా? అసలెన్ని మలుపులూ, హ్యూమన్ ఎలిమెంట్సూ వున్నాయో తెల్సా నా జీవిత చరిత్రలో? నేను పుట్టింతర్వాత ఇరవై యెనిమిదేళ్ళ జీవితం గురించి వదిలేద్దాం. అదుత్త బోరు! కానీ, సరిగ్గా నెలా పది రోజుల కింద ఆఫీసు పని మీద ఈ

ఊరొచ్చిన నేను టాక్సీలో వెడుతూ, పక్క సందులో బస్సు దిగి ఇటు నడుస్తూంటే నిన్ను చూశాను."

"ప్లీజ్! నాకు వినాలని లేదు."

"ఇక్కణ్ణించే నా జీవితంలోకి యాక్షనూ, రొమాన్సూ, అన్నీ ప్రవేశించాయి. ఆ సంగతి అప్పుడే గ్రహించాను కాబట్టి టాక్సీ దిగి నీతో మాట్లాడదామని ఇటొచ్చాను. నువ్వు ఈ చిన్న అపార్ట్‌మెంట్ బిల్డింగులోకి వచ్చావు. ఎలాగబ్బా నిన్ను పలకరించడం అని అనుకుంటూంటే పైన "ఇల్లు అద్దెకివ్వబడును" అని బోర్డు కనబడింది. ఎన్నాళ్ళనించో ఒక ఆరునెలలు సెలవు పెట్టి బొమ్మలు వేయాలన్న కోరికా ఇలా తీర్చుకోవచ్చని, ఆఫీసుకి సెలవు పెట్టి పైభాగంలో అద్దెకి దిగాను!" ఊపిరి పీల్చుకోవడానికి ఆగాడు జీవి.

"ఎలాగైనా నిన్ను పైకి రప్పించాలని అలా బూట్లతో నేలమీద తాళం వేశానన్నమాట! ఎంతైన నా తెలివే తెలివి. అది సరే కానీ, నా గురించి నీకెలా తెలిసింది?"

"మీ స్నేహితుడు పాండు ఫోన్ చేశాడు."

"వాడా! కథలు రాసుకోవడానికి ప్రశాంతమైన చోటు లేదు బ్రదర్ అంటే నేనే నాతో పాటు ఇల్లు షేర్ చేసుకోమన్నా! అసలు రచయితలు భలే సున్నితంగా..."

"చిరంజీవి గారూ!'

"నన్ను జీవి అనే పిలవొచ్చు! అసలు శివ ప్రసాద్ అనే మారు పేరు పెట్టుకుందామనుకున్నా కానీ....."

"మీ ఉద్దేశ్యాలు మంచివే అయివుండొచ్చు. అయినా మీరు చేసిన పని హేయమైనది, మమ్మల్నెంతో అవమానిస్తున్నారు..."

జేబులో చేయి పెట్టి దేనికోసమో వెతుకుతున్నాడు జీవి. ఒక చిన్న ఉత్తరం తీశాడు.

“ఈ ఉత్తరం చదువుతాను, కొంచెం వింటావా?”

“మీ ఉత్తరాల మీద నాకేం ఇంట్రస్టూ....”

“చిన్నదేలే! విను మరి. నేను నా ‘పిల్లి-పిల్ల’ బొమ్మ ఇచ్చాను చూడు ఆ ఏజెంటు దగ్గర్నించన్నమాట. ‘జీవీ, నీ పిల్లి-పిల్ల బొమ్మ కొనాలనని ఒక కస్టమరు ఐదువేల రూపాయలు చెల్లించారు. బొమ్మ ఇచ్చేస్తాను. నీకేమైనా అభ్యంతరమా?” ఉత్తరం మడిచి జేబులో పెట్టుకున్నాడు జీవి. తలొంచుకుంది శ్రీదేవి.

“అయితే?” బింకంగా అంది.

“ఇప్పుడే ఏజెంటు దగ్గరికెళ్ళొస్తున్నా. ఆ పిల్లిని కొనే కస్టమరు ఎవరా అని కొంచెం ఆరా తీశాను. ఆ యిల్లు నీ దగ్గర సంగీతం నేర్చుకొనే అమ్మాయిదని తేలింది. ఆ అమ్మాయినడిగితే నువ్వే కొనమన్నావని కూడా చెప్పింది.”

శ్రీదేవి దించిన తల యెత్తలేదు. ఆమె దగ్గరకెళ్ళి నిలబడ్డాడు జీవి.

“వెళ్ళిక్కణ్ణించి!” శ్రీదేవి తల యెత్తకుండానే బలహీనంగా అంది.

“వెళ్ళను. నువ్వు ఒప్పుకునేదాకా ఇక్కడే వుంటాను.”

“ముందు వెళ్ళు. ఆలోచించుకుని చెప్తాను.”

చిరంజీవి మెల్లిగా గదిలోంచి బయటికి వెళ్ళి, మెట్లెక్కి తన గదిలోకి వెళ్ళాడు. గదిలో ఆగకుండా పచార్లు చేస్తున్నట్టున్నాడు, బూట్ల చప్పుడు వినిపిస్తూంది.

శ్రీదేవి లేచింది. బట్టలారేయడానికి తను వాడుకునే పొడుగాటి కర్ర తీసుకుని సీలింగ్ మీద మూడు సార్లు గట్టిగా పొడిచింది!

(ప్రేరణ : The Man Upstairs – P. G. Wodehouse)

*రచయిత పరిచయం : ఇంగ్లండుకి చెందిన ఆంగ్ల రచయిత పి.జి.వోడ్‌హవుజ్ హాస్య రస ప్రధాన రచనల్లో అగ్రగణ్యుడు. హాస్యం ప్రధానంగ చదివే పాఠకులకి అతను ఆరాధ్య దైవం అనడంలో అతిశయోక్తి లేదు. తొంభైకి పైగా నవలలూ, నలభైకి పైగా నాటికలూ, లెక్కలేనన్ని కథలూ రాసిన ఆయన శైలి అనితర సాధ్యం. వెకిలి మాటలూ, వ్యక్తిగతమైన వెక్కిరింతలూ లేకుండా, కేవలం సన్నివేశాలతో హాస్యాన్ని సృష్టిస్తూ ఆయన కలకాలం నిలిచే రచనలు చేసారు.*

# ఎడారి అంచున

(జులై 2015 ఈమాట)

( హెన్రీ లాసన్)

"ఇల్లొదిలి పెట్టి యెనిమిదేళ్ళకు పైగానే అయింది," అన్నాడు మిచెల్. మిచెల్, అతనితో ప్రయాణిస్తున్న స్నేహితుడూ అప్పటికే చెట్టు నీడకి చేరుకున్నారు. చేతిలో వున్న సంచులని కింద పడేసి తామూ కూలబడ్డారు.

"ఎనిమిదేళ్ళ పాటు ఒక్క ఉత్తరం కూడా రాయలేదు నేను. రాద్దామనుకుంటూనే బద్ధకంతో అలా రోజులు గడిపేశాను. దానికి తోడు, నాకంటే ఓ రోజు ముందే మా వూరు చేరుకున్న దరిద్రుడొకడు మా ఇంట్లో నేను చచ్చిపోయానని చెప్పాడట!"

మాటలాపి నీళ్ళ కేంటీన్ తీసి కొంచెం గొంతు తడుపుకున్నాడు.

"ఇక చూస్కో! నేనెళ్ళేసరికి ఇంటిల్లిపాదీ యేడుపులూ, పెడ బొబ్బలూ! అందులోనూ, నేనిల్లు చేరేసరికి సరిగ్గా రాత్రయింది. దాంతో ముందు దయ్యం అనుకుని జడుసుకున్నారు. తలుపు తెరిచిన మా చెల్లెలయితే భయంతో దాదాపు మూర్ఛ పోయింది." చెప్పటం ఆపి పైపు వెలిగించుకున్నాడు.

"నేనెళ్ళేసరికి, అమ్మ పైన గదిలో పడుకోని ఏడుస్తూ వుంది. చెల్లెళ్ళందరూ బిక్క మొహాలేసుకొని వున్నారు. నాన్నేమో కింద ఒక్కడే టేబిల్ దగ్గర కూర్చొని బెక్కుతున్నాడు."

మళ్ళీ మాటలాపి లేచి ఒళ్ళు విరుచుకున్నాడు మిచెల్. తన కుక్కపిల్లకి కొన్ని నీళ్ళు తాగించాడు.

"నేనొచ్చిన సంగతి తెలిసి అమ్మ ఒక్క గెంతుతో కిందకి దిగింది. అందరూ నన్ను ముట్టుకోడానికి పోటీలు పడ్డారు. దెయ్యాన్ని కాదని నిశ్చయించుకోడానికి కాబోలు! నా మీద పడి అంతా ముద్దులు కురిపించేసరికి ఊపిరాడలేదంటే నమ్ము! అది సరే కానీ, ఈ కుక్క పిల్లకెంత దాహమో చూడు! అసలు దీంతో పాటు ఒక నీళ్ళ టాంకరు తెచ్చుకోవాల్సింది మనం. ఈ ఎండలకిది ఇద్దరు మనుషుల నీళ్ళు తాగుతుంది."

కుక్కపిల్లకి ఇంకొన్ని నీళ్ళు తాగించాడు.

"ఏం చెప్తున్నానూ? అదే, అమ్మ నన్ను చూసి సంతోషం పట్టలేక మూర్ఛపోయింది. ఏం సంబరం ఇంట్లో! రాత్రంతా కబుర్లు చెప్పుకుంటూనే వున్నాం. నాన్నకైతే ఖాయంగా పిచ్చెక్కిందనుకున్నా. అమ్మేమో అసలు మూణ్ణాలుగు గంటలపాటు నా చేయి వదలనేలేదు. నీ చాకు ఒకసారివ్వు."

చాకు తీసుకొని పొగాకు కట్టలోంచి చిన్న ముక్క కోసుకున్నాడు.

"ఇహ ఆ మర్నాడు చూడాలి. ఇల్లంతా వచ్చే జనం, పోయే జనం, తిరణాలనుకో! చుట్టు పక్కల వాళ్ళంతా దిగబడ్డారు, నేను చిన్నప్పుడు ఇష్టపడ్డ అమ్మాయితో సహా! అసలా అమ్మాయికి నేనంటే ఇష్టమని అనుకోనేలేదు నేనెన్నడూ. అమ్మా, చెల్లెళ్ళూ మళ్ళీ నేనిల్లు వదిలి బయటికి వెళ్తానేమోనని తెగ భయపడ్డారు. ఎందుకంటే..."

"తాగొస్తావని భయం కాబోలు!"

"ఛ! ఛ! మళ్ళీ దేశం వదిలి వెళ్ళిపోతానేమోననోయ్! ఆఖరికి బైబిలు పట్టుకొని, అమ్మా నాన్నా వున్నంతవరకూ ఇల్లు వదిలిపోనని ఒట్టేసుకున్నాక గానీ వాళ్ళు తెరపిన పడలేదు."

చెప్పడం అయిపోయినట్టు లేచి నిలబడ్డాడు మిచెల్. కుక్కపిల్లనెత్తుకున్నాడు. కాసేపు దాని కాళ్ళు పరీక్షించాడు.

“వీడి కాళ్ళు చూడు, ఎంతెంత గాయాలైనాయో! పొద్దునంతా బానే నడిచాడు పాపం. ఇక్కణ్ణించి కొంత దూరం మోసుకెళ్తా వీణ్ణి. అప్పుడు వీడికింత దాహం కూడా వేయదు.”

“అది సరే, నువ్వు అమ్మా నాన్నలకిచ్చిన మాట యెందుకు తప్పుతున్నావ్?”

కుతూహలంగా అడిగాడు స్నేహితుడు. మిచెల్ కాసేపు జవాబివ్వలేదు. ఒళ్ళు విరుచుకున్నాడు. బరువైన సంచీ వైపు కాసేపూ, దూరంగా ఎర్రటి ఎండలో మిల మిలా మెరుస్తూ అనంతంగా కనిపిస్తున్న నీడలేని ఎడారి వైపూ చూశాడు. కాసేపు ఆలోచించాడు, ఆవలించాడు.

“అదా? ఓ వారం అందరూ అలాగే వున్నారు. ఆ తరవాత అందరూ సణగడం మొదలు పెట్టారు. పనీ పాటా లేని వాణ్ణెవరు పోషిస్తారు చెప్పు?” ఎటో చూస్తూ అన్నాడు.

స్నేహితుడు పగలబడి నవ్వాడు. మిచెల్‌కీ నవ్వాగలేదు. ఇద్దరూ తమ సంచీలు భుజాలకు తగిలించుకున్నారు. కెటిల్స్ చేతికెత్తుకున్నారు. మిచెల్ కుక్కపిల్లనీ ఎత్తుకున్నాడు. మాసిపోయిన గడ్డాలతో, ఎండలకి ఎర్రబడి మొరటుగా అయిన మొహాలతో, ఇద్దరూ చెట్టూచేమలని వెనకనే ఒదిలిపెట్టి ఎడారి వైపుగా ఎండ లోకి నడిచారు.

(మూలం:  On the edge of a plain -Henry Lawson.)

****************

రచయిత పరిచయం : (Henry Lawson, 1867-1922): హెన్రీ లాసన్ ఆస్ట్రేలియాకి చెందిన *పాత తరం రచయిత. బాంజో పాటర్సన్, హెన్రీ లాసన్ ఇద్దరూ ఆస్ట్రేలియాలో బ్రిటిష్ పాలన గురించీ, ఆస్ట్రేలియా పల్లెటూళ్ళలో యూరోపియన్ల బ్రతుకుల గురించీ వివరంగా, విస్తృతంగా రాసారని చెప్పొచ్చు. లాసన్ పేరున్న కథకుడే కాక, మంచి కవి కూడా. కథ వివరాలూ, వర్ణనలతో చిక్కగా వుండడంకంటే గల్పికలా (sketch) అందీ అందకుండా వుండాలని లాసన్ అభిప్రాయపడ్డాడు. బాంజో పాటర్సన్ ఆస్ట్రేలియాలోని Outback జీవితాన్ని అందంగా, రొమాంటిక్ సాహసంలా చిత్రీకరిస్తే, లాసన్ కుండ పగలేసినట్టు, యూరోపియన్లు తట్టుకోలేని ఎండ, ఎన్నడూ చూడని జంతువుల తాకిడి, ఎంతో శ్రమతో కూడిన కఠినమైన జీవితాన్నీ చిత్రించాడు. ఆయన కథలనిండా ఆస్ట్రేలియాలో స్థిరపడ్డ యూరోపియన్లు వాడే విచిత్రమైన ఆంగ్ల పదాలు నిండి వుంటాయి. ప్రతీ కథకీ వెనక ఈ పదాల అర్థం వివరించబడి వుంటుంది. ఇప్పుడు ఆస్ట్రేలియాలో వుంటూ, ఆ పదాలని రోజువారీ భాషలో వినేవాళ్ళకి, ఆయా కొత్తపదాలు అసలు ఇంగ్లీషులో వుండేవి కాదనీ, కేవలం వందేళ్ళ కిందవలస వచ్చిన యూరోపియన్ల వాడుకలో పుట్టినవనీ తెలుసుకుంటే కొంచెం విచిత్రంగా వుంటుంది.*

# కాపరి భార్య

(మే 2016 ఈమాట)

( హెన్రీ లాసన్ )

రెండు గదుల ఆ ఇల్లంతా కలప దుంగలతో కట్టిందే. గచ్చురాళ్ళు పరిచిన నేల పగిలిపోయి బీటలు వారింది, ఆ గదుల వెనక ఒక పెద్ద వంటిల్లూ, ముందు చావడీ వున్నాయి.

చుట్టంతా దట్టమైన పొదలు. అరచేయిలా, ఎత్తు పల్లాలేవీ లేకుండా, నిర్భావంగా వుంది. అడవన్న పేరే కానీ, అక్కడ పచ్చదనం అతి తక్కువ. కొన్ని గిడచబారిన ఆపిల్ చెట్లూ, ఇంకొన్ని సరుగు చెట్లూ, దాదాపు ఎండిపోయిన చిన్న వాగూ! వూరు పంతొమ్మిది మైళ్ళ దూరం!

కాపరి గొర్రెలతో అడివిలోకెళ్ళి చాలా రోజులే అయింది. ఇంట్లో అతని భార్యా, పిల్లలు మాత్రం వున్నారు. నలుగురు పిల్లలు, చిరిగిన బట్టలతో, ఎండిపోయిన దేహాలతో ఇంటి బయట ఆడుకుంటున్నారు.

“అమ్మా! పాము, పామొచ్చింది!” వున్నట్టుండి, పిల్లలు గొల్లుమని అరిచారు. వాళ్ళ అమ్మ ఒక్క పరుగున వంటింట్లోంచి బయటికొచ్చింది. బక్కగా, ఎండకు కమిలిపోయిన శరీరంతో ఉంది ఆమె.

“ఎక్కడ? ఎక్కడుంది పాము?” పరిగెత్తుకొని వస్తూనే, నేల మీద పడున్న చంటి వాణ్ణి చంకనేసుకుంది, ముందు. పిల్లలని అడుగుతూనే రెండో చేతితో కర్ర పట్టుకుంది.

“అదిగో! ఆ కట్టెల మోపులోకెళ్ళింది.” అందర్లోకి పెద్దవాడు, పదకొండేళ్ళ టామ్ అరిచాడు. చురుకైన ముఖంతో తల్లి వంక చూశాడు. తనకంటే పొడుగైన కర్ర ఒకటి చేతిలో పట్టుకొచ్చాడు.

“నువ్వక్కడే వుండమ్మా! ఆ పాము పని నే పడతాగా!”

“టామ్! నువ్విటురా ముందు! అది కాటేస్తుంది. రమ్మనంగానే రా, వెధవా!” తల్లి కేకలకు వాడు చిన్నబోయిన మొహంతో పక్కకొచ్చి నిలబడ్డాడు. అంతలోకే వాడి కళ్ళు మెరిశాయి. కట్టెల మోపు నుండి పాకి ఇంటికిందకు దూరుతున్న పామును చూపించాడు. గోడల పగుళ్ళనుంచి ఇంటికిందకు కలుగులున్నాయి.

“అదిగో అమ్మా, పాము!” కర్ర ఎత్తి పాము మీద దెబ్బ వేయబోయాడు. ఇంతలో వాళ్ళ పెంపుడు కుక్క జరుగుతున్న గందరగోళమేమిటో చూడడానికి వొచ్చింది. పాముతోకను అది ఒడిసి పట్టుకునేంతలో అది మాయమైపోయింది. సరిగ్గా అప్పుడే టామ్ వేసిన కర్ర పోటు కుక్క మొహం మీద పడింది. అది పట్టించుకోకుండా గుర్ గుర్ మంటూ అక్కడే నిలబడింది పాము వెళ్ళినవైపు చూస్తూ. కాపరి భార్య వెళ్ళి కుక్కను కట్టేసి వచ్చింది. దాని పేరు మొసలి. పేరుకు తగ్గట్టే దాని ముఖం మొసలి ముఖంలా ఉంటుంది. పాములనుంచీ, పాముల్లాంటి మనుషుల నుంచీ అదే తనకు దిక్కు.అది ఎట్లైనా తప్పిపోతే ఇంకా కష్టం మరి. పిల్లలందరినీ కూడ గట్టి వాళ్ళని కుక్క పక్కన నిలబెట్టి తను పామును పట్టుకునే ప్రయత్నంలో పడింది. చిన్న గిన్నెలో పాలు పోసి తెచ్చి కలుగు పక్కన పెట్టి పాము కోసం ఎదురు చూస్తూ కూర్చుందామె. గంట గడిచినా పాము బయటికొచ్చిన జాడే లేదు.

సాయంకాలం అవుతుండడంతో చిన్నగా చీకట్లు కమ్ముకుంటున్నాయి. రాత్రికి పెద్ద వర్షం వొచ్చేలాగుంది. పిల్లలని అలా ఎంత సేపని బయటే వుంచడం. పోనీ లోపలికి తీసికెళ్దామంటే పాము లోపలే వుందేమో! పైగా గచ్చులో అక్కడక్కడా నెర్రెలు పడి వున్నాయి. గోడ పగుళ్ళ కలుగుల్లోంచి పాము బయటికొస్తే!

కాసేపటి తరవాత ఏదో ఆలోచించుకొని, కట్టెల మోపులోంచి కొన్ని కట్టెలు తీసుకొని వంటింట్లో పొయ్యిలో పడేసింది. తరవాత పిల్లలందరినీ ఇంట్లోకి తీసికెళ్ళింది. వంటింట్లో గచ్చు లేదు. బురదతో అలికిన నేల మీద, చెక్కపేడు కాళ్ళతో మొరటుగా చేసిన ఒక పెద్ద బల్ల

తప్ప ఇంకే సామానూ లేదు. ఆ బల్ల పైకి వాళ్ళందరినీ ఒకళ్ళ తరవాత ఒకళ్ళని ఎక్కించి కూర్చోబెట్టి వాళ్ళకి అక్కడే తిండి పెట్టింది. పాము ఎటునుంచి వస్తుందోనని వేయి కళ్ళతో కనిపెడుతూనే ముందు గది నుంచి చేతికందిన పక్క బట్టలు అందుకోని దడ దడ లాడే గుండెలతో వంటింట్లోంచి కొచ్చి పడింది. ఆ బల్ల మీదే దుప్పట్లు పరిచి పిల్లలని నిద్ర పుచ్చింది. పిల్లలు పడుకున్నరని నిర్ధారించుకొని ఇక పాము కోసం ఎదురు చూడసాగింది ఆమె.

పాము వున్న నెర్రెల వైపే చూస్తూ వంటింటి గుమ్మం దగ్గరే కుర్చీ వేసుకుని కూర్చున్నదామె. పక్కనే కర్ర, ఆమె కుట్టు పని సంచీ, ఒక పత్రిక పెట్టుకుంది. పక్కన కుక్కని కూర్చోబెట్టుకుంది. అమ్మని ఒంటరిగా పాముతో వదిలేసి పడుకోవడం టామ్ కసలే మాత్రమూ నచ్చలేదు.

“అమ్మా! రాత్రంతా నీతో పాటే కూర్చొని ఆ దరిద్రగొట్టు పాము తల పచ్చడి చేస్తాను!” శపథం చేశాడు.

“చాల్లే! నోరు మూసుకొని పడుకో! తిట్లు వాడదొద్దన్నానా? తల్లి కసిరింది. టామ్ ఒక దుడ్డుకర్రను పక్కలోనే పెట్టుకున్నాడు, పాముని చంపడానికి. అది తగిలి తమ్ముడు జాకీ ఫిర్యాదు చేశాడు.

“అమ్మా! టామ్ కర్ర నన్ను డొక్కలో పొడుస్తూంది. అది తీసి పడెయ్యమని వాడితో చెప్పూ!”

“జాకీ! నోరు మూసుకొని పడుకో రాస్కెల్, పాముతో కరిపించుకుంటావా?!” టామ్ బెదిరించాడు. జాకీ నోరు మూసుకున్నాడు.

“ఒరే జాకీ! పాము కరిచిందనుకో. నీ ఒళ్ళంత ఎర్రగా, నల్లగా అయిపోయి నువ్వు ఉబ్బిపోయి కంపుకొట్టి చచ్చిపోతావ్, తెలుసా!”

“అమ్మా, టామీ చూడు ఏమంటున్నాడో!”

“టామ్, చిన్నపిల్లవాడు. వాణ్ణి భయపెట్టకలా!”

సణుగుతూనే నిద్రలోకి జారిపోయాడు జాకీ. మెల్లిగా పిల్లలంతా నిద్రపోయారు, టామ్ తప్ప.

“అమ్మా, పామొస్తే నన్ను లేపుతావు కదూ?” నిద్రమత్తులో తూగుతూనే గొణిగాడు టామ్.

“అలాగేలే నువ్వు పడుకో!”

మధ్య రాత్రయింది. అంతటా చీకటి, చిక్కగా అలుముకున్న నిశ్శబ్దం. ఆమెకీ నిద్ర ఆగటం లేదు. అయినా కాసేపు కుట్టుకుంటూ, కాసేపు పత్రిక చదువుతూ, కట్టెల మోపు వైపే చూస్తోంది. చీమ చిటుక్కుమన్నా కర్ర మీదికి చేయి పోతుంది.

అనుకున్నట్టే ఉరుములు మెరుపులతో వర్షం మొదలైంది. గోడల నెర్రెల్లోంచి లోపలికొస్తున్న ఈదురు గాలికి కొవ్వొత్తి ఆరిపోయేలా వుంది. లేచి కొవ్వొత్తిని బల్ల పైన పెట్టి అట్ట ఒకటి అడ్డంగా పెట్టింది. మెరుపు మెరిసినప్పుడల్లా గోడల మీది నెర్రెలు వెండి తీగల్లా కనిపిస్తున్నాయి. కుక్క గుమ్మానికడ్డంగా సాగిలపడి పడుకోని వుంది. ఎంత ధైర్యం చెప్పుకున్నా ఆమెకి గుండె దడదడ లాడుతూనే వుంది. తను పిరికిది కాదు కానీ ఈమధ్యే పాము కాటుకి గురై చచ్చిపోయిన బావగారి కొడుకు జ్ఞాపకం ఆమెను భయపెడుతోంది. భర్త అడవిలోకెళ్ళి ఆరు నెలలు అయింది. ఒక్క కబురూ లేదు. ఇక వొచ్చేస్తే బాగుండనుకొంది. ఈమధ్యే వచ్చిన కరువుతో అంతా నష్టపోయారు. దానితో మళ్ళీ అడవిలోకి పోక తప్పలేదు. ఈ సారి పశువులతో వెనక్కి రాగానే ఈ అడవీ, పల్లే వొదిలేసి పట్నంలో కాపురం పెడతానన్నాడు. అక్కడికి కొంచెం దూరంలోనే వున్న బావగారు అప్పుడప్పుడూ ఒక గొర్రెను చంపి కొంత తను తీసుకుని అందుకు బదులుగా వీళ్ళకి కావల్సిన వెచ్చాలు తెచ్చిపెడుతుంటాడు.

ఆమెకీ ఒంటరితనం అలవాటే నిజానికి. ఇంతకు ముందొకసారి పద్దెనిమిది నెలలపాటు ఒక్కతే ఇంట్లో వుంది అతని కోసం ఎదురు చూస్తూ. ఆమెకి వున్నట్టుండి తన చిన్నతనం గుర్తొచ్చింది. అందరు ఆడపిల్లల్లానే తనూ ఎన్నో కలలు కన్నది, గాల్లో మేడలు కట్టుకుంది. అన్నీ కరిగిపోయి చాలా యేళ్లయింది. ముందున్న నిజాలని ఒప్పుకోనూ లేకా, వాట్నించి తప్పుకోనూ లేక, తనక్కావల్సిన ప్రపంచాన్ని అప్పుడప్పుడూ ఆసక్తిగా చదివే ఆ పత్రికల్లో వెతుక్కుంటుంది.

నిజానికామె భర్త చెడ్డవాడేమీ కాదు. కొంచెం నిర్లక్ష్యం వున్నా, ఆమెని ప్రేమించే మనిషే. ఆమె కోరుకున్నట్టే ఆమెని రాజకుమార్తెలా గారాబం చేయలనీ, మహారాణీలా చూసుకోవాలని ఆశలున్నవాడే. పరిస్థితులే కలిసి రావడంలేదు. ఈ పశువుల పనిలో పాపం, నెలలతరబడి అడవుల వెంట తిరుగుతాడు. జీత భత్యాలతో తిరిగొచ్చి పట్నం తీసికెళ్తాడు. అప్పుడప్పుడూ అతను అధైర్యపడినా, ఆమే అతనికి ధైర్యం చెప్పి పంపిస్తుంది. పిల్లలు పుట్టినప్పుడు మరీ దిగులుగా భయంగా వుండేది ఆమెకి. ఇద్దరు బిడ్డలు ఈ అడవిలోనే పుట్టారు తనకు. ఇలాటి ఒంటరితనంలోనే ఒక బిడ్డను పోగొట్టుకుంది. చేతిలో బిడ్డ శవాన్నెత్తుకొని ఒంటరిగా పంతొమ్మిది మైళ్ళు వెళ్ళింది ఆ రోజు!

ఒక పెద్ద మెరుపూ ఉరుముతో ఉన్నట్టుండి జడివాన మొదలయింది.

ఆలోచనల్లోనే రాత్రి గడుస్తోంది. ఝాము రెండయి వుంటుంది. మొసలి ఇంకా కళ్ళార్పకుండా పడుకొని గుమ్మం వైపే చూస్తోంది. వాడి వొంటి మీద గాయాలు చూస్తూ పాపం, వీడూ పెద్దయిపోయాడు, అనుకుందామె. వాడికి భయమనేదే లేదు. దేనికైనా ఎదురుపోతాడు. ఎన్నో పాములనూ చంపాడు. ఏదో ఒకరోజు పాముకాటుతోనే పోతాడు. ఇలాంటి కాపలా కుక్కల బతుకు అలాగే ముగుస్తుంది.

అప్పుడప్పుడూ చేతిలో పుస్తకం పక్కన పెట్టి ఆలోచనల్లోకి మళ్ళీ మళ్ళీ జారిపోతూ వుందామె. వర్షం ఇంకా కురుస్తూనే వుంది. ఈ వర్షానికి గడ్డి ఇంతెత్తున పెరుగుతుంది. ఎండలకి ఎండి పోతుంది. అప్పుడూ అగ్గి భయం.

ఒకసారిలాగే పెరిగి ఎండిపోయిన గడ్డి అంటుకుంది. ఆ అంటుకున్న అగ్గి ఆర్పేసరికి బ్రహ్మ ప్రళయమైపోయింది తనకి. ఆదరా బాదరా చేతికందిన భర్త పాంటూ షర్టూ వేసుకొని ఒక పెద్ద చెట్టు కొమ్మతో మంటల్ని బాదడం మొదలు పెట్టింది తనారోజు. మంటలు ఆరిపోయినై కానీ తన మొహమూ చేతులూ అంతా బూడిదా మసీ కలిసిపోయి ఒక విచిత్రమైన రంగులోకి తిరిగిపోయాయి. తండ్రి బట్టల్లో వున్న తనని చూసి టామ్ పక పకా నవ్వితే, నల్లబడ్డ తన మొహం చూసి చంటి వెధవ జాకీ కెవ్వుమన్నాడు. వాడి ఏడుపు చూసి కుక్క తన పాంటు పట్టుకుని లాగింది, అదీ తనను గుర్తుపట్టలేదు. పాత జ్ఞాపకాలతో ఆమె మొహం మీద నవ్వు విచ్చుకుంది.

ఒంటరితనంతోనూ, చుట్టూ ఉన్న క్రూరమైన అడవితోనూ ఎన్ని యుద్ధాలో! జబ్బు చేసి రెండు ఆవులు పోయినప్పుడూ, పైన బడుతున్న ఎద్దుని ఒంటరిగా ఎదురొన్నప్పుడూ, ఆఖరికి తమ కోడి పిల్లలని కాకుల నించీ గద్దల నించీ నిరంతరం కాపాడుకొటున్నప్పుడూ, ఇదే ఒంటరితనంతో పోరాటం చేస్తూ వచ్చింది తను. ఆ మాటకొస్తే, ఒంటరి ఆడదాని కోసం పొంచి వుండే మగవాళ్ళకి కొదవా?

కుక్క సాయంతోనూ, మొరటు మాటల సాయంతోనూ, అబద్ధాల సాయంతోనూ అలాటి మగవాళ్ళనుండి తనని తాను కాపాడుకొంటూ వచ్చింది. అంతెందుకు, సరిగ్గా కిందటి వారం వొచ్చాడు ఒక దరిద్రుడు. అడివి దారంట పోతున్నాననీ, దాహంతో చచ్చి పోతున్నాననీ వేడుకున్నాడు. వాడి వాలకం నచ్చకపోయినా, జాలి పడి కొంచెం తిండి పెట్టి మంచి నీళ్ళిచ్చింది. సాయంత్రం కాగానే తన దారిని తాను వెళ్తాడనుకుంటే, ఒక వెకిలి నవ్వుతో “ఈ రాత్రికి ఇక్కడే వుండి పోతా” అన్నాడు.

మారు మాట్లాడకుండా లోపలికి వెళ్ళి ఒక పెద్ద దుడ్డుకర్ర ఒక చేతిలో, భయంకరంగా పళ్ళు చూపిస్తూ గుర్రులాడుతున్న మొసలిని గొలుసుతో ఇంకో చేతిలో పట్టుకొని బయటికొచ్చింది. "ఇంకొక నిమిషంలో ఇక్కణ్ణించి కదలకపోతే, నేనూ నా కుక్కా కలిసి నిన్ను ముక్కలు ముక్కల కింద నరికేయడం ఖాయం," అని చెప్పింది వాడి కళ్ళల్లోకి చూస్తూ. ఆమె కళ్ళలోకి చూసి వాడేమనుకున్నాడో ఏమో, గబగబా మూటా ముల్లే సర్దుకుని, "వెళ్ళొస్తామ్మా!" అంటూ వెనక్కి తిరిగి చూడకుండా వెళ్ళిపోయాడు.

బుష్‌ల్యాండ్ జీవితాలు అవి. ఆ అడవిలో బ్రతకాలంటే అది చెప్పే పాఠాలు నేర్చుకోవాలి. ఆమె వాటిలో రాటుతేలిపోయిన మనిషి.

ఐతే తన జీవితంలోనూ చిన్న చిన్న సంతోషాలూ, సరదాలూ లేకపోలేదు. అన్ని రోజులూ ఒక ఎత్తు, ఆదివారం మాత్రం ఒక ఎత్తు ఆమెకి. ఆదివారం మధ్యాహ్నం పనంతా ముగించుకుని, చక్కటి బట్టలు కట్టుకొని, పిల్లలనీ ముస్తాబు చేసి అడవిలో ఒంటరిగా కాసేపు నడిచొస్తుందామె. అప్పుడు ఆమె ముస్తాబూ, పిల్లల ముస్తాబూ చూస్తే వాళ్ళేదో పట్టణంలో విందుకెళ్తున్నట్టు వుంటారు! ఆ ఒంటరితనంలో అదొక్కటే ఆమెకి ఆటవిడుపు. నిజానికి ఆ అడవిలో ఇరవై మైళ్ళ వరకూ ఇంకొక ప్రాణి కనబడకుండా నడవొచ్చు! ఎంత దూరం నడిచినా అదే అడవి, అవే పిచ్చిమొక్కలూ. ఏ మార్పూ లేని ఆ పరిసరాలు, ఆ మాంద్యం తట్టుకోలేకే మొగవాళ్ళు పట్టణానికి పారిపోదామనుకుంటారు. కనీసం కొత్తగా వేసిన రైలుపట్టాల పక్కనే నడుచుకుంటూ వెళ్ళిపోదామనుకుంటారు. పెళ్ళైన కొత్తలో పిచ్చెత్తినట్టు వుండేది, ఇప్పుడలవాటై పోయింది. భర్త ఇంటికొచ్చినప్పుడు సంతోషమే కానీ, అతను ఎప్పటికీ ఇంటి పట్టున వుంటాడన్న నమ్మకమూ ఆశా లేవామెకి. పిల్లలంటే ప్రేమ ఆమెకు. పైకి కఠినంగా ఉంటుంది. పరిస్థితులు ఆ ప్రేమను పైకి చూపించనీయవు. చుట్టూ వున్న మొరటుతనం స్త్రీ సహజమైన సున్నితపుతనాన్ని పెరగనీయదు.

ఆలోచనల్లోనే తెల్లారుతూ వుంది. గడియారం చూద్దామంటే ముందు ఇంట్లో వుంది. కొవ్వొత్తి పూర్తిగా ఆరిపోయింది. వేరే కొవ్వొత్తులు లేవు. బయట వర్షం ఆగిపోయినట్టుంది.

రాత్రంతా నిద్రలేమితో ఆమె అలసిపోయింది. ఎందుకో కళ్ళల్లో నీళ్ళు తిరిగేయి. చేతిగుడ్డతో తుడుచుకోబోయి వేళ్ళతో కన్ను పొడుచుకుంది. చేతిగుడ్డలో చిల్లులనుంచి ఆమె వేళ్ళు పొడుచుకొచ్చున్నాయి. ఆమెకు నవ్వొచ్చి పెద్దగా నవ్వింది. మొసలి ఆశ్చర్యంగా చూసింది. ఆమెకిలా తనమీద తాను నవ్వుకోవడం అలవాటే.

ఇంతలో ఉన్నట్టుండి కుక్క శరీరం బిగుసుకుంది. కదలకుండా ఊపిరి బిగబట్టి నేలలో వున్న నెర్రె వైపే చూస్తూన్న దాని శరీరంలో వెంట్రుకలన్నీ అదో మాదిరి ఉద్వేగంతో నిక్కబొడుచుకున్నాయి. ఆమెకి అర్థం అయింది. వంటింటి గోడ కింద వున్న నెర్రె వైపే తనూ చూస్తూ చేతి కర్ర అందుకుందామె. చిన్న కంతలోంచి గాజు గోళీల్లాంటి రెండు చిన్న కళ్ళు కదలకుండా బయటికి చూస్తున్నాయి. ఒక క్షణం బయట ఆమె, ఆమె పక్కన కుక్క, లోపల పాము కాలంతో పాటు స్తంభించి నిలబడ్డారు. కొంచెం సేపటికి పాము ముందు కదిలి మెల్లగా కొంచెం బయటికొచ్చింది.

ఆమె ఇంకా మెల్లిగా చేతి కర్ర పైకెత్తింది. ఆపద గ్రహించినట్టు పాము మళ్ళీ కలుగులోకి తల లాక్కుంది. ఒక్క నిమిషం తరువాత మళ్ళీ మెల్లిగా తల బైటకు పెట్టింది. కుక్క ఒక్క ఉదుటున పాము మీదికి దూకింది. పాము దాదాపు తప్పించుకొని పోబోయింది. కుక్క మళ్ళీ దాని పైకురికి పళ్ళతో దాన్ని ఒడిసి పట్టి పామును ఒక అడుగు బైటకు లాగింది. ధడ్! ధడ్! ఆమె పాము తలపై కొట్టింది. మొసలి పామును పట్టుకుని మరింత బయటకు లాగింది. ధడ్! ధడ్! ధడ్! ఐదడుగుల పొడవు, నల్లగా భయంకరంగా ఉంది పాము. సందడికి టామ్ లేచి తల్లికి సాయానికి రాబోయాడు. ఒక్క చేత్తో పిల్లవాణ్ణి దూరంగా నెట్టేసింది బలంగా, రెండో చేత్తో పాముని బాదుతూనే. మొసలి మూతి మీద ఒకట్రెండు దెబ్బలు తగిలాయి. వాడు

పట్టించుకోలేదు. ఆమె ఆగకుండా ఆ పామును కొడుతూనే వుంది, అది ఇక కదలిక లేకుండా చచ్చి పడేదాకా.

పాము శరీరాన్ని మెల్లిగా కర్రతో లేవనెత్తి బయట మండుతున్న నెగడులో వేసిందామె. కుక్క, పిల్లవాడూ కదలకుండా దూరంగా నిలబడ్డారు కాలిపోతున్న పామును చూస్తూ. కర్ర పక్కన పడేసి వొచ్చి కుక్క పక్కన కూర్చుందామె. ఇద్దరినీ దగ్గరకు లాక్కుంది. ఆమె చేతి స్పర్శతో పిల్లవాడూ, కుక్కా కొంచెం కుదుట పడ్డారు.

తలెత్తి తల్లి వైపు చూశాడు టామ్. ఆమె కళ్ళల్లో నీళ్ళు. తల్లి మెడ చుట్టూ చేతులేసి ఆమెని హత్తుకుపోయాడు.

“అమ్మా! నేను పెద్దయిన తరవాత ఎప్పుడూ నిన్నొదిలి ఆ దరిద్రపు అడవిలోకెళ్ళను,” అన్నాడు. కొడుకుని తన గుండెకి పొదువుకుందామె. సన్నగా తెల్లవారుతున్న అడవిలో అలా కూర్చుండిపోయారు వాళ్లలా.

(మూలం: The Drover’s wife – Henry Lawson.)

# ఏకాంతం కోసం

(జనవరి 2017 ఈమాట)

( కేథరిన్ మేన్స్‌ఫీల్డ్ )

ఆ పెద్దావిడ ప్రతీ మంగళవారం ఆ పుస్తకాలాయన ఇల్లు శుభ్రం చేయడానికని వొస్తుంది. కాలింగ్ బెల్ విని తలుపు తీస్తూ మీ మనవడెలా ఉన్నాడని అడిగాడు ఆయన. లోపలికొచ్చి కాళ్ళు తుడుచుకునే పట్టా మీదే ఒక్క క్షణం ఏదో ఆలోచిస్తున్నట్టు నిలబడిపోయింది మా పార్కర్.

“నిన్ననే వాణ్ణి పూడ్చిపెట్టాం సర్!” నిర్లిప్తంగా చెప్పింది.

“అయ్యయ్యో! ఔనా?” పుస్తకాలాయన ఇంకేమనాలో తోచక మౌనంగా ఉండిపోయాడు. ఆ సమయానికాయన ఉదయపు ఫలహారం చేస్తున్నాడు. ఎప్పట్లానే బాగా నలిగిపోయిన నైట్ గౌనులో ఆరోజు పేపరు చేత్తో పట్టుకునున్నాడు. ఇప్పుడు ఏమీ జరగనట్టు తిరిగిపోయి ఫలహారం ముగించడమా, ఇంకేవైనా ఓదార్పు మాటలు అనాలా అర్థంకాలేదాయనకి. ఏమీ మాట్లాడకుండా పేపరు పట్టుకొని పక్క గదిలోకెళ్ళిపోదాం అనుకున్నాడు కానీ, అది మొరటుతనంగా అనిపించిందతనికే.

“చర్చిలో అంతా సవ్యంగా జరిగిపోయిందా, మిసెస్ పార్కర్?” మొహమాటపడుతూ అడిగాడు.

“ఏమన్నారు సర్?” అర్థంగానట్టు అడిగిందావిడ.

“అదే, పిల్లవాడి ఆ… కార్యక్రమం ఏ ఇబ్బందీ లేకుండా…”

ఆవిడేమీ బదులివ్వలేదు. తలవంచుకుని మెల్లిగా ఆడుగులేస్తూ వంటింట్లోకెళ్ళిపోయింది. ఆయన నిట్టూర్చి తన ఫలహారం పనిలో పడ్డాడు.

ముసలావిడ వంటింట్లోకెళ్ళి చేతిసంచీ లోంచి తన పనిముట్లు తీసుకొని సంచీ చిలక్కొయ్యకి తగిలించింది. మెల్లిగా కుర్చీలో కూర్చొని వొంగి బూట్లు విప్పుకుంది. బూట్లు వేసుకోవడం, తిరిగి విప్పడం ఎంత నొప్పో ఆమెకు. అయితే ఆమెకా నొప్పి ఎంతగా అలవాటైపోయిందంటే, లేసులు విప్పదీయడం మొదలుపెట్టబోతుండగానే ఆమె పళ్ళు బిగుసుకుంటాయి, రాబోయే నొప్పిని ఊహిస్తున్నట్టుగా.

అతి ప్రయాస మీద బూట్లు విప్పి పక్కనపెట్టి కొంచెంసేపు కుర్చీలో అలాగే జారగిలబడి కూర్చుందామె, మోకాళ్ళు రుద్దుకుంటూ.

“గ్రానీ! గ్రానీ!” బయట వీధి లోంచి ఆమె మనవడు బూట్లతో సహా ఆమె ఒళ్ళోకెగబడ్డాడు.

“అబ్బబ్బా! అలా మీదపడొద్దని ఎన్నిసార్లు చెప్పాల్రా? చూడు, నా బట్టలెంత మురికి చేశావో!” విసుక్కుందామె. ఆమె మాటలేం పట్టించుకోకుండా వాడలాగే ఆమె ఒళ్ళో లేచి నుంచున్నాడు.

“గ్రానీ! ఒక్క పెన్నీ ఇవ్వవా!”

“ఫో అవతలకి! గ్రానీ దగ్గర పెన్నీల్లేవ్.”

“ఉన్నై, ఉన్నై, నాకు తెలుసుగా! గ్రానీ, ఒక్క పెన్నీ అంటే ఒక్కటి. ఇవ్వు గ్రానీ.” ఆమె మెడ చుట్టూ చేతులేసి తన చెంప ఆమె చెంపకి తగిలించి ముద్దుగా ఆడిగాడు.

“చాల్లే, నీ వేషాలూ నువ్వూ! నా దగ్గర పెన్నీలేమీ లేవంటున్నా కదా?” ఆమె చేతులు అప్పటికే తన హ్యాండ్‌బ్యాగులో చిల్లర డబ్బులకోసం తడుముతున్నాయి.

“సరే. నీకో పెన్నీ ఇస్తా. మరి నాకేమిస్తావూ, చెప్పు ముందు!”

వాడు ముద్దుగా నవ్వి అమ్మమ్మ మెడ చుట్టూ చేతులు ఇంకా గట్టిగా బిగించాడు.

“నా దగ్గిరేం లేదుగా గ్రానీ?” వాడి కంటి రెప్పలు ఆమె చెంప మీద చక్కిలిగిలి పెడుతూ...

పెద్దావిడ ఒక్క ఉదుటున కుర్చీలోంచి లేచి నిలబడింది. సింకు నుంచి టీ గిన్నెలో నీళ్ళు నింపి స్టవ్ మీద పెట్టింది. ఆపైన, ఇంకో గిన్నెలోనూ బకెట్‌లోనూ నీళ్ళు పట్టింది. పంపు నుంచి ధారగా నీళ్ళు గుడగుడ శబ్దం చేస్తూ గిన్నెలో నిండుతుంటే ఆమెకు నొప్పి ఏదో తగ్గినట్టనిపించింది కాసేపు.

ఆ వంటింటి స్థితి గురించి ఏకంగా పుస్తకమే రాయొచ్చు. పుస్తకాలాయన వారమంతా తన ‘పని’ తానే చేసుకుంటాడు. ఆవిడ వారానికొక్కరోజు మాత్రమే వొచ్చి శుభ్రంచేస్తుంది. ఆ వారంలోగా ఆయన నానా కంగాళీ చేసిపెడతాడు ఇల్లంతా. టీ కాచుకుని ఆ చెత్తంతా ఒక పెద్ద జాడీలో పడేస్తాడు. చెంచాలు, కత్తులు, ఫోర్కులూ వాడి సింకులో పడేస్తాడు. ఎప్పుడైనా కడగక తప్పదనిపిస్తే, ఒక తువ్వాలుతో తుడిచి మళ్ళీ వాడేస్తాడు. ఆయన దృష్టిలో ఇల్లు శుభ్రం చేసుకోవడమంత దండగ పని ఇంకొకటి లేదు.

“ఇంట్లో హాయిగా ఇష్టమొచ్చినట్టు వుండండి. వారానికొకసారి పనిమనిషిని మాట్లాడుకుంటే వచ్చి శుభ్రం చేసిపోతుంది. ఆమాత్రం దానికి ఇల్లు ప్రతీరోజూ ఎందుకూ క్లీన్ చేసుకోవడం. వేస్ట్ ఆఫ్ టైమ్!” అంటాడాయన దగ్గరి స్నేహితులతో. అదీ ఆయన ‘పద్ధతి.’

ఆ పద్ధతి అందమంతా ఆ వంటిల్లు చూస్తేనే తెలిసిపోతుంది.

వంటిల్లంతా పెద్ద చెత్త కుండీలా తయారయింది. నేల మీద రొట్టె ముక్కలు, ఉత్తరాలు, ఖాళీ పేకెట్లు, సిగరెట్టు పీకలు, చెప్పనలవికాకుండా వుంది. అయినా ఎప్పుడూ ఆవిడ విసుక్కోలేదు. పైగా ఒంటరివాడనీ అతన్ని అంటిపెట్టుకుని వుండేవారెవరూ లేరనీ సానుభూతి కూడా. కిటికీ తలుపు తెరిచి ఆకాశం వంక చూసింది. అక్కణ్ణించి ఆకాశం ఎందుకో ఎప్పుడూ దిగులుగా

అనిపిస్తుంది. ఉన్న ఒకటీరెండు మబ్బులు కూడా ఆకాశంలో టీ మరకల్లాగా అంచులు చిరిగిపోయి, అక్కడక్కడా చిల్లులు పడ్డ దుప్పట్లలా వుంటాయి.

ఆవిడ నేల చిమ్మడం మొదలుపెట్టింది. 'ఏమిటో, నా పాడు జన్మకీ కష్టాలు తీరేలా లేవు. ఎంతకని భరించను, ఎన్నని సహించను!' అనుకుని నిట్టూర్చింది.

ఆ మాట ఆమె గురించి ఆమే కాదు అందరూ అనుకునేదే. సాయంత్రం పనంతా ముగించి ఇంటికి నిదానంగా నడుచుకుంటూ పోయే ఆమెను చూసి అందరూ పాపం అనుకుంటారు. మా పార్కర్ బతుకంతా కష్టాలే కష్టాలు, అని చెప్పుకుంటారు. ఆవిడకదేమీ గొప్పగా అనిపించదు. ఆమాటకొస్తే అసలేమీ అనిపించదు. ఆవిడ ఫలానా నంబరు ఇంట్లో ఉంటుంది అన్నప్పుడు ఎలా వుంటుందో, ఆమెది ఎంత కష్టమైన బతుకో అనుకున్నప్పుడూ అలానే వుంటుంది. నిజంగా కష్టమైన బతుకే...

పదహారేళ్ళప్పుడు స్ట్రాట్‌ఫర్డ్ వదిలి లండన్‌కొచ్చిపడింది పనిమనిషిగా. ఓహ్! స్ట్రాట్‌ఫర్డ్! అంటే షేక్స్‌పియర్ పుట్టిన వూరే కదా? అందరూ ఆమెని అడిగేవాళ్ళే! ఏమో సర్, తెలీదు. ఆమెకు షేక్స్‌పియర్ ఎవరో లండన్ వచ్చాక కానీ తెలియలేదు.

ఇప్పుడా వూరి జ్ఞాపకాలు ఏమీ లేవు. ఏ చీకటి రాత్రో చిమ్నీగొట్టాం నుంచి నక్షత్రాలను చూడడం, లీలగా అమ్మ, ఇంటిముందు మొక్క ఏదో గుర్తులేదు కానీ మంచి వాసన వస్తుండేది. ఎప్పుడో జబ్బుచేసి మంచం పైన పడుకున్నప్పుడు ఒకటి రెండు సార్లు గుర్తొచ్చాయి, అంతే.

ఆమె మొదట పనిచేసిన ఇంట్లో భయంకరంగా వుండేది. రోజంతా వంటింట్లోనే మగ్గాల్సొచ్చేది. పైగా ఆ వంటమనిషి ఏ మాత్రం దయాదాక్షిణ్యాలు లేని రాక్షసి. ఇంటి నుంచి వొచ్చే వుత్తరాలు కూడా చదవనిచ్చేదికాదు. చేతిలోంచి లాక్కొని చిమ్నీలో పారేసేది అవి

చదువుకుంటూ ఊహల్లో తేలిపోతుందని. . . .పేడపురుగులు! అవును కదా! ఆ వంటమనిషి వాటినెప్పుడూ చూడలేదట. పేడపురుగులు చూడని వాళ్ళూ ఉంటారా? తన కాళ్ళు తాను చూసుకోని వాళ్ళెవరుంటారు. మా పార్కర్ ముఖంలో చిన్న నవ్వు కనిపిస్తుంది ఆ పేడపురుగులు గుర్తొచ్చినప్పుడల్లా.

ఆ ఇంటి నుంచి ఒక డాక్టరుగారి ఇంట్లో పని కుదిరింది. అక్కడా పగలూ రాత్రీ పని. రెండేళ్ళు అలుపెరగకుండా అలా పనిచేసి, ఒక బేకర్‌ని పెళ్ళాడింది.

"బేకర్‌ని పెళ్ళాడారా?" అన్నాడు పుస్తకాలాయన, ఆవిడ ఆ సంగతి చెప్పినప్పుడు. ఎప్పుడో ఇంట్లో ఇంకో ప్రాణి ఉంది అని గుర్తొచ్చినప్పుడు ఆ పుస్తకాల మధ్యలోంచి తలెత్తి ఆమె చెప్పేది వింటుంటాడాయన.

"అయినా బేకర్లే నయం లెండి. తిండికి లోటుండదు. పైగా శుభ్రమైన పని!" ఆవిడ నిజంగానా అన్నట్టు ఆయనవంక చూసింది.

"బేకరీలో బ్రెడ్ అమ్మడం, వచ్చీపోయే కస్టమర్లతో సరదాగా ఉండుండాలి కదా?"

"దుకాణంలో ఉండేంత తీరికెక్కడిది సార్? మొత్తం పదముగ్గురిని కన్నాను. ఏడుగురిని కప్పెట్టాను. తెలిసింది రెండే అనుకోండి నాకు, పురిటి మంచం లేకుంటే ఆస్పత్రి మంచం."

"అనుకోవచ్చు, అనుకోవచ్చు," వెన్నులోంచి చలి వచ్చినట్లు ఒక్కసారి వొణికి పెన్ను చేతిలోకి తీసుకుని తన పనిలో పడిపోయేడు.

ఏడుగురు పోయినా మిగిలిన ఆరుగురినీ పెంచి పోషించడమంటే మాటలా? ఇంతలో ఇంటాయనకి ఊపిరి తిత్తుల వ్యాధి సంక్రమించింది. లోపలంతా పిండి నిండిపోయిందన్నాడు వైద్యుడు.

“అమ్మా! ఇక్కడ కనక ఈయనని కోస్తే ఊపిరితిత్తులనిండా గోధుమ పిండే కనిపిస్తుంది మనకి. అయ్యా, మీరు కొంచెం గట్టిగా ఊపిరి పీల్చండి.” షర్టు పైకెత్తి పడుకున్న అతని వెన్ను పైన పెన్నుతో రాస్తూ అన్నాడు వైద్యుడు, ఆయన ఎంతో ప్రయాసతో ఊపిరి పీల్చుకున్నాడు. ఆమెకెందుకో అతని నోటి నుండి గోధుమ పిండి పొగలా వచ్చినట్లు అనిపించింది.

ఆయన పోయిన తరవాత ఆరుగురు పిల్లలనీ పెంచేసరికి ప్రాణాలు కడబట్టిపోయాయి. సరిగ్గా ఆఖరి పిల్ల బళ్ళోకెళ్ళేసరికి తన చెల్లెలు భర్తతో సహా దిగింది, నీకు సహాయం చేస్తా అంటూ! సహాయం మాట దేవుడెరుగు, వచ్చిన రెండునెలలకి చెల్లెలు మెట్ల మీద జారి మంచాన పడడంతో చంటి బిడ్డలా అయిదేళ్ళపాటు పెంచాల్సిన పరిస్థితి వచ్చిపడింది. నిజంగా తన చెల్లెలు వయసొచ్చిన చంటి బిడ్డే!

ఆ తరవాత ఇద్దరాడపిల్లలూ జబ్బుచేసి పోయారు. జిమ్ సైన్యంలో చేరి ఇండియా పోయాడు. ఇద్దరు మగపిల్లలు జీవనోపాధి వెతుక్కుంటూ దేశాలు పట్టి వెళ్ళిపోయారు. ఆఖరిది ఎమిలీ తనతో మిగిలిపోయిందనుకుంటే అది ఎందుకూ పనికిరాని ఒక వెయిటర్ వెధవని పెళ్ళాడింది. వాడూ కడుపులో అల్సర్లు పుట్టి చచ్చిపోయాడు లెన్నీ పుట్టిన ఏడాది. ఇక మిగిలిందల్లా తన మనవడు లెన్నీ.

ఆలోచనల్లోనే గిన్నెలన్నీ కడిగి తుడిచి సర్దేసిందామె. నల్లగా మురికిపట్టిన కత్తులన్నీ కోసిన బంగాళాదుంపతో రుద్ది కడిగింది. భోజనం చేసే బల్ల, ప్లేట్లు కప్పులున్న అల్మారా, మిగతా వంటిల్లంతా కూడా శుభ్రంచేసి చేతులు తుడుచుకుంది.

బుజ్జివెధవ పాపం ఎందుకో ఎప్పుడూ అనారోగ్యంగానే వుండేవాడు. వాడి వుంగరాల జుట్టు, నాజూకు రంగు చూసి అందరూ ఆడపిల్లనుకునేవారు. తనూ ఎమిలీ ఎన్నెన్నో చిట్కా వైద్యాలు చేశారు. ఆ వైద్యాలకోసం ఎమిలీ ఆదివారం పత్రిక పొద్దున్నే చదివేది. ఆ పత్రికకి సలహాల

కోసం తల్లీ కూతురూ ఎన్నో ఉత్తరాలు కూడా రాసేవారు. అయినా లెన్నీ అసలు తిండి సరిగ్గా తిననేలేదు. ఎన్నెన్ని ప్రయత్నాలు చేసినా వాడు ఒళ్ళు చేయనేలేదు.

అమ్మకంటే వాడికి అమ్మమ్మంటే ప్రాణం. వాడు అమ్మమ్మ బిడ్డ.

"నువ్వు ఎవరి బేబీవి?" అడిగింది మా పార్కర్, స్టవ్ తుడిచి జిడ్డు పట్టిన కిటికీ మీద సబ్బు రుద్దుతూ.

"నేను గ్రానీ బేబీని!"

ఒక పిల్లవాడి గొంతు తన గుండె కిందుగా నవ్వుతూ చెప్పింది. ఆ గొంతు ఎంతో ఆప్యాయంగా, ఎంతో దగ్గరగా తన గుండెలోంచి వస్తున్నట్టుగా వినిపించి మా పార్కర్ నిలువెల్లా కదిలిపోయింది ఒక్క క్షణం.

గది గుమ్మం దగ్గర అలికిడయింది. ఆమె తలెత్తి చూసింది. పుస్తకాలాయన తయారయి ఎక్కడికో బయల్దేరినట్టున్నాడు.

"మిసెస్ పార్కర్! నేను బయటికెళ్తున్నాను!"

"అలాగేనండి!"

"మీకివ్వాల్సిన డబ్బు బల్లమీద వుంది."

"అలాగేనండి."

ఆయన వెళ్ళబోతూ ఆగిపోయాడు.

"అన్నట్టు, కిందటి వారం మీరొచ్చినప్పుడు డబ్బాలోంచి కోకో పొడి బయటకానీ పడేశారా?"

"అబ్బే, లేదండి."

"వింతగా వుందే. నాకు బాగా గుర్తు, డబ్బాలో ఒక చెంచాడు పొడి మిగిలేవుండాలి. ఇప్పుడు చూస్తే ఖాళీగా వుంది. కనపడకపోతే బయట పడేశారేమోననుకున్నా. నాకు చెప్పకుండా ఏదీ పడేయరు కదా?" ఆయన గంభీరంగా ముగించి బయటికి నడుచుకుంటూ వెళ్ళిపోయాడు, తన లౌక్యానికీ తెలివి తేటలకీ ఎంతగానో మురిసిపోతూ. తనేమీ అంత అమాయకుడూ తెలివితక్కువవాడూ కాదనీ, ఇంటి విషయాల్లో అప్రమత్తంగానే వుంటాడనీ తెలియజెయ్యడమే ఆయన ఉద్దేశ్యం.

ఆయన వెళ్ళిపోయిన గుర్తుగా తలుపు ధడాలున మూసుకుంది. మా పార్కర్ తన బ్రష్షులు, గుడ్డలూ తీసుకొని బెడ్రూములోకి నడిచింది చిన్నగా. పక్కలు దులిపింది, దుప్పట్లు తీసి కొత్త దుప్పట్లు పరిచి ముడతలు సరిచేసి వాటిని పరుపు కిందికి నెట్టింది. దిళ్ళు సర్దింది. ఆ ఒంటరితనంలో, నిశ్శబ్దంలో తన మనవడి ఆలోచన ఆమెను కుదిపివేస్తూనే ఉంది.

ఎలాగూ పోక తప్పనప్పుడు వాడంత నరకయాతన ఎందుకు అనుభవించాలన్న ప్రశ్న ఆమెని నిలవనీయడంలేదు. అంత పసి కూన ఒక్కొక్క ఊపిరి కోసం బ్రతుకునంతగా వేడుకోవాలా? ఆ చిన్నారిని అంత చిత్రహింసలు పెట్టి ఆనందించేదెవరు? ఎవరి తృప్తికోసం వాడి పోరాటం? ఆమెకు అర్థంకానిదదే.

వాడి పలుచటి గుండెలో ఏదో మరుగుతున్నట్టు వచ్చే గుర గుర శబ్దం. అది బైటికి రాదు వాడిని ఊపిరి తీసుకోనీయదు. దగ్గినప్పుడల్లా చేతులు కాళ్ళు కదిలిపోయేవి. కళ్ళు ఉబ్బుకొచ్చేవి. ఆ తరవాత అలసిపోయి దిండుకి చేరబడి వాడు గ్రానీ వంక కోపంగా చూసేవాడు.

తను కళ్ళనీళ్ళు పెట్టుకుంది.

“నేనేం చేయనురా నా తండ్రీ!” చెమటకి తడిసిపోయిన వాడి జుట్టుని మొహం మీంచి పక్కకి జరిపింది. వాడు కోపంగా ఆమె చేయి పక్కకి తోసేసి కళ్ళు మూసుకున్నాడు. గుండెని మెలిపెడుతున్నట్టున్న బాధని ఆ పెద్దావిడ తట్టుకోలేకపోయింది.

ఇక తనవల్ల కాలేదు. చేతిలో వున్న తుడుపు గుడ్డ అలానే వదిలేసింది. ఆమె తన బతుకేదో తాను బతికింది. ఏదొచ్చినా నిబ్బరంగా నిలబడింది. ఆమె ఇంతవరకూ కన్నీళ్ళు పెట్టుకోలేదు బైటివారి ముందైనా తన పిల్లల ముందైనా. కానీ ఇప్పుడు లెన్నీ లేడు. తనకెవరూ లేరు. ఇప్పుడెవరికోసం బ్రతకాలి? తనకు మిగిలిందల్లా ఆ పసికూన ఒక్కడే. ఇప్పుడు వాడూ లేడు. ఈ కష్టాలన్నీ తనకే ఎందుకు రావాలి? తనకే ఎందుకవుతుంది ఇలా?

“నాకే ఎందుకవుతుంది ఇలా?”

తెలియకుండానే ఆ ప్రశ్న మా పార్కర్ నోటినుంచి బయటకు వచ్చింది. గుండెను నులిపెడుతున్న బాధతో మా పార్కర్ తనేం చేస్తున్నదో తెలియని స్థితిలో వంటగదిలోకి నడిచింది, కోటు వేసుకుంది, తలకు టోపీ పెట్టుకుంది. ఇంట్లోంచి బైటకు వచ్చింది. ఎక్కడికి పోవాలి? ఎటువైపు నడవాలి? ఏం చేస్తే తన ఆలోచనలనుంచి తను తప్పించుకోగలదు?

బయట చలిగా వుంది. చల్లటి ఈదురుగాలి కత్తులతో కోస్తున్నట్లుగా ఉంది. అందరూ చకచకా నడిచిపోతున్నారు తమ శరీరాలన్నీ కప్పుకుని. పక్క మనిషిని పలకరించడానిక్కూడా ఓపిక, తీరిక లేని మనుషులు, ఎవరికీ ఆమె బాధ పట్టలేదు. ఎక్కడైనా కూర్చుని తీరుబడిగా ఏడవాలని వుందామెకు. కానీ ఇన్నేళ్ళ తరువాత ఏడుద్దామన్నా అవుతుందా? ఇన్నేళ్ళూ గుండెల్లో ఉగ్గబట్టుకువున్న ఏడుపు ఇప్పుడు మాత్రం బయటకు వస్తుందా?

ఆ ఆలోచన రాగానే లెన్నీ గుండెల మీదకెగబాకినట్టుగా అనిపించింది. అవున్నాన్నా, గ్రానీ కిప్పుడు ఏడవాలనుంది. ఏడుపంటూ మొదలుపెడితే అన్నిటికీ ఏడవాలి. రాక్షసిలాంటి

వంటమనిషి, భర్త అనారోగ్యం, పుట్టిపోయిన తన పిల్లలు, ఇన్నేళ్ళ ఈ దుర్భరమైన జీవితం చివరికి లెన్నీ దగ్గరికి వచ్చి ఆగేదాకా జరిగిన ప్రతీదానికి ఏడవాలి. తీరిగ్గా పూర్తిగా గుండె బరువు తగ్గిపోయేలా ఏడవాలి. ఇన్నిటికి ఏడవాలంటే చాలా సమయం కావాలి. అయినా సరే. సమయం వచ్చింది. ఇక ఆగదు. తను ఏడవక తప్పదు. ఇక ఏడవాలి. కానీ ఎక్కడ?

"మా పార్కర్ బతుకంతా కష్టాలే కష్టాలు!" అవును. కష్టాలే. బిగబట్టుకున్న పెదవులు వణికాయి.

ఇంటికెళ్ళి ఏడవలేదు, అసలే బిడ్డ పోయిన బాధలో వున్న ఎమిలీ తట్టుకోలేదు, బెదిరిపోతుంది. బయటెక్కడైనా పార్కులో బెంచీ మీద కూర్చోని యేడుద్దామంటే, అందరూ చుట్టుముట్టి ప్రశ్నలడుగుతారు. పుస్తకాలాయనది పరాయి ఇల్లు. అక్కడ ఎలా ఏడవగలదు? ఏ దుకాణం మెట్ల మీదో కూర్చుని ఏడిస్తే పోలీసువాళ్ళు వచ్చి పొమ్మంటారు.

తనకు ఇష్టమైనంతసేపు ఎవరికీ తను కనిపించని చోటు, ఎవరూ తనని ప్రశ్నలడగని చోటు ఒకటి లేదా? ఇన్నాళ్ళకి ఈ ప్రపంచంలో తను పొగిలి పొగిలి ఏడవడానికి ఒక చోటంటూ కనీసం లేదా?

ఇంతలో వాన మొదలయింది. చల్లటి ఈదురుగాలి ఆమెను సూదులతో పొడిచింది. మా పార్కర్ అటూ ఇటూ చూసింది. లేదు, చోటెక్కడా లేదు.

[మూలం: కేథరిన్ మేన్స్‌ఫీల్డ్ – The Life of Ma Parker ]

## కొన్ని నవ్వులూ కొన్ని ఏడ్పులూ

(జులై 2020 ఈమాట)

సాయంత్రం నీరెండలోకి చూస్తూ కారు నడుపుతున్నాను. అందమైన ఆకాశాన్ని చూస్తే ఏదో దిగులనిపించింది. అద్భుతమైన సౌందర్యాన్ని, ఎక్కడ, ఎప్పుడు చూసినా కొంచెం దిగులూ, ఇంకొంచెం భయమూ కలుగుతుంది. ఒక గొప్ప విడ్డూరాన్ని చూశాక మిగతా ప్రపంచం చాలా సాధారణంగా బీడుపోయి కనిపిస్తుంది. ఆ అద్భుతమైన సౌందర్యానికున్న అల్పాయుష్షు తలచుకుని దిగులు, అసలింత సౌందర్యం ఈ చిన్ని గుండె తట్టుకోలేదేమో అన్న భయమూ, అన్నీ కలిసి ఆ సౌందర్యం కలగజేసే ఆనందాన్ని కొంచెం కలుషితం చేస్తాయా? తెలియదు. నా ఆలోచనలతో నాకే నవ్వొచ్చింది. వారం వారం అలవాటయిపోయి నాతో నేనూ ఇలానే ప్రెజెంటర్ భాషలో మాట్లాడుకుంటున్నాను. కానీ నాలోనూ ఏదో మార్పొచ్చింది. తెలుస్తూనే ఉంది. వయసా, కుటుంబమా, ఉద్యోగమా?

ఈ ఉద్యోగం ఒకప్పుడు ఎంత గొప్పగా, ఉత్సాహంగా ఉండేదనీ! "నమ్మితే నమ్మండి" అని, “రిప్లేస్ బిలీవ్ ఇట్ ఆర్ నాట్” లాంటి షో మాది. ఒక పెద్ద ఛానల్‌లో చాలా హై టీఆర్పీ ఉన్న షో. ఒకప్పుడు ఎంతో గొప్ప వింతలూ విడ్డూరాలూ చూసేవాళ్ళం. ఒకామెకు జుట్టు ఎంత పొడుగంటే నడుము చుట్టూ పది చుట్లు చుట్టుకొనేంత. ఒకమ్మాయి ఒంటిమీద నీరు పోస్తే తామరాకు మీదనుంచి జారినట్టు జారిపోయేవి. ఒక చిన్న పిల్లవాడు నిజంగా జంతువులతో మాట్లాడగలిగేవాడు. నిజంగా అద్భుతాలు అవి. వెతికి వెతికి అలాంటివారిని పట్టుకొనేవాళ్ళం. చూస్తుంటే అబ్బురంగా ఉండేవి. ఎవరూ వివరించలేని అలాంటి గొప్ప విడ్డూరాల నుంచి రాను రానూ ప్రోగ్రామ్ వాసి తగ్గిపోయింది. ప్రస్తుతం, కరెంట్ షాక్ లాంటిదేదో తగుల్చుకొని బాబాలుగా మారిపోయి భవిష్యత్తు చూడగలననే దొంగ ఫకీర్లు, పదినిమిషాలలో పది పిజ్జాలో, వంద మిరపకాయలో తిని సూపర్ హ్యూమన్ అని చెప్పుకొనే జోకర్లూ ఎక్కువయ్యారు. నిజంగా అద్భుతాలను చూసినవారు ఇలా మీడియా గుర్తింపు కోసం వెంపర్లాడరు.

సాయంత్రం తప్పుకుంటూ చిరుచీకట్లకి దారిస్తోంది. హైదరాబాద్ చేరడానికి ఆలస్యం కావొచ్చు. ప్రియ పాపం ఒంటరిగా ఎదురుచూస్తూ వుంటుంది. ఒక్కసారి ఫోన్ చేయడం మంచిదేమో, మెల్లిగా హైవే దిగి కారు ఒక పక్కగా ఆపి ఇంటికి ఫోన్ చేశాను.

"హల్లో శేఖర్! ఎక్కడున్నావ్?" ప్రియ గొంతు అలసటగా వినిపించింది.

"మధ్యాహ్నమే విజయవాడ నించి బయల్దేరే ప్రయత్నం చేశా. అయినా ఆలస్యం అయిపోయింది. ఇంకా నల్లగొండ దగ్గరే వున్నా. ఇల్లు చేరేసరికి ఇంకొక రెండు గంటలైనా పట్టొచ్చు. నువ్వూ శ్రుతీ భోంచేసేయండి. వంట చేసే ఓపిక లేకపోతే బయట్నుంచి ఏదైనా తెప్పించుకో."

"అలాగేలే! నువ్వు జాగ్రత్తగా డ్రైవ్ చేసుకుంటూ రా. తొందరపడకు." ప్రియ నిట్టూర్చి ఫోన్ పెట్టేసింది.

ప్రతీరోజూ సాయంత్రమయ్యేసరికి తనే ఒక పేషంటులాగవుతుంది ప్రియ. అందుకే ఎలాగోలాగ వీలు చేసుకొని ప్రియని స్నేహితులతో బయటికి పంపుతాను, బలవంతంగానైనా. లేకపోతే తను డిప్రెషన్ బారిన పడే ప్రమాదం వుంది. ఇప్పటికే తన వుద్యోగం వదిలేసింది పాప కోసం. మానసిక వైకల్యము, అంగ వైకల్యమూ గల పంతొమ్మిదేళ్ళ ఆడపిల్లతో పొద్దుణ్ణించీ ఇంట్లో ఇంకే వ్యాపకమూ లేని ఒంటరితనం ఎంత భయంకరంగా, సఫొకేటింగ్‌గా వుంటుందో తెలుసు నాకు. ఏ బాధ్యతా లేని స్వతంత్రమూ వుండదు, పోనీ ఒక బాధ్యతని నిర్వర్తిస్తూ భవిష్యత్తులోకి తొంగిచూసే ఉత్సాహమూ వుండదు. పక్కన మనిషి వున్న పేరేగానీ, ఆ మనిషి ఉనికి వల్ల ఎటువంటి మానసిక శారీరక సాంత్వనా వుండదు. ఉన్నదల్లా ఎడతెగని చాకిరీ, అలసట, నిరుత్సాహం, బ్రతుకుమీద ఇదీ అని చెప్పరాని కోపమూ.

ఆలోచనల్లోంచి బయటపడి కారు స్టార్టు చేశాను. ఏమైందో ఏమో, స్టార్ట్ కాలేదు. కంగారుపడ్డాను. మళ్ళీ ప్రయత్నించాను. ఊహు! ఏమాత్రం చలనం లేదు. కార్లోంచి బయటకొచ్చి నిలబడ్డాను. చుట్టూ చూశాను. ఎవరూ లేరు. కారు బానెట్ ఎత్తి చూశాను. స్పార్క్ ప్లగ్ వైర్స్ అన్నీ సరిగ్గానే ఉన్నాయి. బహుశా ఆల్టర్నేటర్ పోయిందేమో. ఏమీ తోచలేదు ఒక నిమిషంపాటు. అయోమయంగా సెల్ ఫోన్ తీశాను, ఎవరికి ఫోన్ చేయాలనో! సిగ్నల్ లేదు. నిస్సహాయంగా చుట్టూ చూశాను. కొన్నిసార్లు మా డాక్టరు శ్రుతి వైపు చూసినప్పుడు అతని మొహమూ ఏమీ అర్థంకానట్టు అయోమయంగా వుంటుంది, అచ్చం ఇప్పుడు నా మొహంలాగే!

కారు మీద చెప్పలేనంత కోపం వచ్చింది. షో పని మీద చుట్టుపక్కల ఊళ్ళు తిరుగుతూ వుంటాను. నా టీమ్ షార్ట్‌లిస్ట్ చేసిన ఎవరినైనా నేనూ చూసి కన్ఫర్మ్ చేసుకోక తప్పదు. అయినా వీలైనంతవరకూ ఇంటికి రాత్రయేలోపలే చేరుకునే ప్రయత్నం చేస్తూనేవుంటాను కానీ ఇప్పుడిలా! ఈ పక్కన ఒక చిన్న పల్లెటూళ్ళో ఒక అమ్మాయి నిప్పుల్ని మింగుతూందంటే చూసి నిర్ధారించుకోవడానికొచ్చాను. మామూలు బ్రతుకులే నిప్పుల మీద నడకలాగుంటే, నిప్పులు మింగడంలో పెద్ద వింతేముంది నిజానికి?

ఇక ఈ రాత్రి ఈ కార్‌లో గడపక తప్పదనుకున్నాను.

“ఏమైంది సార్! ట్రబులా?” కొద్ది దూరంలో వినిపించింది గొంతు. చిరుచీకట్లోంచి నడిచివస్తూ తోచీతోచనట్టు క్రీనీడలా అనిపించాడు. అతను దగ్గరికొచ్చేదాకా నేనేమీ జవాబివ్వలేదు.

“ఏంది సార్? కారు ట్రబులిస్తుందా? నేను చూడనా?” అతనే మళ్ళీ అన్నాడు. బహుశా నా వయసే ఉండచ్చు. జీవితపు తిరగలిలో నలిగిపోయినట్టున్నాడు. అక్కడక్కడా నెరుస్తూ పలచబడుతున్న జుట్టు, వాలిపోయినట్టున్న భుజాలు, పెద్ద పెద్ద కళ్ళల్లో ఏదో పెద్ద బరువు మోస్తున్న అలసట అతని మొహంలో.

“అవును. స్టార్టర్ బానే ఉంది. ఏమయ్యిందో తెలియడంలేదు.”

అతనూ ప్రయత్నించాడు. ఊహూఁ! బండి అసలు పట్టించుకోనేలేదు. చిన్నగా నిట్టూర్చి, బోనెట్ మూసేశాడతను. ఇద్దరం కాసేపు మౌనంగా నిలబడ్డాం. నిర్మానుష్యంగా, దీనంగా వున్న మైదానంలాటి ప్రదేశం, చీకటీ చలీ కలిసి దాడిచేయబోతున్న సంధ్యా సమయం, అపరిచితులం ఇద్దరం, ఎందుకో ఒళ్ళు జలదరించింది నాకు. అతనే ముందు తేరుకున్నాడు.

“ఏమో సార్! నాకేం తెలవట్లే! పొద్దున్న ఒక మెకానిక్‌ని తీసుకొనొద్దాం. చీకటి పడుతుంది, పురుగూ పుట్రా తిరిగే టైమ్! మా ఇల్లిక్కణ్ణే వుంది. పోయి రాత్రికి పండుకోని పొద్దున వొద్దాం.”

“మీ ఇంట్లో వాళ్ళకి పాపం ఇబ్బందేమో కదా?” కొంచెం సంశయించాను.

“అయ్యో, ఇందులో ఇబ్బందేం వుంది సార్? నడువుండ్రి, రాత్రికి పండుకోని పొద్దున్న వొద్దాం.” చేసేదేం లేక పొలాల వెంబడి అతని వెనకే నడవసాగాను. బురదమట్టి కాలిబాట.

“ఇంతకీ మీ పేరు?” నడుస్తూ అడిగాను.

“చర్లపల్లి సార్.”

“జైలు లాగానా?” అర్థంలేకుండా నవ్వాను.

“బతుకంటే జైలే కద సార్!” వేదాంతిలా నవ్వాడు.

“ఏం చేస్తారు మీరు? వ్యవసాయమా?”

“లేద్సార్. ఎలెక్ట్రిసిటీ బోర్డులో లైన్‌మన్‌గా చేస్త. మీ పేరేంది సార్? ఎక్కణ్ణుంచొస్తున్రు?”

“విజయవాడ నించి, హైదరాబాదు వెళ్ళాలి. నమ్మలేని నిజాలు అనే టీవీ షో వొస్తుంది చూస్తారా? అది నడిపేది నేనే.”

నడుస్తున్నవాడల్లా టక్కున ఆగిపోయాడతను.

“అవునా సార్?! అయితే చాలా వింతలు చూసుంటరు గద సార్!” అన్నాడు ఆసక్తిగా.

పెద్దగా నవ్వాను. “అవును చాలానే చూశాను.”

“అయితే మీకొక వింత చూపించాల. మీరిప్పడిదాక చూసుండరు.”

ఇది ఎప్పుడూ జరిగేదే. ఏదో ఒక నమ్మలేని నిజం తెలియనివాళ్ళుండడం చాలా అరుదు. అందుకే పెద్దగా స్పందన ఏమీ లేకుండానే అన్నాను, “అవునా? చెప్పండి.”

“నా కూతురు సార్! మామూలు ఆడపిల్ల కాదు. మీరు చెప్తే నమ్మరు కానీ ఒక్కసారి చూడండి సార్! నా బిడ్డ నిజంగా స్పెషల్ సార్!”

అతని కూతురు ప్రసక్తి రాగానే, నాకు నా కూతురు గుర్తుకొచ్చి మనసంతా వికలమైపోయింది. అవును, నా శ్రుతి కూడా స్పెషల్ గర్ల్. పాపం ప్రియ ఏమైనా తిన్నదో లేదో. శ్రుతి ఎలా ఉందో. కనీసం ఇంట్లో లైటన్నా వేసుకుందో లేక ఓపిక లేక అట్లాగే పడుకుందో! అసలే డస్సిపోయిన మనసూ శరీరం మరింతగా అలసిపోయాయి.

“మీకు పిల్లలా సార్?” అతని ప్రశ్నతో ఉలిక్కిపడ్డాను.

“ఆఁ, ఒక కూతురు!”

“అవునా, కూతురైతే ఇగ చెప్పేదేముంది! ఎన్ని నవ్వులుంటయో, అన్ని ఏడ్పులూ వుంటయి.”

ఎంత కవితాత్మకమైన పరిశీలన! ఇలా ఇక్కడ వినరావడం ఎంత విడ్డూరం. పెద్దగా చదువూ తెలివీ వున్నట్టే కనపడని అతను, అటూ ఇటూ తిప్పుతూ మాట్లాడుతున్న తల, గాలికి ఎగురుతున్న అతని పలచటి పొడుగాటి జుట్టు, అతని మాటల్లో కనిపించీ కనిపించని వేదన, ఏదో అర్థంకాని విషాదానికి భాష్యం చెప్తున్నట్టు. జీవితాన్ని చదివిన మనిషి, జీవితాన్ని గడిపిన మనిషి, జీవితాన్ని అర్థం చేసుకున్న మనిషి, ఈ మారుమూల ఇక్కడ, ఇలా. నాకెందుకో అతని మీద ఏదో తెలియని ఆప్యాయత కలిగింది.

శ్రుతి గురించి నేనెందుకో ఎప్పుడూ ఎవరితోనూ మాట్లాడలేదు. తనలా ఉండడం నాకెందుకు నామోషీగా అనిపిస్తుందనేది బహుశా నా మనసులో ఏ చీకటిమూలలోనో దాచిపెట్టుకున్న రహస్యం. నా కొలీగ్స్, ఫ్రెండ్స్ ఎవరిదగ్గరా ఆ ప్రస్తావన రాకుండానే జాగ్రత్తపడ్డాను. నిజానికి నా కొలీగ్స్ చాలామందికి శ్రుతి ఉందని కూడా తెలియదు. కానీ, ఇప్పుడు ఇక్కడ ఈ అపరిచితుడితో నా మనసులో వ్యథంతా పంచుకోవాలన్నంత ఆవేశం వచ్చింది. గొంతు సవరించుకుని చెప్పాను.

“మా శ్రుతికి, అదే మా అమ్మాయి, కొన్నాళ్ళ క్రితం పెద్ద ఆక్సిడెంటయింది. ఎనిమిదేళ్ళ క్రితం, అప్పుడు పదకొండేళ్ళు దానికి. పాపం, సైకిలు తీసుకొని బయటికెళ్ళింది. కారు గుద్దేసింది. కాళ్ళు చచ్చుబడిపోయాయి, మెదడు కూడా దెబ్బతింది. అసలది మమ్మల్ని గుర్తుపడుతుందా లేదా కూడా అనుమానమే. తన ప్రపంచంలో తనుంటుంది, మంచం మీద గుడ్డల మూటలా. డాక్టర్లు మాకు ఏవేవో చెపుతూ వుంటారు. ఆశ వొదులుకోవద్దని, ఏ అద్భుతమో జరగవచ్చని, అది మళ్ళీ మామూలు ఆడపిల్ల కాకపోయినా కనీసం నడవగలదు, మాట్లాడగలదు అని, ఇలాంటివి అప్పుడొకసారి ఇప్పుడొకసారి ముందెక్కడో జరిగాయని. ఏమేమో చెప్తుంటారు కానీ…”

నుదుటిమీద చూపుడు వేలికొసతో కొట్టుకున్నాను చూపిస్తున్నట్టు. “ఇందులో ఏం జరుగుతోందో, తను ఏం ఆలోచిస్తోందో, తనకు ఏం కావాలో, ఎవరికి తెలుసు?”

సాధారణంగా ఇవే మాటలు ఇంకెవరితోనైనా చెప్తే, వాళ్ళు మమ్మల్ని ఓదారుస్తున్నామన్న భ్రమలో ఏవేవో మాట్లాడడం మొదలుపెడతారు. నిజానికి ఆ మాటలేవీ నాకు కానీ ప్రియకి కానీ వినిపించనే వినిపించవు. మనసు ముక్కలవుతూ, ప్రాణాలు తోడేస్తుంటే ఎదుటివాళ్ళ శుష్కమైన ఓదార్పు మాటలెవరికి వినిపిస్తాయి? మాకు కావల్సింది మౌనం. మా బాధను అర్థంచేసుకొనే మౌనం. కనీసం మా బాధను మేము అనుభవించడానికి కావలసిన మౌనం. అది ఒకరికివ్వగలిగిన కనీసపు గౌరవం. అది నాకు ఇక్కడ, ఈ ఆకాశం కింద, ఒంటరిగా నా మాటలు వింటూ ఏమీ మాట్లాడకుండా, మౌనంగా వింటున్న ఇతనినుంచి దొరికింది. బహుశా, అదే నన్ను అపరాధిని చేసింది. లేకుంటే, తమ సంతానానికి అద్భుత శక్తులున్నాయనీ, వాళ్ళు దైవాంశ సంభూతులనీ నమ్మని తల్లితండ్రులు ఎవరు? అందుకే అలా చెప్పే తల్లితండ్రులని దూరంగానే ఉంచుతాను కాని, నా అపరాధభావన నన్ను అతన్ని అడిగేలా చేసింది. నాకు అతను చూపించిన గౌరవం నేనూ అతనికి చూపించడానికేనా?

“మీ అమ్మాయి స్పెషల్ అన్నారు కదా. ఏమిటా స్పెషాలిటీ?” అనడిగాను.

చర్లపల్లి ఎందుకో ముందున్నంత ఆసక్తి చూపించలేదు. “వద్దులే సార్, మీరు నమ్మరు.” అని మళ్ళీ నడక మొదలుపెట్టాడు.

“అయ్యో! నమ్మకపోవడం ఏముంది. మీకు తెలీదనుకుంటా. నేను ఇవాళ్టికివాళ, నిప్పులు అమాంతంగా మింగే అమ్మాయిని చూసి వస్తున్నాను!”

అతను నడవడం ఆపి నావంక కళ్ళార్పకుండా, నా ఆత్మలోకి తొంగిచూస్తున్నట్టు చూశాడు. నాకు ఇబ్బందిగా అనిపించింది, నన్ను శల్యపరీక్ష చేస్తున్నట్టున్న ఆ చూపు. అసలే విచిత్రంగా వున్న ఆ సాయంత్రం, అతను చెప్పిన విషయం వింటూ ఇంకా విస్తుపోయాను. ఆ మునిమాపు

చీకట్లో, ఎటునుంచి పడుతున్న వెలుతురో అతని ముఖాన్ని మరింత స్పష్టంగా చూపించింది. ఎండకు కమిలీ వానకు తడిసీ మొరటుబారిన చర్మం. ముఖంలో వయసుకు మించిన ముడతలు. అతను చెప్పింది నిజమా? అదసలు సాధ్యమా? సూటిగా నావైపు చూడకుండా, తడబడుతూ ఏదో నామోషీతో ఒక రహస్యం పంచుకున్నట్టుగా అతను చెప్పడం చూసి అతని మాటలు నమ్మకతప్పలేదు నాకు.

అతను తిరిగి నడవడం మొదలుపెట్టాడు, ఆ బురదమట్టిలో అడ్డంగా పడి. ఒక్క క్షణం ఆగి అతనివెంటే నడిచాను. నిజానికి అది నేను చేసుండాల్సింది కాదు. వెనకకు తిరిగి పరిగెత్తి పారిపోవాల్సింది.

పెంకుటిల్లు. చుట్టూ ఇనుపతీగెలతో చేసిన ప్రహరీ. అతని వెనకే నడిచి, బయట గుమ్మం దగ్గరే మొహమాటంగా ఆగిపోయాను.

"రండి సార్! కూర్చోండి." షూస్ విప్పి గుమ్మం దగ్గరే ఒదిలి లోపలికొచ్చి కూర్చున్నాను. చెక్క కుర్చీలలో దూది, పాతగుడ్డలతో చేసిన మెత్తలు. గోడల మీద పాత ఫోటోలు. అల్మారాలో దేవుళ్ళ బొమ్మలు. గది మధ్యలో లేస్ గుడ్డతో కప్పిన చిన్న టేబుల్ మీద టీవీ. దాని పక్కనే కార్నర్‌లో చెక్క బల్ల మీద ల్యాండ్ ఫోన్.

"ఫోన్ ఆ పక్కనుంది, ఇంటికి ఫోన్ చేసుకోండి సార్. నేను బట్టలు మార్చుకొనొస్తా." అంటూ లోపలికెళ్ళిపోయాడతను.

ప్రియకి ఫోన్ చేశాను.

"రియల్లీ సారీ ప్రియా! ఈ రాత్రికి ఇక్కడ వుండక తప్పేట్టులేదు. బయట్నించి ఏదైనా తెప్పించుకుని తిని నువ్వూ శ్రుతీ పడుకోండి. రాత్రికి వంట పనేదీ పెట్టుకోకు."

“ఇట్స్ ఒకే శేఖర్. ఐ విల్ మేనేజ్. నువ్వు పొద్దున్నే జాగ్రత్తగా రా.”

ప్రియ ఏమనకపోయినా నాకు చాలా గిల్టీగా అనిపించింది. ఆమె గొంతులో వినబడ్డ అలసట బట్టి శ్రుతి ఇవాళ తనని చాలా శ్రమ పెట్టిందని గ్రహించాను. అసలు అలా కష్టపడ్డరోజు, భవిష్యత్తు ఇంకా భయపెడుతుంది. తీరని కష్టం కంటే, ఇక కష్టం ఎన్నటికీ తీరదేమోనన్న భయమే కదా ఎక్కువ బాధపెట్టేది!

“నీకో సంగతి తెలుసా?” ప్రియ గొంతు ఇంతలోనే. “మధ్యాహ్నం తనకు బాల్కనీలో కూర్చోబెట్టి లంచ్ తినిపిస్తూ... నీకు తెలుసు కదా. అది బైట చెట్లనూ పిట్టలనూ మబ్బులనూ చూడడానికి ఇష్టపడుతుందని... చేయి తీసి నా చేతిమీద వేసింది.”

“అవునా?”

గది మూల గోడకు కొట్టిన ఫోన్ షెల్ఫ్ పైన, చుట్టూ చర్లపల్లి కుటుంబం ఫోటోలు.

“యెస్! అయామ్ పాజిటివ్.” అలసటలోనూ ఎక్కడో ఒక చిన్న ఆశాకిరణం తన గొంతులో. కొంత హాయిగా నిద్ర పోగలిగితే బాగుండు తను ఈ రాత్రి.

ఫోన్ పెట్టేసి మళ్ళీ వచ్చి కుర్చీలో కూర్చున్నాను. లోపలనుంచి చర్లపల్లి గొంతు వినిపిస్తోంది. ఇంకెవరిదో ఆడ గొంతు. బహుశా భార్య అయివుండాలి. ఎవరో పిల్లల గొంతులు కలగాపులగంగా. గొంతులు కాసేపటికి సద్దుమణిగాయి. ఆపైన కాసేపటికి ఒక అమ్మాయి, ఒక అబ్బాయి ముందుగదిలోకి వచ్చారు. నన్ను చూసి సిగ్గుగా నవ్వి కొంచెం దూరంగా కూర్చున్నారు. ఆ పిల్లవాడు రిమోట్ తీసుకొని టీవీ ఆన్ చేశాడు. ఇద్దరూ కాసేపట్లోనే టీవీలో వచ్చే పాటల ప్రోగ్రామ్‌లో మునిగిపోయారు. వెనక వంటగదిలోంచి వాసనలు సన్నగా.

నేను ఆ అమ్మాయిని పరికించి చూశాను. మామూలుగానే ఉంది, అందరు పదహారేళ్ళ అమ్మాయిల్లాగే. ఇంతలో చర్లపల్లి ముందుగదిలోకి వచ్చాడు. అదాటున తల తిప్పగానే నన్నే చూస్తూ కనపడ్డాడు. అతని చూపులో నామీద అనుమానమో, చిరాకో, ఏదో కనిపించింది. తొట్రుబాటుతో తల తిప్పుకున్నాను.

ఇంతలో చర్లపల్లి భార్య వచ్చింది. చర్లపల్లి నన్ను పరిచయం చేశాడు. ఆమె నమస్కారం పెట్టి వెంటనే లోపలకు వెళ్ళిపోయింది. మళ్ళీ పిల్లలవైపు చూశాను. ఇద్దరూ నావైపు చూస్తూ ఏదో గుసగుసలాడుకుంటున్నారు. నేను నవ్వి, "భయం అక్కర్లేదు, నాతో మాట్లాడచ్చు." అన్నాను. ఆ అమ్మాయి కొంచెం సిగ్గుపడింది కాని అబ్బాయి కళ్ళు విచ్చుకున్నాయి.

"మీరు టీవీ అంకుల్ కదా? మీ షో మస్తుంటది అంకుల్. నాకైతే భలే ఇష్టం. మా అక్కకు కూడ ఇష్టమే."

"అవునా! మరయితే ఏ ఎపిసోడ్ నీకు బాగా ఇష్టం?"

"ఏదంటే..."

ఇంతలో చర్లపల్లి వచ్చాడు చేతిలో పంచతో, భోజనం రెడీ అంటూ. పంచ వద్దన్నాను, ఎలానూ ప్యాంట్‌తో పడుకోవడం అలవాటయిన ప్రాణం కదా అని.

చర్లపల్లి భార్య మా నలుగురికీ వడ్డించింది. వేడివేడిగా అన్నం, కూరలు. ప్రాణం లేచొచ్చింది. గబగబా నాలుగు ముద్దలు నోట్లో పెట్టుకున్నాను. అందరూ కొంచెం ఇబ్బందిగా మొహమాటంగా ఉన్నట్టనిపించింది. చిన్నగా కబుర్లలోకి దింపాను. కాసేపటికే నేను చూసిన వింతలూ విడ్డూరాలూ కొన్ని చెప్పేసరికి వాతావరణం తేలికయింది. అందరూ హాయిగా రిలాక్స్ అయారు. చర్లపల్లి భార్య కూడా మాట్లాడ్డం మొదలుపెట్టింది.

“ఐతె సారూ! మీ షోలొ కనిపించినాక పైసలిస్తరా?”

“ఆఁ! తప్పకుండా ఇస్తాం.”

“ఎంతిస్తరు సార్?” చర్లపల్లి గొంతులో కుతూహలం.

“వారి ప్రత్యేకతను బట్టి.”

“ఔనా!” చర్లపల్లి భార్య గొంతులో ఆత్రుత.

అప్పటిదాకా అన్నం తింటూ మధ్యమధ్యలో ఆ అమ్మాయిని చూస్తూనే ఉన్నాను. ఏమిటీ ఈ అమ్మాయి ప్రత్యేకత? ఇక ఆ అమ్మాయిని అడగదల్చుకున్నాను ఈ డబ్బు ప్రసక్తి ఎలానూ వచ్చింది కాబట్టి.

“ఏమ్మా! మీ నాన్న నువ్వు స్పెషల్ అని చెప్పారు. ఏంటి అదీ?”

ఆ అమ్మాయి ముఖం ఎర్రబడింది. ఒక్క క్షణం అందరూ మౌనంగా అయిపోయారు.

“అది నేను కాదంకుల్. మా అక్కయ్య.”

కంచంలోకి తలదించుకున్నారు అక్కాతమ్ముళ్ళిద్దరూనూ. చర్లపల్లి, అతని భార్య ఏమీ మాట్లాడలేదు. వీళ్ళకి ఇంకో అమ్మాయుందా? మరి ఎక్కడా కనబడదేం? అతని వంక అయోమయంగా చూశాను. అతను ఇబ్బందిగా నవ్వాడు.

“అవును సార్! అది నా పెద్దకూతురు. మీరు అన్నం తినండి. తర్వాత చూపిస్త గద.” భార్యాభర్తలిద్దరూ ఒకరినొకరు చూసుకున్నారు ఒక్క క్షణంపాటు.

బ్యాటరీ లాంతరు పట్టుకొని ఆమె, వెనుకగా అతను. అతని వెనకాలే నేను. ఇంటికి వెనక విడిగా ఒక యాభై గజాల దూరంలో ఒక రేకుల షెడ్. సిమెంట్ పూతలేని ఇటుకుల గోడలు. ఒక ఇనుప తలుపు.

పేరుకి షెడ్ అన్నమాటే కానీ, చిన్న గదిలా మార్చారు. పడుకునే మంచమూ, పక్కనే ఒక చిన్న బల్లా కూడా వున్నాయి. శుభ్రంగా వున్నా షెడ్డంతా తుప్పు వాసన. ఒకప్పుడు అది గొడ్ల కొట్టం అయుండాలి. మంచం మీద ఒకమ్మాయి, బహుశా పంతొమ్మిదేళ్ళుంటాయేమో, ఏదో పుస్తకం చదువుకుంటూ కూర్చొని వుంది. మమ్మల్ని చూసి తలెత్తి నవ్వింది. మొహంలో బాల్యం వల్ల వచ్చిన ప్రశాంతతత ఇంకా మిగిలే వుంది. ఆ అమ్మాయి ఒక కాలికి ఇనప కచ్చడం, దాని నుంచి గొలుసు, ఆ గొలుసు రెండవ కొస గోడలో ఉన్న కొక్కెంలోకి తాళం వేయబడి ఉన్నాయి. కానీ ఆ అమ్మాయికి ఇదేమీ పట్టినట్టు లేదు. నా చూపు గమనించి చర్లపల్లి అన్నాడు. “చెప్పిన కద సారూ, బిడ్డ కొంచెం స్పెషలని.”

“బిడ్డా! అంకుల్‌కి నీ మేజిక్ చూపిస్తవారా?” కూతురితో అన్నాడు.

“బాపూ! ఇది మేజిక్ గాదు.” చిరాగ్గా అంది తను. అది చిరాకు కాదు. చెప్పీ చెప్పీ విసిగిపోయి వేసారిన గొంతు అది.

చర్లపల్లి నావంక చూసి ఇబ్బందిగా నవ్వాడు. “బిడ్డ అలసిపోయింది సార్,” ఆమె వైపు తిరిగి, “సరె సరె. మేజిక్ కాదు గాని నువ్వు చేసేది ఈ సార్‌కు చూపియ్యి ఒక్కసారి.” వొంగి ఆమె కాలికున్న గొలుసు తాళం తీశాడు.

“బాపూ, నువ్వే గదనె ఎవరికీ చూపించద్దన్నది.”

“లేదు బిడ్డా! ఈ అంకుల్ మంచోడు. ఆయనకు అర్థమైతది. మనకు సాయం చేస్తడు.”

నా వైపు చూసిందా అమ్మాయి. ఊపిరి బిగబట్టి తనవైపే చూశాను. అమ్మాయి సన్నగా ఒక నవ్వు నవ్వి, మెల్లగా చేతులు సాచి నెమ్మదిగా నేలని తన్ని పైకి లేచింది గాలిపటంలాగా. అలాగే నవ్వుతూ నా వంక చూస్తూ గోడల పక్కగా హాయిగా పైకి ఎగురుతూ... తేలిగ్గా ఒక దేవతలాగా తేలుతూ అలాగే మెల్లగా గది పై కప్పుదాకా ఎగిరింది. పై కప్పు దగ్గరకు రాగానే, చేయి ఎత్తి కప్పును నెట్టి ఆ ఊతంతో మళ్ళీ మెల్లగా కిందకు రాబోయింది. కానీ మళ్ళీ తేలసాగింది. చర్లపల్లి ఇంతలో ఎగిరి ఆ అమ్మాయి కాలు పట్టుకొని కిందకు లాగాడు. పట్టుకుని పడవను ఒడ్డుకు కట్టేసినట్టు, ఇనప కచ్చడంతో ఆ అమ్మాయి కాలిని మంచానికి కట్టేశాడు. అసలు నా కళ్ళు నేనే నమ్మలేకపోయాను.

“ఎన్నాళ్ళబట్టి జరుగుతోంది ఇలా?” అడిగాను.

“రెండు నెలల్నించి సార్.” జవాబిచ్చాడు. కూతురి భవిష్యత్తు గురించి కొంచెం బెంగ కనిపించినా, అతని గొంతులో గర్వం కూడా తొంగిచూసింది. ఆ అమ్మాయిని పడుకోబెట్టి దుప్పటి కప్పి, తల నిమిరి చర్లపల్లి అతని భార్య బయటకు నడిచారు.

***********

అర్ధరాత్రయింది. అందరూ నిద్రపోతున్నారు. ఎక్కడా అలికిడి లేదు. చర్లపల్లి కుటుంబం అంతా పక్కగదిలో పడుకోనున్నారు. ముందుగదిలో నాకు పక్క వేశారు. అందరూ పడుకున్నారు అని నిశ్చయించుకున్నాక, ఫోను పక్కన తగిలించిన తాళాలు తీసుకొని చిన్నగా లేచి బయటకొచ్చాను. చెప్పులు కూడా వేసుకోకుండా అలానే నడుచుకుంటూ షెడ్ దగ్గరికి వెళ్ళి జాగ్రత్తగా తలుపు తీసి లోపలకి వెళ్ళాను.  ఆ అమ్మాయి ఇంకా నిద్రపోలేదు. పుస్తకం చదువుకుంటూ అలానే ఉంది. నేను లోపలికి రాగానే ఆ అమ్మాయి తలెత్తి నన్ను చూసింది. ఏమీ మాట్లాడలేదు. ఏ శబ్దమూ చేయలేదు. తన చూపులో ఆశ్చర్యం లేదు. నేనేం చేయబోతున్నానో తనకు ముందే పూర్తిగా తెలిసిన చూపు అది. కొందరు ఆడపిల్లలు అంతే, వారికన్నీ తెలిసిపోతాయి.

మెల్లిగా తన కాలికున్న కచ్చడం విప్పదీశాను. ఆ అమ్మాయి మంచం మీద ఉన్న చున్నీ తీసి కప్పుకుంది. తనను రెండుచేతులతో ఎత్తుకొని బైటకు తీసుకొచ్చాను. నా మెడ మీద ఆ అమ్మాయి ఊపిరి వెచ్చగా, నమ్మకంగా తగిలింది. ఆమె పలచటి చెంప నా భుజం మీద ఆనుకొని. షెడ్‌లోంచి ఆరుబయటకు ఇంటికి కొంత దూరంగా తీసుకొని వచ్చాను. ఇంకా దూరం తీసుకువెళదామనుకున్నాను కాని ఆ అమ్మాయి బరువో, లేక నా అలసటో నన్ను అంతదూరం పోనీయలేదు. ఆ అమ్మాయిని నేల మీద దించి పట్టుకున్నాను. తీగ మీద నిలబడ్డట్టు తడబడి సర్దుకొని నా చేయి పట్టుకొని తమాయించుకుంది, కొద్దిగా నవ్వుతూ.

"నాకు భయంగా ఉంది."

"ఎందుకమ్మా, నీకు ఏ భయమూ అక్కర్లేదు."

పిండారబోసినట్టు పండు వెన్నెల. ఏ కల్మషమూ లేకుండా నక్షత్రాలతో నిండిపోయిన ఆకాశం. తన చేతి పట్టు కొద్దిగా సడలించాను. కొంత దూరం జరిగి తనూ కొద్దిసేపటికి నా చేతిని కొంత వదిలివేసింది. దూరంగా ఏవో జంతువులు కదులుతున్న ఊహ లీలగా. ఒక్క క్షణం ఆ అమ్మాయి అరుస్తుందేమో, భయపడుతుందేమో, ఏడుస్తుందేమో, అమ్మానాన్నలను పిలుస్తుందేమో అనుకున్నాను. కానీ, అవేమీ చేయలేదు. నన్ను చూసి చిన్నగా నవ్వింది. కాసేపటికి, "సరే వెళతా!" అన్నది.

మెల్లిగా తన చేయి ఒదిలిపెట్టాను. తనూ నన్ను ఒదిలిపెట్టింది. చిన్నగా నా కళ్ళముందు నుంచే తన తల, తన శరీరం, తన కాళ్ళు తేలిపోయాయి గాలిలోకి. ఆపుకోలేని ఆనందంలో పెద్దగా నవ్వబోయి తన నోటికి చేయి అడ్డం పెట్టుకుంది. ఆపైన రెండు చేతులూ సాచి అలా తేలిపోసాగింది. నిజానికి ఆమె నేలకు దూరం అయిపోవడం కాదు, ఈ నేలే తననుంచి తన కాళ్ళ కిందనుంచి పడిపోతున్నట్టుగా అనిపించింది నాకు. ఆ అమ్మాయి అలా తేలిపోవడం

చూస్తూ ఎప్పుడు నా కళ్ళల్లో నీళ్ళు నిండాయో, ఎప్పుడు అవి ఆగకుండా కారిపోసాగాయో నాకు తెలియనే లేదు. తను చివరిసారిగా నన్ను చూసి చేయి ఊపింది.

ఇంతలో ఇంట్లో లైట్లు వెలిగాయి. చర్లపల్లి, అతని భార్య నావైపు పరిగెత్తుకుంటూ వచ్చేసరికే ఆ అమ్మాయి అందనంత ఎత్తుకు ఎగిరిపోయింది.

వెనకనుంచి వినిపిస్తున్న తిట్లకు నేను పారిపోయి ఉండాల్సింది. కానీ, అక్కడే నిలబడి పైపైకి ఎగిరిపోతున్న ఆ అమ్మాయికి ఈ ప్రపంచం ఎలా కనిపిస్తుందో ఊహించడానికి ప్రయత్నించాను. ఆమె తన ఇల్లు, ఆ షెడ్, ఆ పొలాలు, దూరంగా చెట్లు, అవన్నీ చూస్తున్నదా? తన తల్లీ తండ్రీ పెడుతున్న పెడబొబ్బలు, నన్ను తిడుతున్న తిట్లు, వింటున్నదా? తన తండ్రి ఏడుపుతోపాటు అనంతాకాశం చెప్తున్న రహస్యాలూ వింటున్నదా? దూరంగా కింద నేల మీద ఒక మనిషిని ఇంకొక మనిషి పిడిగుద్దులు గుద్దడం, ఈ గోల చూసి అరుస్తూ అటు ఇటూ కదులుతూ కుక్క ఒకటి ఎగబడడం తనకు కనిపిస్తున్నదా?

క్రమక్రమంగా కింద నేలమీద అరుపులూ కేకలూ పిడిగుద్దులూ అన్నీ ఆగిపోయాయి. అందరూ అన్నీ ఆపేసి ఆకాశంలోకి చూస్తూ నిలబడిపోయేరు. రానురానూ చిన్నగా అవుతూ చివరికి కంటికి కనిపించనంత నలుసులాగా అయిపోయాక అందరూ అలా...

ఆ అమ్మాయి చివరకు అన్ని బంధాలు తెంచుకొని పూర్తిగా విముక్తురాలయింది.

(ప్రేరణ: A Lovely and Terrible Thing– Chris Womersley.)

************

*రచయిత పరిచయం : క్రిస్ వోమర్స్లీ - ప్రముఖ ఆస్ట్రేలియన్ రచయిత వోమర్స్లీ కథా రచనా, కవితా రచనలోనూ సిద్ధహస్తులు. ఆయన రచించిన నవలలు మైల్స్ ఫ్రాంక్లిన్ అవార్డుతో సహా పలు అవార్డులు గెల్చుకున్నాయి. రేడియో జాకీగా పని చేసిన ఈయన ప్రపంచమంతా పర్యటించారు. ఆయన ప్రస్తుతం మెల్బోర్న్ నగరవాసి.*

# కలలు రాని నిద్ర

(జూలై 2022- ఈ మాట )

(బార్బరా బేంటన్)

రైలు స్టేషన్లోకి వచ్చి ఆగింది. చీకటిలో దాక్కున్న చెట్లనుంచి రాలి పడిన తడి ఆకులు, గాలికి ఎగిరిపడి వెళ్ళి రైలు పెట్టెలకు అతుక్కుపోయాయి. స్టేషన్ మాస్టర్ చేతిలో వున్న లాంతరు పైకెత్తి ఒక్కొక్క డబ్బాలోకి చూస్తూ స్టేషన్ పేరు గట్టిగా అరిచి చెప్తున్నాడు. అతనికి వచ్చిన సమాచారం ప్రకారం ఈ రైల్లో ఒకే ఒక్క పాసెంజరు రావాలి.

ఆ వొక్క పాసెంజరూ దిగగానే, ఆమె దగ్గర టికట్టు తీసుకొని లాంతరు పైకెత్తి ఆమె మొహం లోకి చూశాడు. ఆమె కూడా అతని మొహంలోకి చూసి, అతని గొంతు గుర్తు చేసుకోవడానికి ప్రయత్నించింది. ఒకప్పుడామెకి ఈ స్టేషన్లో అందరూ తెలిసినవాళ్ళే. స్టేషన్ మాస్టర్కి కూడా ఈ వూరి వాళ్ళందరూ బాగా పరిచయం. ఈమెని మాత్రం ఎప్పుడూ చూసిన జ్ఞాపకం రాలేదతనికి.

తన ఉత్తరం ఇంటికి చేరి వుంటే స్టేషన్ బయట తన కోసం ఎవరైనా గుర్రబ్బండిలో ఎదురు చూస్తూ వుండి వుండొచ్చు, అనుకుందామె ఆశగా. స్టేషన్ బయటకు వచ్చింది. అనాథలా ముడుచుకొని వణుకుతూ పడుకుని ఉన్న ఒక కుక్క తప్ప ఇంకేమీ కనిపించలేదు. వీధి చివరివరకూ చూపు సారించి చూసింది. మనుషుల అలికిడి లేదు కాని, నది ఒడ్డున వున్న చెట్లలోంచి దూసుకొస్తూ గాలి గుయ్యిమంటోంది. ఊరంతా నిద్రపోతున్నట్టుంది. ఒకవేళ స్టేషన్ మాస్టర్ దగ్గర తనకోసం వచ్చిన సందేశం ఏదైనా వుందేమో! ఆమె మళ్ళీ స్టేషన్ లోపలికి నడిచింది. ఆఖరి రైలు వెళ్లిపోయింది కాబట్టి ఆఫీసుకి తాళం పెట్టి ఇంటికి బయల్దేరే ప్రయత్నంలో వున్నట్టున్నాడు స్టేషన్ మాస్టర్. ఆమె వంక ప్రశ్నార్థకంగా చూశాడు. అంటే అతని దగ్గర తనకోసం ఏ సందేశమూ లేదన్నమాట. వచ్చిన తరవాత ఏదో అడగాలి కాబట్టి టైం ఎంతయిందని అడిగిందామె.

మళ్ళీ స్టేషన్ బయటికొచ్చి, చలికి వొణుకుతూ కోటుని దగ్గరగా లాక్కుంది ఒంటి చుట్టూ. గాలికి వాన కూడా తోడైంది, కానీ ఆమె దగ్గరవున్న చిన్న గొడుగు గాలి ధాటికి తట్టుకోలేక ఓటమి ఒప్పుకుంది. చీకటీ, గాలీ, వానా ఆమె ముందు అనంతంగా పరుచుకొని, ఆమెని కొంచెం భయపెట్టాయి. అక్కణ్ణించి తన వూళ్ళోకి వెళ్ళాలంటే మూడు మైళ్ళు డొంకదారిలో ఈ వానలో నడవాలి. అయినా తను పుట్టి పెరిగిన ఊరు ఇది. తనకు అంగుళం అంగుళం తెలుసు.

నిద్రపోతున్న వీధిలో, చివరి దాకా ఎటువంటి సవ్వడీ లేదు. వీధి చివర ఒక దుకాణంలో చిన్న దీపం వెలుగుతుంది, చిన్నగా సమ్మెటలతో మోదుతున్న చప్పుడు. ఇవాళ వాళ్ళు రాత్రంతా పని చేస్తారు, ఆమె గుర్తు చేసుకుంది. ఎవరికోసం పని చేస్తున్నారో అంత శ్రమ పడుతూ? తనకు తెలుసా వారెవరో? చీకట్లో ఇప్పుడు తన నడక గుర్తొచ్చి ఆమె గబగబా ముందుకు నడిచింది. ఆమె నడుస్తున్న బాట ఒంకర టింకరగా తిరిగి మళ్ళీ రైలు పట్టాల దగ్గరకొచ్చింది. క్షణం సేపు నిలబడి, గాలినీ వాననీ చీల్చుకుంటూ పరుగు తీస్తున్న రైలు వైపు చూసింది. నిప్పుకళ్ళ రైలు వాన నీటిని ఉమ్మేస్తోంది. పరుగెడుతున్న రైలు వేగం చూసి ఆమెకి నిదానంగా భారంగా సాగబోయే తన ప్రయాణం గుర్తొచ్చి చాలా అలసటగా అనిపించింది.

రైలు వెళ్ళిపోగానే ఆమె నడక వేగం పెంచింది. తుఫాను ముందరిలాటి బరువైన నిశ్శబ్దం వేలాడుతుంది గాలిలో. పైన చెట్టు కొమ్మ మీద పక్షి తన కూనలతో ఏవో జాగ్రత్తలు చెప్తూ వుంది. గాలీ, వానా చూసి బెదిరిన కూనలు అమ్మ రెక్కల కింద మరింతగా ఒదిగిపోయాయి. ఆ కువకువలకి ఆమెకి తన బాల్యమూ, దాంతో పూర్తిగా ముడిపడ్డ కన్నతల్లి గుర్తొచ్చింది. ఎవరికైనా బాల్యమంటే అమ్మేగా మరి!

చుట్టూ ఎంత చీకటి వుంటేనేం, తోవ ఎంత పొడుగు వుంటేనేం, ఆ చివర్న అమ్మ వుంటే, అనుకుందామె. ఆమె మనసులో భయాలన్నీ వీడిపోయి, మొహం లోకి నవ్వు తోసుకొచ్చింది.

తనని చూడగానే అమ్మ మొహంలో ఒచ్చే నవ్వూ, సంతోషమూ గుర్తొచ్చాయామెకి. ఆ సన్నివేశాన్ని ఊహించుకుంది. అమ్మ చేతులు జాపి పరిగెత్తుకుంటూ ఒస్తుంది.

"చిన్నారీ!"

"అమ్మా!" తను ఆమె వెచ్చటి కౌగిట్లోకి ఒరిగిపోతుంది. అమ్మ పెట్టే ముద్దుల తడి ఆమె చెంప మీద అప్పుడే పడినట్టనిపించింది ఆమెకి. అసంకల్పితంగా ఆమె అడుగులు చకచకా పడ్డాయి. కొంచెం దూరం దాదాపు పరిగెత్తింది. కానీ ఎదురుగాలి ఆమెను ఎక్కువ దూరం పరిగెత్తనివ్వలేదు. ఆయాసంతో ఒగర్చుకుంటూ కొద్దిసేపు నిలబడిపోయిందామె. ఎవరో ఆమెలోని పాపాయిని, తల్లినీ ఒకేసారి నిద్ర లేపినట్టనిపించింది. ఏదో చెప్పలేని సంతోషంతో మోకాళ్ళ మీద కూలబడిపోయి మొహాన్ని ఆకాశం వైపు తిప్పి దేవుడితో సంభాషణ మొదలుపెట్టింది. ఉన్నట్టుండి ఒక మెరుపు దేవుడి స్పర్శలా ఆమె ముఖాన్ని తడిమి ఆమెను స్పృహలోకి తెచ్చింది.

మళ్ళీ అడుగు ముందుకేసింది. నాలుగడుగులు వేయగానే ఏదో అనుమానం ఒచ్చి ఆగింది – తను నడుస్తోంది సరైన దార్లోనేనా! చీకట్లో దారి తప్పలేదు కదా! నిలబడి కాసేపు ఆలోచించింది. అక్కడ, పక్షులున్న చెట్టు కింద దారి రెండుగా చీలిపోతుంది. అందులో ఒకటి ఇంటికెళ్ళేదారి. రెండోది ఎవరూ వాడని మట్టి దారి. ఒకప్పుడు అది ఎద్దుబళ్ళ కూడలికి తీసికెళ్ళేది. ఇప్పుడక్కడేమీ లేదు. రైలు వచ్చి ఆ బళ్ళను మింగేసింది. ఆమె కొండగుర్తులకోసం మెదడు మూలమూలా వెతికింది. రెండు గుర్తులు ముందు గుర్తొచ్చాయి. తమ ఇంటికెళ్ళే దారిలో 'వంకర చెట్టు' వుండాలి. దాని తర్వాత పెనవేసుకున్నట్టున్న రెండు చెట్లు, 'అక్కాచెల్లెళ్ళు' గాలి వీచినప్పుడల్లా మాట్లాడుతున్నట్టుండేవి. ఆ రెండు చెట్లనీ చూసిందా? ఏమో! గుర్తు రాలేదు. రెండో దారి ఏరు వెంటే పోతుంది. దారంతా సరుగు చెట్లూ, పైన్ చెట్లూ వుంటాయి. ఏటిగట్టున బారుగా ఆపిల్ చెట్లు, వాటితోపాటే ఆవుల మందలూ

ఉంటాయి. ఒక పెద్ద మెరుపు వెలుగులో ఆమెకి తానున్న దారి తప్పిందని తెలిసిపోయింది. నిట్టూర్చి వెనుదిరిగింది. కొంచెం సేపు మళ్ళీ ఆ పైన్ చెట్ల మధ్య గాలివానలో నిలబడింది. మళ్ళీ తిరిగి అడవికి అడ్డంగా నడక సాగించింది.

ఆ చీకట్లో, గాలివానలో, ఏదో తెలియని భయం జొరబడింది ఆమె గుండెలో. చేతులు జాచి చుట్టూ వున్న గాలిని తడుముతూ మెల్లిగా అడుగులేసింది. కాళ్ళకి ఏదో మెత్తగా అడ్డు పడింది. ఉలిక్కిపడి తడిమి చూసింది. ఒకటి, కాదు, బోలెడు ఆవులూ, దూడలూ. వానకి అక్కడ ఆపిల్ చెట్ల కింద తలదాచుకున్నట్టున్నాయి. మెల్లిగా లేచి నిలబడి సర్దుకుని మళ్ళీ నడవడం మొదలుపెట్టింది. మళ్ళీ మెల్లిగా ఆ పక్షులున్న చెట్టు వైపుకు నడిచింది.

ఈ దారి వెంబడి నడిస్తే కొంచెం దూరంలో 'వంకర చెట్టు' కనిపించాలి. అక్కడ ఒకసారి ఒక గుర్రం బెదిరి పరుగులు తీస్తూ తననెక్కిన రౌతును ఆ వంకర చెట్టుకి గుద్దేసింది. అతను పాపం అక్కడే చనిపోయాడు. ఆ తరవాత చాలా రోజులు తనకా చెట్టుని చూస్తే ఏదో భయంతో కూడిన ఆకర్షణ కలిగేది. ఉన్నట్టుండి మెరిసిన మెరుపులో ఆమె ఆ చెట్టును చూసింది. తను సరయిన దారిలోనే ఉంది. కాని, భయంతో అడుగు ముందుకు పడలేదు. చిన్నప్పటి భయం ఆమెను నిలువరించింది. ఆ వెలుగులో ఆమెకి తనవైపెవరో గుర్రంతో దూకుతున్నట్టు భ్రాంతి కలిగి ఒళ్ళు జలదరించింది. మెరుపు-మెరుపుకీ మధ్య వున్న చీకటి విరామంలో, గాలి రొదని మించి ఎవరో పెద్ద కేక పెట్టినట్టనిపించింది. మళ్ళీ పిడుగు పడ్డ శబ్దం. "దేవుడా! నన్ను రక్షించు." కన్నీళ్ళతో కనపడని భగవంతుణ్ణి వేడుకొందామె.

భయంతో పీచుపీచుమంటున్న గుండెని చిక్కబట్టుకుని మళ్ళీ అడుగులేసింది. కొంత దూరం తరవాత ఆ బాట ఏటివైపుకు దిగుముఖం పట్టింది. ఏటి వొడ్డునంతా ఆపిల్ చెట్లు. ఏరు హోరుతో తన్ని పారుతోంది, వరదనీళ్ళతో. ఏరు దాటి వెళ్తేగాని తన వూరు చేరుకోలేదు. అది దాటటానికి ఒక చెక్క వంతెన వుండాలి. ఆమె చీకట్లో వంతెన కోసం వెతకసాగింది.

అవతలి ఒడ్డున తనకోసం ఎవరైనా ఎదురు చూస్తూ వుంటే ఎంత బాగుండు! అని ఆశపడ్డదామె. తను క్రితం సారి వచ్చినప్పుడు, ఆ రాత్రి వాతావరణం నిర్మలంగా వుండింది. స్టేషన్ దగ్గరకి పక్కింటి అబ్బాయి వొచ్చినా, కాలువ వొడ్డున అమ్మ లాంతరు పట్టుకొని నిలబడి వుంది.

చెక్క వంతెన మసక చీకట్లో లీలగా కనిపించింది. దారి ఆ వంతెన వైపుగా సాగింది. ఆ చెక్క వంతెన రెండు గట్ల మీదా ఉన్న విల్లో చెట్లకు కట్టేసి ఉంటుంది, నీళ్లకు పైగా. కానీ ఇప్పుడది నీటిలో ఉంది. తను నీళ్ళలోకి దిగక తప్పదు. తలెత్తి చూసింది. ఆకాశం దిగులుగా నల్లగా కనిపించింది. స్థిరంగా ఉన్న ఆమె తెల్లటి మొఖంలో తప్ప ఎక్కడా వెలుగనేది లేదు. ఆ వంతెన మీదికి అడుగేసేముందు ఆమెకి ఒక్క క్షణం తననెంతో ప్రేమించే భర్తా, కూతురూ గుర్తొచ్చారు. మనసంతా నీరైనట్టయింది. ఆమెకి వంతెన మీదకి అడుగేసే ధైర్యం రాలేదు. కానీ, అంతలోనే తన కోసం కాచుకొని కూర్చున్న తల్లి గుర్తొచ్చింది. ఆ జ్ఞాపకం ముందు వాళ్ళని విడదీసిన బంధాలన్నీ కురచగా అనిపించాయి. ఆపదలతో నిండిన ఈ ప్రయాణం బహుశా తన పశ్చాత్తాపము, ప్రాయశ్చిత్తమూనా?

మళ్ళీ ఆకాశం వైపు తలెత్తి చూసింది. అమ్మ ఎప్పుడూ చేసే ప్రార్థన గుర్తొచ్చింది. “దీవించు, క్షమించు, రక్షించు, దారి చూపు, ధైర్యమివ్వు, బలమివ్వు”.

తనూ అదే ప్రార్థన చేసి, గాలినీ వాననీ ఎదుర్కోవడానికి పెదిమలు బిగించి ఆ చెక్క వంతెన మీద కాలు పెట్టింది. నీరు ముందు మడమల దాకా వచ్చింది. కాలువ వొడ్డున విల్లో చెట్ల కొమ్మలు వంతెన మీదకి వాలి వున్నాయి. గాలికి తను కొట్టుకొని పోకుండా వుండటానికి ఆ కొమ్మలను ఫూతంగా పట్టుకుందామె. ఎగిరిపోతున్న టోపీని గురించి పట్టించుకోలేదు. కోటును మాత్రం వీలైనంత దగ్గరగా జరుపుకొని అడుగులేయసాగింది. కొంచెం దూరం తరవాత వంతెన పైన నీటి మట్టం పిక్కలదాకా పెరిగింది. ఆసరాగా పట్టుకున్న కొమ్మల

అంచులోకి వచ్చింది. బహుశా తను వొంతెన మధ్యకొచ్చి వుండాలి. ఇంకో రెండడుగులేస్తే ఇక ఈ కొమ్మలు అందవు.

అక్కడ నిలదొక్కుకొని, ఏ ఆసరా లేకుండా నాలుగడుగులు వేయగలిగితే అటువైపు వున్న చెట్ల కొమ్మలందుకోవచ్చు. కాని, గాలికి విరబోసుకున్న జడల్లా ఊగుతున్నాయవి. అందుకోవడం కష్టం. వాటి ఆసరాతో అవతలి ఒడ్డు చేరుకుంటే ఇల్లు చేరుకున్నట్టే. వెనక్కి తిరిగి వెళ్ళిపోయే ప్రసక్తి మాత్రం లేదు. నీటి చప్పుడుకి, గాలి వేగానికీ మతి పోతున్నట్టు వున్నా సరే. అసలు అమ్మని చూడడానికి చాలా యేళ్ళ కిందటే రావాల్సింది. ఇంత కాలం అమ్మని చూడడానికి ఒక్కసారి కూడా రాకపోవడమే ఒక పాపం. తనకీ మాత్రం శిక్ష పడాల్సిందే!

ఆమె శక్తినంతా కూడ దీసుకొని అడుగు వెనక అడుగు వేసుకుంటూ ముందుకే నడిచింది. వంతెన మధ్యకి వచ్చేసరికి, నీటి మట్టమూ, వేగమూ పెరిగింది. పోనీ ఈ చెట్టు కొమ్మలని వొదిలేసి నీళ్ళల్లో కొట్టుకుపోతే, అనుకుంది ఒక్కసారి విరక్తిగా. మళ్ళీ మనసు దిటవుచేసుకొని చేతిలో వున్న కొమ్మల చివర్లను మరింత ఒడిసి పట్టుకుంది. బలంగా వూపిరి పీల్చుకొని, చిన్నప్పటిలా “అమ్మా!” అని అరిచింది.

చెట్టు కొమ్మలు పలచబడడంతో అడ్డులేని గాలి ఆమెని ఈడ్చి కొడుతూ వుంది. ఎంత అవస్థ పడ్డా అవతలి వైపు చెట్టు కొమ్మలందట్లేదు. నిరాశతో దుఃఖం వొచ్చిందామెకి. మళ్ళీ శక్తి కూడదీసుకొని చెట్టు కొమ్మలందుకునేంతలో గాలి వాటిని విడిపించింది. ఆమె పట్టులోంచి జారిపోయిన చెట్టు కొమ్మలు ఆమె మొహాన్ని గాలి విసురుకు కొరడాలలా కొట్టాయి. గాలి, చెట్టు కొమ్మలూ కలిసి ఆమె గొంతుకు ఉరి బిగించాయి.

కాలవకి రెండు వైపులా ఆ చెట్లని నాటింది అమ్మే! తనే వాటిని నీళ్ళు పోసి పెంచింది. ఇప్పుడు వాటికి తన మీద ఎందుకింత కోపం? ఆమె గాలితో పెనుగులాడుతూ నిలబడ్డంతసేపూ, నీటి మట్టం పెరుగుతూనే వుంది. నీటి చల్లదనం కంటే గాలి హోరు పిచ్చెక్కిస్తూ వుంది. విల్లో చెట్ల కొమ్మలు పిచ్చిగా ఊగుతున్నాయి. రెండడుగులు. రెండంటే రెండే అడుగులు వేయగలిగితే

మళ్ళీ చెట్ల కొమ్మలు దొరకపుచ్చుకోవచ్చు, ఆశగా అనుకుందామె, జారి పడిపోకుండా నిలబడడానికి విశ్వప్రయత్నం చేస్తూ.

"అలాగా?" గాలి వికటంగా అరిచింది. ఒక పెద్ద గాలి వీచి ఆమెని అమాంతంగా లేవనెత్తి నీళ్ళలోకి విసిరేసింది. ఏ ఆధారమూ లేక ఆమె చిన్న బొమ్మలా ఎగిరి నీళ్ళలో పడింది. ఆమె పెద్ద కోటు నీళ్ళలో తెరచాపలా తెరుచుకుంది.

ఇక అన్ని ఆశలూ వొదిలేసుకున్న ఆ క్షణం ఆమెకి భర్త కోసం తను రాసి బల్ల మీద పెట్టిన వుత్తరం గుర్తొచ్చింది. అదే ఆఖరి వుత్తరమా? అప్రయత్నంగా పక్కనే తేలుతున్న విరిగిపోయిన చెట్టు కొమ్మని పట్టుకుంది. గట్టిగా అరుద్దామని నోరు తెరిచింది. కానీ, నోట్లోకి నీళ్ళు పోయి ఆమె గొంతులోంచి ఎటువంటి శబ్దమూ రాలేదు. ఇక ఆమె నిర్లిప్తంగా అన్నీ విధికి వొదిలేసింది. నీళ్ళు ఆమెని కొంతదూరం తమతో లాక్కెళ్ళాయి. అలసటతో ఆమెను ఏదో మగత కమ్మింది.

ఉన్నట్టుండి 'వంకర చెట్టు' పెట్టిన కేక గాలిని చీల్చుకుంటూ వచ్చింది. దానితోపాటే ఎవరిదో తీయని కంఠ స్వరం కలలోలా "చిన్నారీ" అని పిలిచినట్టనిపించింది. అంతదాకా ఎదురు లేకుండా చెలరేగిన గాలి అక్కడితో నీరసించిపోయినట్టు వేగం తగ్గిపోయింది. గాలికీ ఆమెకీ మధ్య వంకర చెట్టు అడ్డుగా నిలబడి గాలి దౌర్జన్యానికి ఎదురెళ్ళింది. ఎవరివో రెండు బలమైన, వెచ్చటి చేతులు ఆమెని ఎత్తుకెళ్ళినట్టనిపించింది. ఆ నిస్సత్తువలో కరిగిపోతూ, "ఇంతసేపూ నేను యుద్ధం చేసింది నా స్నేహితులతో కాదు కదా" అనుకుందామె కళ్ళు మూసుకుంటూ. అంతవరకూ గంగవెర్రులెత్తించిన గాలి ఆమెకి జోల పాడసాగింది.

ఒడ్డున కూలిపోయి, నీళ్ళలోకి ఒరిగిపోయిన ఒక మహావృక్షం నీటితో, "ఇక్కడితో నువ్వాగిపోవాలి" అని ఆజ్ఞాపించినట్టు, నీరు ఎంత ప్రయత్నించినా ఆమెని ఆ మహావృక్షం నించి తప్పించలేకపోయింది. విరిగిపోయిన చెట్టు కొమ్మ ఒకటి ఆమె కోటుని కొక్కెంలా

పట్టుకొని నీటి ఆటలేమాత్రం సాగనివ్వలేదు. వెచ్చటి చెట్టు చేతుల రక్షణ కవచం నించి ఆమెని తప్పించలేక నీటి ప్రవాహం తోక ముడుచుకొని వెనుదిరిగిపోయింది.

మెల్లిగా కొద్ది క్షణాలు ఆ భద్రతలో సేద తీరిందామె. మెల్లిగా శక్తి కూడగట్టుకొని చెట్టు మొదటికి చేరుకుంది. ఒడ్డుకి చేరుకున్న ఆమె గొంతులోంచి ఆనందంతో చిన్న కేక! ఇది తమ ఒడ్డే మరి! ఇప్పటిదాకా పడ్డ కష్టాలన్ని మటుమాయమైపోయాయి. ఇక్కణ్ణించి తమ ఇల్లెంతో దూరం లేదు. ఇంట్లో లాంతరు వెలుగు కనపడుతూంది కూడా.

సంతోషంతో చక చకా అడుగులేసింది, కానీ పరిగెత్తలేదు. మాతృత్వం ఆడదానికి తనని తాను రక్షించుకోవడం అసంకల్పితంగా నేర్పుతుంది. మళ్ళీ గాలీ వానా మొదలైనా, ఈసారి ఆమె వాటిని పట్టించుకోలేదు. దూరంగా ఇంట్లోంచి కనిపించే చిన్నపాటి వెల్తురులో ఆమె భయాలన్నీ పారిపోయాయి. ఇంటికి వెళ్ళి ఇదంతా అమ్మతో చెప్పాలి. గాలి వానలో తను అమ్మ గొంతు విన్న విషయంతో సహా. అమ్మ నవ్వుతుంది. తన తడి జుట్టు తుడుస్తూ, “చిన్నారీ! అదంతా కల! నడుస్తూనే కల కన్నావా?” అని వేళాకోళం చేస్తుంది. అమ్మ మాత్రం, ఎన్ని కలలు కనేదనీ!

ఇల్లు చేరుకుందామె. గేటు చలికీ వానకీ బిగుసుకుపోయినట్టుంది, అతి కష్టం మీద తెరుచుకుంది. కిందటి సారిలా అమ్మ గేటు తెరిచి వుంచలేదు. బహుశా తన వుత్తరం అందనట్టుంది. కిటికీ సందుల్లోంచి సన్నని వెలుతురు కనపడుతోంది. కుక్క మొరుగుతూ వున్నా ఎవరూ తలుపు దగ్గరికి రాలేదెందుకో. అసలు లోపల అమ్మకి కుక్క మొరగడం వినిపిస్తూందా! ఇంత హోరుగా ఈ నీటి చప్పుడేమిటి ఇంట్లో!

అప్రయత్నంగా ఆమె ఆ చప్పుడేమిటో కనిపెట్టింది. మళ్ళీ నీళ్ళ టాంకు నిండిపోయి పొంగి పారుతోంది మొక్కల్లోకి. అమ్మ గరాటును రెండో టాంకులోకి ఎందుకు తిప్పలేదో. ఎన్నిసార్లు తను లాంతరు పట్టుకొని నిలబడితే అమ్మ ఆ గరాటు బాగు చేయలేదు! లేకుంటే ఎండాకాలం నీళ్ళుండవు. ఏటినించి మోసుకొని తెచ్చుకోవాలి. అమ్మ ఎందుకు అశ్రద్ధ

చేసిందో మరి! ఆమెకు ఉన్నట్టుండి వెన్ను జలదరించింది. ముందు అమ్మను చూడాలి. ఆపైన బైటకు వచ్చి గరాటు బాగుచేసుకోవచ్చు.

మళ్ళీ తలుపు తట్టింది, ఈసారి "అమ్మా" అని పిలుస్తూ.

లోపల అమ్మ తలుపు తెరిచేలోగా కుక్క మెడ నిమిరింది. "నేనొచ్చి ఎన్నేళ్ళయిందంటే, కుక్క కూడా నన్ను మర్చిపోయింది," అనుకుందామె బాధగా. చలికి గజగజా వొణుకుతూ మళ్ళీ తలుపు తట్టింది. తలుపు ఉన్నట్టుండి తెరుచుకోవడంతో, వెలుతురు కళ్ళ మీద పడి, చేతులు అడ్డం పెట్టుకుంది కళ్ళకి. తలుపు తెరిచింది అమ్మ కాదు. ఎవరో తెలియని ఆవిడ, లాంతరు ఎత్తి పట్టుకుంది. అమ్మేదీ?

లోపల ఇంకొక ఆమె, హాల్లో సోఫాలో పడుకోని చిన్న పిల్ల వున్నారు. ఎవరు వీళ్ళు? ఇంట్లో ఎందుకున్నారు? ఇంతకీ అమ్మేదీ? ఎవరూ ఏమీ మాట్లాడలేదు. లాంతరు పట్టుకోని తలుపు తెరిచినామె దగ్గరికొచ్చి తనని కూర్చోబెట్టింది. నిద్రపోతున్న మనిషికి నిద్రా భంగం కలిగించకూడదు, అన్నట్టు వాళ్ళంతా మెత్తగా నడుస్తూ మెల్లిగా మాట్లాడుతున్నారు. ఎవరో తన పెదవుల దగ్గరకి వెచ్చగా వుండే ద్రవమేదో తెచ్చారు. యాంత్రికంగా తాగింది. ఆమె ప్రశ్నలన్నిటికీ వాళ్ళ చూపుల్లోనే జవాబులు దొరికాయామెకి. ఇంతసేపటికి కుక్క ఆమెని గుర్తుపట్టి దగ్గరకొచ్చి నిలబడింది ప్రేమగా.

కొంతసేపటికి ఆమె లేచి నిలబడింది. తలుపు తెరిచిన స్త్రీ లాంతరు తీసుకొచ్చింది. ఆమె లేచి లాంతరు వెలుగులో అమ్మ గదిలోకెళ్ళింది. గది కిటికీలకున్న పరదాలు జరిపింది. ఏ కలలూ రాని నిద్రలో ప్రశాంతంగా వుంది, మంచం మీద పడుకోని వున్న అమ్మ మొహం, లాంతరు వెలుగులో.

***************

(మూలం: The Dreamer, Barbara Baynton)

*రచయిత పరిచయం : బార్బరా బేంటన్ (Barbara Baynton) పంతొమ్మిదీ/ ఇరవైయవ శతాబ్దాల్లో జీవించిన ఆస్ట్రేలియన్ రచయిత్రి. ఆస్ట్రేలియాలో శ్వేత జాతీయుల బ్రతుకుల గురించి హెన్రీ లాసన్, బేంజో పాటర్సన్ భావుకత్వమూ సాహసమూ నిండిన కథలు రాస్తే, బార్బరా ఆస్ట్రేలియాలో వలస స్త్రీల దుర్భరమైన ఏకాంతం గురించి రాసారు. ఆవిడ నిజానికి ఎక్కువగా రాసినట్టు లేదు. ఒక ఆరు కథలూ, ఒక నవలా కొన్ని వ్యాసాలు రాసి ప్రచురించారు. ఆవిడ జీవిత చరిత్ర గురించి అందుబాటులో వున్న సమాచారం చదివితే ఒక రచయిత్రి కన్నా మంచి వ్యవహార కర్తగా ప్రాక్టికల్ మనిషిలా అనిపిస్తారు.*

*ఆమె రాసిన పై కథ, The Dreamer, అనేక కారణాల వల్ల అద్భుతమైన కథ అని నా అభిప్రాయం. కథలో వుండే ఏ పాత్రకు కానీ, స్థలానికి కానీ పేర్లు వుండవు. కథలో వుండే నీరూ, గాలీ, వానా, అన్నీ ప్రతీకాత్మకాలే. కథలో చాలా విషయాలు కథకురాలు పాఠకుల ఊహకే వొదిలేస్తారు. ఎంతో నైపుణ్యం వుంటే కానీ అలా రాయటం సాధ్యం కాదు.*

*****************